ఆంధ్ర జ్యోతి సచిత్ర వారపత్రికనుంచి
పునర్ముద్రితము



# నీళ్ళరాని కళ్ళు

హరికిషన్



సర్వోదయ పబ్లిషర్సు
విజయవాడ-2
Phone No. 74645

నవోదయ ప్రచురణ నెం. 64
ప్రథమ ముద్రణ ఆగష్టు - 1973.

వెల - రు. 6-00

సంపాదకుడు :
మిషర్ రావ్

ముద్రణ :
శ్రీ మహాలక్ష్మి ప్రింటింగ్ ప్రెస్
సత్యనారాయణపురం.
విజయవాడ-11

త్యాగమూర్తి, నిస్వార్థ ప్రజాసేవకుడు




శ్రీ మండలి వెంకట కృష్ణారావుగారికి

(ఆంధ్రప్రదేశ్ మాజీ సాంఘిక సంక్షేమ శాఖామాత్యులు)

*

గౌరవపురస్సరంగా

అంకితం

గురించి వేదికలమీద ఉపన్యసించే వారందరికీ కనువిప్పు కలిగే తీరుగా తనకున్న అయిదెకరాల భూమినీ 20-6-73 న పదిమంది పేదప్రజలకు పంచిపెట్టారు.- ఆయన పేదప్రజల హృదయాలలో శాశ్వతంగా తిష్ట వేసిన మహామనీషి, రాజకీయాలలో ప్రజ్ఞాపాటవాలను ప్రదర్శించిన ధైర్యశాలి. నిస్వార్థంగా, నిరాడంబరంగా, నిర్విరామంగా కృషిసల్పుతూ ప్రజాసేవకే అంకితమైన రైతుబాంధవుడూ, ప్రజానాయకుడూ ఆయన.

శ్రీ మండలి శాంత స్వభావులు. ఆవేశం, ఆడంబరం, కృత్రిమ తత్వం కాగడాతో వెతికినా ఆయనలో కనిపించవు.

ఆయనది జాలిగుండె. బక్కవాడయినా, బలవంతుడైనా ఆయనకు ఒకటే.

అభివృద్ధి కార్యక్రమాలను ఆయన తలపెట్టినప్పుడు ఎవరో కొంత మంది ఎన్నో అడ్డంకులు కల్పించినా, ప్రతి కార్యక్రమాన్ని నిర్విఘ్నంగా జయప్రదంగా నిర్వహించగలిగిన ప్రజ్ఞాశాలి. తాను నమ్మిన సత్యాన్ని, కార్యక్రమాన్ని ఆచరణయోగ్యం చేయగల సాహసవంతుడు శ్రీ మండలి.

కష్టాలలో ఉన్న ప్రజలను కళ్ళారా చూడగానే వెన్నలా కరిగి పోయే సున్నితమైన మనస్సు.

ఆంధ్రప్రదేశ్ సాంఘిక సంక్షేమ శాఖామాత్యులుగా వారు ఎనలేని కృషి చేసి సక్రమ నిర్వహణకు ఎన్నోవిధాలుగా తగు సూచనలిచ్చి పేరు ప్రతిష్ఠలు గడించారు.

విశాలవదనంపై అనవరతం ఆయన ఎదుర్కొనబోయే సమస్యలు చూచేవారికి లీలగా కనుపించినా, దరహాస చంద్రికలు వెల్లివిరుస్తుండగా హృదయపూర్వకంగా మాట్లాడే శ్రీ మండలి వెంకట కృష్ణారావుగారిని ఎవ్వరూ, ఎన్నడూ మరువలేరు

అందుకే పాఠకుల ప్రశంసల నందుకున్న ఈ నవలను వారికి కృతజ్ఞతా భావంతో సవినయంగా సమర్పిస్తున్నాను.

4-8-1973,
విజయవాడ.

— రచయిత

శ్రీమండలి మానవతా దృక్పథం గల మహనీయుడు. పేదలన్నా, పెద్దలన్నా వారికి అమితమైన గౌరవము.

రైతుపెద్ద శ్రీ గొట్టిపాటి బ్రహ్మయ్యగారి షష్టిపూర్తి ఉత్సవానికు సన్మాన సంఘాధ్యక్షులుగా ఉండి 60 వేల రూపాయలు సేమకూర్చి బందరులో జిల్లాకాంగ్రెసు భవనముపై హాలును కట్టించి, శ్రీ బ్రహ్మయ్యగారిని బ్రహ్మాండముగా సన్మానించారు.

1957 లో పార్లమెంటు సభ్యులుగా శ్రీ కృష్ణారావుగారు బందరు పార్లమెంటు నియోజక వర్గమునకు కాంగ్రెసు అభ్యర్థిగా ఎన్నికయారు. అప్పటికి ఆయన వయస్సు ముప్పైసంవత్సరాలు మాత్రమే. ఆయన రాజకీయ జీవితానికీ, అంతచిన్న వయస్సులోనే ప్రజా హృదయాన్ని ఆయన ఎంత గాఢంగా చూరగొన్నదీ ఆ ఎన్నిక ఒక మచ్చు తునక.

అన్నిటికన్నా మిన్నయైనది దివి సీమను దివ్యసీమగా మార్చినారు. దివి సీమ మత్స్య పరిశ్రమ అభివృద్ధికీ, సహకార వ్యవసాయ పథకాలకూ ఆయన అత్యంత ప్రాధాన్యత ఇచ్చి అమలు జరిపించారు.

1964–69 లో కృష్ణాజిల్లా పరిషత్తు ఉపాధ్యక్షులుగా ఉండి పేద ప్రజల జీవనోపాధికి ఎన్నో రకాల పథకాలు తయారు చేయించి అమలు పరిచారు.

శ్రీ మండలిగారు తమ జీవితాన్ని సమాజ సేవకే అంకితంచేశారు. పదవి ఉన్నా లేకపోయినా ఆయన నిరాడంబరుడు, నిగర్వి. ఉన్నత లక్ష్యాలూ దృఢ సంకల్పమూ, ఋజు వర్తన ఆయన ఆదర్శాలు. పేదవాడు సంఘంలో మనిషిగా బ్రతకాలనేదే ఆయన ఆశయమూ, ఆకాంక్ష.

1972 లో అవనిగడ్డ నియోజక వర్గంనుంచీ ఆయన పోటీలేకుండా శాసన సభకు ఎన్నికయి, సాంఘిక సంక్షేమశాఖా మంత్రిగా నియమితులయారు.

చెప్పేది ఒకటి చేసేది ఒకటి ఆయన లక్షణం కాదు. చెప్పింది చేయటమే ఆయన లక్ష్యం.

తనకున్న ఆస్తిపాస్తుల వివరాలను బహిరంగముగా ప్రకటించి రాజకీయ నాయకులకు కనువిప్పు కలిగించిన ధీశాలి. భూసంస్కరణలను

గురించి వేదికలమీద ఉపన్యసించే వారందరికీ కనువిప్పు కలిగే తీరుగా తనకున్న అయిదెకరాల భూమినీ 20-6-73 న పదిమంది పేదప్రజలకు పంచిపెట్టారు. ఆయన పేదప్రజల హృదయాలలో శాశ్వతంగా తిష్ట వేసిన మహామనీషి, రాజకీయాలలో ప్రజ్ఞాపాటవాలను ప్రదర్శించిన ధైర్యశాలి. నిస్వార్థంగా, నిరాడంబరంగా, నిర్విరామంగా కృషిసల్పుతూ ప్రజాసేవకే అంకితమైన రైతుబాంధవుడూ, ప్రజానాయకుడూ ఆయన.

శ్రీ మండలి శాంత స్వభావులు. ఆవేశం, ఆడంబరం, కృత్రిమ తత్వం కాగడాతో వెతికినా ఆయనలో కనిపించవు.

ఆయనది జాలిగుండె. బక్కవాడయినా, బలవంతుడైనా ఆయనకు ఒకటే.

అభివృద్ధి కార్యక్రమాలను ఆయన తలపెట్టినప్పుడు ఎవరో కొంత మంది ఎన్నో అడ్డంకులు కల్పించినా, ప్రతి కార్యక్రమాన్ని నిర్విఘ్నంగా జయప్రదంగా నిర్వహించగలిగిన ప్రజ్ఞాశాలి. తాను నమ్మిన సత్యాన్ని, కార్యక్రమాన్ని ఆచరణయోగ్యం చేయగల సాహసవంతుడు శ్రీ మండలి.

కష్టాలలో ఉన్న ప్రజలను కళ్ళారా చూడగానే వెన్నలా కరిగి పోయే సున్నితమైన మనస్సు.

ఆంధ్రప్రదేశ్ సాంఘిక సంక్షేమ శాఖామాత్యులుగా వారు ఎనలేని కృషి చేసి సక్రమ నిర్వహణకు ఎన్నోవిధాలుగా తగు సూచనలిచ్చి పేరు ప్రతిష్ఠలు గడించారు.

విశాలవదనంపై అనవరతం ఆయన ఎదుర్కొనబోయే సమస్యలు చూచేవారికి లీలగా కనుపించినా, దరహాస చంద్రికలు వెల్లివిరుస్తుండగా హృదయపూర్వకంగా మాట్లాడే శ్రీ మండలి వెంకట కృష్ణారావుగారిని ఎవ్వరూ, ఎన్నడూ మరువలేరు

అందుకే పాఠకుల ప్రశంసల నందుకున్న ఈ నవలను వారికి కృతజ్ఞతా భావంతో సవినయంగా సమర్పిస్తున్నాను.

4-8-1973,
విజయవాడ.

— రచయిత

శ్రీమండలి మానవతా దృక్పథం గల మహనీయుడు. పేదలన్నా, పెద్దలన్నా వారికి అమితమైన గౌరవము.

రైతుపెద్ద శ్రీ గొట్టిపాటి బ్రహ్మయ్యగారి షష్టిపూర్తి ఉత్సవాలకు సన్మాన సంఘాధ్యక్షులుగా ఉండి 60 వేల రూపాయలు సమకూర్చి బందరులో జిల్లాకాంగ్రెసు భవనముపై హాలును కట్టించి, శ్రీ బ్రహ్మయ్యగారిని బ్రహ్మాండముగా సన్మానించారు.

1957 లో పార్లమెంటు సభ్యులుగా శ్రీ కృష్ణారావుగారు బందరు పార్లమెంటు నియోజక వర్గమునకు కాంగ్రెసు అభ్యర్థిగా ఎన్నికయారు. అప్పటికి ఆయన వయస్సు ముప్పైసంవత్సరాలు మాత్రమే ఆయన రాజకీయ జీవితానికీ, అంతచిన్న వయస్సులోనే ప్రజా హృదయాన్ని ఆయన ఎంత గాఢంగా చూరగొన్నదీ ఆ ఎన్నిక ఒక మచ్చు తునక.

అన్నిటికన్నా మిన్నయైనది దివి సీమను దివ్యసీమగా మార్చినారు. దివి సీమ మత్స్య పరిశ్రమ అభివృద్ధికీ, సహకార వ్యవసాయ పథకాలకూ ఆయన అత్యంత ప్రాధాన్యత ఇచ్చి అమలు జరిపించారు.

1964–69 లో కృష్ణాజిల్లా పరిషత్తు ఉపాధ్యక్షులుగా ఉండి పేద ప్రజల జీవనోపాధికి ఎన్నో రకాల పథకాలు తయారు చేయించి అమలు పరిచారు.

శ్రీ మండలిగారు తమ జీవితాన్ని సమాజ సేవకే అంకితంచేశారు. పదవి ఉన్నా లేకపోయినా ఆయన నిరాడంబరుడు, నిగర్వి. ఉన్నత లక్ష్యాలూ దృఢ సత్సంకల్పమూ, ఋజు వర్తన ఆయన ఆదర్శాలు. పేదవాడు సంఘంలో మనిషిగా బ్రతకాలనేదే ఆయన ఆశయమూ, ఆకాంక్ష.

1972 లో అవనిగడ్డ నియోజక వర్గంనుంచీ ఆయన పోటీలేకుండా శాసన సభకు ఎన్నికయి, సాంఘిక సంక్షేమశాఖా మంత్రిగా నియమితులయారు.

చెప్పేది ఒకటి చేసేది ఒకటి ఆయన లక్షణం కాదు చెప్పింది చేయటమే ఆయన లక్ష్యం.

తనకున్న ఆస్థిపాస్తుల వివరాలను బహిరంగముగా ప్రకటించి రాజకీయ నాయకులకు కనువిప్పు కలిగించిన ధీశాలి. భూసంస్కరణలను

# నీళ్ళు రాని కళ్ళు



**ఉదయం** పదకొండు గంటలైంది.

కోర్టుహాలంతా ప్లీడర్లతో, ప్రేక్షకులతో నిండిపోయింది. ఎవరి నోట విన్నా, ఎవరి మనసులో ఉన్నా ఈ కేసును గురించే. ఇంతకన్నా దారుణమైన హత్యలూ, బందిపోట్లూ, నడివీధిలో హత్యలూ, కత్తిపోట్లూ ఎన్నో జరిగాయి. కాని అవన్నీ విని ఊరుకున్న ప్రజానీకం ఈ కేసును గురించి అమితాసక్తితో, విభ్రాంతితో, విచారంతో గమనించసాగారు.

జడ్జిగారు సరిగ్గా పదకొండు గంటలకు తన స్థానంలో ఆశీనులయ్యారు. అంతా నిశ్శబ్దంగా కూర్చున్నారు. చోటులేక కొంతమంది గుమ్మాల వద్ద నిలబడ్డారు. మరికొంతమంది గోడవారన నిల్చున్నారు.

కూర్చున్నవారిలో తల వంచుకున్నవారు కన్నీళ్ళు పెట్టుకున్నారు. వారిలో సునంద, సత్యవతమ్మ, యశోధమ్మ, ఆనందరావూ, ఆనందరావు తండ్రి ఉమాపతీ ఉన్నారు. ఇంకా రామారావూ చాలామంది ఆఫీసువాళ్ళూ ఉన్నారు.

న్యాయమూర్తి ముద్దాయిని హాజరుపర్చమని ఆదేశించారు. ఇరువురు పోలీసుల మధ్యన ఉన్న ముద్దాయి బోనులో నిల్చున్నది. కోర్టు హాలులో ఉన్న అన్ని జతలకళ్ళు ముద్దాయివైపు కేంద్రీకరించబడ్డాయి.

ముద్దాయివైపు చేతితో చూపిస్తూ పబ్లిక్ ప్రాసిక్యూటర్ తన వాదనను ప్రారంభించాడు.

"యువరానర్. ఈ నిందితురాలు శ్రీమతి సుభాషిణి తన భర్తను దారుణంగా కత్తితో పొడిచి చంపివేసింది. భర్త అవినీతిపరుడు కావచ్చు, దొంగ కావచ్చు, జూదరి కావచ్చు. తన అన్నను తనభర్త చంపాడు. కాని ఆ ముద్దాయిని శిక్షించే హక్కు కోర్టువారికే తప్ప ఆమెకు లేదు. భర్తతో కాపురం చేస్తున్న ఇల్లాలు, ఇద్దరు బిడ్డలతల్లి, ఒక ప్రభుత్వ కార్యాలయంలో ఉద్యోగం చేస్తున్న ప్రభుత్వోద్యోగి,యుక్తాయుక్త విచక్షణాజ్ఞానంకల చదువుకున్న యువతి. ఈ ముద్దాయిగా నిలపబడిన ఈమె తన భర్తను దారుణంగా హత్య చేసింది. ఈ ముద్దాయిని కోర్టువారు విచారించి తగిన శిక్ష విధించాలని మనవి చేస్తున్నాను" అని కూర్చున్నారు పబ్లిక్ ప్రాసిక్యూటర్.

"ఏమమ్మా, నీమీద మోపబడిన ఈ హత్యానేరానికి నీ సమాధానం. నీ తరఫున వాదించడానికి డిఫెన్స్‌లాయర్ ఎవరయినా ఉన్నారా ?" ముద్దాయి సుభాషిణిని ప్రశ్నించాడు న్యాయమూర్తి.

ముద్దాయి సుభాషిణి ఒక్కసారి తలెత్తి అందరివంకా చూసి మళ్ళీ తలవంచుకున్నది.

"కోర్టువారు అడిగిన ప్రశ్నలకు ముద్దాయి సమాధానం చెప్పాలమ్మా" అన్నాడు న్యాయమూర్తి.

"ఒక హత్యా నేరంలో డిఫెన్స్‌లాయర్ని పెట్టుకునే ఆర్థికస్తోమతే ఉంటే అసలు హత్య చెయ్యవలసిన అవసరమే లేదు".

"ఆర్థిక స్తోమత కారణంగానే ఈ హత్య చేయవలసిన పరిస్థితి వచ్చిందంటావా".

"హత్యకు కారణం ఒక్క ఆర్థికక్షోమతే కాదు. మర్యాద, గౌరవం, కరుడుకట్టిపోయిన ఆవేదన. కాని ఇవన్నీ కోర్టువారికి తెలియవు".

"నీ భర్త, అన్న, నిన్ను హింసించేవారా, నీ ప్రవర్తనలో ఏదైనా దోషం ఉన్నదని ఆరోపించారా ?"

సుభాషిణి హృదయం ఆక్రోశించింది. జుగుప్సాకరంగా న్యాయ మూర్తివైపు చూసింది.

"క్షమించండి. నా ప్రవర్తనలో దోషంఉంటే పబ్లిక్ ప్రాసిక్యూటర్ గారు తన వాదనలో నన్ను గురించి భర్తతో కాపురం చేస్తున్న ఇల్లాలుగా, ఇద్దరు బిడ్డల తల్లిగా పవిత్ర హృదయంతో చెప్పేవారే కాదేమో. నేను హంతకురాల్నికాని, అపవిత్రురాల్ని కాదు న్యాయమూర్తీ," అన్నది సుభాషిణి.

యావన్మంది జాలిగాచూసి నిట్టూర్పు విడిచారు.

"మరి ఈ దారుణహత్య ఎందుకు చేశావమ్మా ?" న్యాయమూర్తి ప్రశ్నించాడు.

"అశేష బంధుమిత్రుల సమక్షంలో, మంగళ వాయిద్యాలు మారు మ్రోగుతుండగా మా వివాహం జరిగింది. కాని అన్ని భవబంధాలు తెంచు కుని, రాగల పరిణామాలు తెలిసే ఈ హత్య చేశాను. ముద్దాయినైన నేను నేరాన్ని త్రికరణశుద్ధిగా ఒప్పుకున్నప్పుడు ఇంకా కారణాలు ఎంచవలసిన పనిలేదేమో ? నాకు మరణశిక్ష విధించండి న్యాయమూర్తీ" వేడుకుంటు న్నట్లుగా అన్నది సుభాషిణి.

"నేరాన్ని ఒప్పుకున్నంత మాత్రాన శిక్ష పడదమ్మా. కారణాలు కావాలి, విచారణ జరగాలి. చట్టప్రకారం శిక్ష పడుతుంది. చట్టాన్ని అమలు పర్చటానికి విచారణ జరగాలి. విచారణలో అన్ని విషయాలూ ధృవపడాలి.

నువ్వు చెప్పదల్చుకున్న విషయాలన్నీ నిస్సందేహంగా చెప్పమని ఆదేశిస్తున్నాను" అన్నాడు న్యాయమూర్తి.

"నేరం జరిగాక అందుకు కారణాలు చెప్పమనే ఈ చట్టాలూ, న్యాయస్థానాలూ, అసలు నేరాలు జరగటానికిగల కారణాలు పరిశీలించి, ఆ కలుషిత వాతావరణాన్ని నిర్మూలిస్తే ఈ నేరాలు జరగవు. నాబోటి అభాగ్య గృహిణుల కాపరాలూ బాగుపడడానికి ఎంతయినా సావకాశమూ ఉన్నది".

"న్యాయస్థానాన్ని విమర్శించే హక్కు నీకు లేదమ్మా. నువ్విప్పుడు ముద్దాయివి. హత్యా నేరానికి దారితీసిన విషయాలే కోర్టువారి ఎదుట చెప్పాలికాని, అనవసర ప్రస్తావనచేసి చట్టాల్నీ, న్యాయస్థానాన్ని విమర్శించ వద్దని మరొకసారి హెచ్చరిస్తున్నాను" కోపాన్ని చూపిస్తూ అన్నాడు న్యాయమూర్తి.

"క్షమించండి. ఇద్దరు బిడ్డల తల్లి, భర్తతో కాపురంచేస్తున్న ఒక ఇల్లాలు, ప్రభుత్వ కార్యాలయంలో ఉద్యోగం చేస్తున్న ఒక ఉద్యోగిని హత్య చేసిందంటే ఆ స్త్రీ జీవితం ఎంత విసిగి, వేసారి, కరుడుకట్టుకు పోయిందో ఈ కోర్టువారికీ, ప్రేక్షకులకూ తెలియదు. వీరంతా హంతకురాలినైన నన్ను వింతగా చూట్టానికి వచ్చారు. ఈ పాపాత్మురాల్నీ, ఖూనీ కోరునీ చూట్టానికి వచ్చారు. కాని ఒక స్త్రీ ఈ పరిస్థితికి వచ్చి న్యాయస్థానంలో ముద్దాయిగా నిలబడేకన్నా, ఇద్దరు బిడ్డలకూ దూరమై, శాశ్వతంగా ఈ లోకంనుంచే నిష్క్రమించ బోతున్నదంటే అందుకుగల బలీయమైన కారణాన్ని మీరంతా తెలుసుకోబోతున్నారేకాని నా బిడ్డల భవిష్యత్తుగురించి ఆలోచించటానికి కాదు. పోనీండి, కన్నతల్లే హంతకురాలయినప్పుడు ఆ బిడ్డల్ని గురించి మీరు ఆలోచించవలసిన అవసరమే లేదు.

"నా స్థితికి నేను విచారించటం లేదు. నా కథ విన్న ఈ అశేష ప్రేక్షకులూ తమ సంసార జీవితాల్లో ఇటువంటి కలతలూ, సంఘటనలూ

జరగనీయకుండా తమ కాపురాల్ని తీర్చిదిద్దుకుంటే ఈ హంతకురాలిమీద మీరు జాలి కనబర్చినట్లే. నాకు కావలసింది శిక్ష, మీకు కావలసింది నా కథ. నా ఆత్మశాంతికి కావలసింది నాలాంటి అభాగ్యులు ఈ సంఘంలో లేక పోవటమే. అందుకు తగిన వాతావరణం ఆ భర్తలు కలిగించటమే. అదే ఈ జీవితంలో ఈ ఆఖరు క్షణంలో నాకు కలిగే ఆత్మశాంతి.

ఇంకొక్క మాట. ఆత్మ ఉన్నవాళ్ళే నా కథ వినండి. ఆత్మకలవారే ఈ కథ విని ఒక్క కన్నీటిబొట్టు రాల్చండి. ఆత్మాభిమానం కలవారే నేను చేసింది తప్పో ఒప్పో నిర్ణయించండి" అన్నది సుభాషిణి.

"మా నాన్నగారి పేరు రాజగోపాలరావుగారు. ఆయన ఎలిమెంటరీ స్కూలు టీచరు. దైవభక్తి, పాపచింతన కలవారైనా ఆయన్ని భగవంతుడే అన్యాయం చేశాడు కాని ఈ లోకం కాదు. భగవంతుని దృష్టిలో అందరూ సమానమే నంటారు. కాని ఒకడు రోగి, ఒకడు భోగి. ఒకడికి అక్షరజ్ఞానం అంటదు. మరొకడు గవర్నరు. ఇదంతా చూస్తే భగవంతుడు కూడా పెద్ద రాజకీయవేత్త, అవకాశవాది. ఎవ్వరూ ఏమీ చెయ్యలేరు. కర్మ అంటారు కర్మజ్ఞానం కలవారు. కొంతమంది కర్మ అంటే మానవుడి అసమర్థతకు మారుపేరంటారు.

ఈలాంటి కర్మమార్గ జీవితానికి ప్రతీక మా నాన్నగారు. మా అమ్మగారు సత్యవతమ్మ. ఎలిమెంటరీ స్కూలు టీచరు భార్యకు ఉండవలసిన అన్ని మంచి లక్షణాలూ మా అమ్మకు ఉన్నాయి.

నలుగురు పిల్లల్లో అక్కయ్య సునంద పెద్దది. తరువాత మా అన్నయ్య వాణీనాథం, తరువాత నేను, నా తరువాత తమ్ముడు గోపీ.

పేదవారయినా, గొప్పవారైనా చిన్నపిల్లల మనస్తత్వాలు చంచల

మైనవి, ఈ చంచల మనస్కులైన పిల్లల కోరికలు తీర్చటంలో పెద్దవాళ్లు తీసుకునే చొరవ వాళ్ళ ఆర్థిక పరిస్థితిమీదనే ఆధారపడి ఉంటుంది.

ఆ రోజుల్లో నాకు కొద్దిగా గుర్తు. గోదావరి పుష్కరాలు జరుగుతూఉన్న రోజుల్లో రాజమండ్రిలో ప్రతిరోజూ అమ్మా, నాన్నా స్నానానికి వెళ్ళేవారు. జనం ఎక్కువగా ఉంటారనీ, అంటువ్యాధులు సోకుతాయనీ, పిల్లల్ని ఎత్తుకుపోయేవాళ్ళు ఉంటారనీ, ఏవేవో కబుర్లుచెప్పి మా నలుగురు పిల్లల్నీ పుష్కరాల్లో నాన్నగారు స్నానానికి తీసుకువెళ్ళలేదు. తొమ్మిదో రోజున నేను, అన్నయ్యా బాగా మారాం చేశాం. మా గొడవ పడలేక ఆ రోజున స్నానాలకు తీసుకువెళ్ళటానికి నాన్నగారు ఒప్పుకున్నారు. అమిత సంతోషంతో మేం నలుగురు పిల్లలం బయల్దేరాం.

నలుగురి పిల్లల్ని ముందు స్నానంచేయించి చీడీలమీద నిల్చోపెమన్నారు. అమ్మ, నాన్న మంత్రాలు చదువుతూ స్నానం చేస్తున్నారు. అక్కయ్య, నేను, అన్నయ్య ఎంతో ఉత్సాహంతో, ఆసక్తిగా ఆ జన సందోహాన్ని చూస్తూ నిల్చొని మూడేళ్ళ తమ్ముణ్ని చూడనేలేదు. వాడి పేరు గోపాలరావని పెట్టేరు. కాని ముద్దుగా గోపీ అనేవాళ్ళం.

అమ్మా, నాన్నా స్నానంచేసి వచ్చి తడిబట్టలు పిండుకుంటూ వచ్చి "గోపీ ఏడీ" అన్నారు. చుట్టూ చూశాం గోపీ లేడు. ఆ తడి బట్టలతోనే గుండెలు బాదుకుంటూ అమ్మా, నాన్నా ఆ ప్రాంతమంతా వెదికేరు. గోపీ కనుపించలేదు. అమ్మ ఏడుస్తున్నది. నాన్న కేకలేస్తున్నాడు. "నేను వద్దంటే నువ్వే వాళ్ళని బయల్దేరతీశావ్, అఘోరించు" అని నాన్న ఆరోపణ. పోలీసు రిపోర్టు ఇచ్చారు. లౌడ్‌స్పీకరులో చెప్పించారు. గోపీ కనబడలేదు.

అందరం ఏడుస్తూ ఇంటికి వెళ్ళాం. మా కుటుంబంలో ఆ రోజు నుండే అన్ని కష్టాలూ ప్రారంభమయ్యాయి. గోపీ చచ్చిపోయాడనే నిర్ధా

ణకు వచ్చాం. వాడి విషయం యింతవరకూ ఎవరికీ తెలీదు. బహుశా చచ్చిపోయే ఉంటాడు.

అక్కయ్యకు పదేళ్ళు. మా అందరి మధ్యా ఒక్కొక్కరికి రెండేళ్లు తేడా. అప్పటికి గోపీ మాయబడి రెండేళ్ళయింది. చిన్న పిల్లల మాటలూ, మనస్తత్వాలూ చిన్నప్పుడు తెలీవు. అవి ముద్దుమాటలనుకుంటారు. ఒక వేళ తల్లిదండ్రులకు తెల్సినా ఆ లోపం ఇతరులకు తెలుస్తుందేమోనని కప్పిపుచ్చుకుంటారు.

అక్కయ్యకు పదేళ్ళొచ్చాకగాని ఆ లోపం బాగా తెలీలేదు. అక్కయ్య అమాయకురాలు, వయస్సుకు తగ్గ తెలివితేటలు లేవు. కొత్త వాళ్ళు ఎవరయినా ఇంటికివస్తే వాళ్ళ దగ్గరకు వెళ్ళి ఎదురుగా నిల్చుంటుంది. పావుగంటసేపు వెకిలిగా చూస్తూ నవ్వుతూ "నీ పేరు" అనేది. వాళ్లు పేరు చెప్పేవారు. "బావుంది, బావుంది" అని చప్పట్లుకొడుతూ ఇవతలకు వచ్చేసేది. దాని కంటికి వాళ్ళు నచ్చకపోతే "ఒంటిపిల్లిరాకాసి" అనేది.

ఈ వెకిలితనం తప్పించాలని ఎన్నోసార్లు అమ్మ, నాన్న కేకలేసేవారు. వినేదికాదు. పదేళ్ళు వచ్చినా పేర్ల పుస్తకం పూర్తిగా చదవలేకపోయేది.

అక్కయ్యకు పధ్నాలుగేళ్లు వచ్చాయి. మనస్సూ, తెలివితేటలూ లేకపోయినా ఏపుగా ఎదిగి అందంగా చూడముచ్చటగా ఉండేది. శారీరకంగా పెళ్ళీడు వచ్చినా దాని తెలివితేటలకు వయస్సు రాలేదు. వెకిలితనానికి మాత్రమే వయసొచ్చింది. ఈ ఈడొచ్చిన వెకిలిదాన్ని చూచి అమ్మా, నాన్న ఎంతో కుమిలిపోయేవారు. డాక్టర్లకు చూపిస్తే పుటకలో ఉన్నదానికి మందులేదన్నారు. పధ్నాలుగేళ్ళ అక్కయ్య మూడోక్లాసు పుస్తకం చదువుతూ ఉండేది. దాని వెకిలితనం బయటపడకుండా వుంటానికి అమ్మ దాన్నెప్పుడూ వీధిలోకి వెళ్ళనిచ్చేదికాదు. కాని దాని పరిస్థితి బంధువులకూ, చుటుపక్కలవారికీ తెలిసిపోయింది.

నేనూ పదేళ్ళ పిల్లని. సెకండ్ ఫారంలోకి వచ్చాను. అన్నయ్య వాణీనాథం పన్నెండేళ్ళవాడు. వాడికీ చదువు అబ్బలేదు. వాడూ సెకండ్ ఫారం చదివేవాడు. ఆ వయస్సులోనే సిగరెట్లు చాటుగా కాల్చేవాడు. క్లాసు పిల్లలతో కజ్జాలు పెంచుకునేవాడు. చిన్నవాళ్ళను కొట్టేవాడు. పెద్ద వాళ్ళతో దబాయించి, మొరాయించి మాట్లాడేవాడు.

ఈ సంసార పరిస్థితులు చూసి నాన్న విసిగి వేసారిపోయేవారు. అమ్మ తల్లడిల్లిపోయేది. నేనే కాస్త ధైర్యం చెప్పేదాన్ని.

కాలం ఎవరికోసం ఆగదు. మరో రెండేళ్ళు గడిచాయి. అక్కయ్య బాగా ఎదిగింది. పెళ్ళి చెయ్యాలి. దాని అందంచూసి ఎవరయినా మోస పోయి పెళ్ళిచేసుకోవాలి. నోరు మెదిపితే దాని వెకిలితనం బైటపడి పోతుంది.

పిల్లను చూడ్డానికి వచ్చినవాళ్లు "నీ పేరేమిటమ్మా ? ఏం చదువు కున్నావు" అని ఎంతో సంతోషంతో అడిగేవాళ్ళు. చూసేవాళ్ళకు రంభలా ఉండేది. ప్రతి పెళ్ళికొడుకూ ముచ్చటగా చూసేవాడు. ఈ అందాల భామను తప్పకుండా పెళ్ళాడాలని మనస్సులో మురిసిపోయేవారు.

"నా పేరా సునంద. మూడోక్లాసు చదువుకున్నా. ఉండండీ పుస్త కాలు చూద్దురుగాని, మీ బళ్ళోనూ ఈ ఆంధ్రవాచకమేనా" అనేది.

పెళ్ళి చూపులకు వచ్చినవాళ్ళు విస్తుపోయేవారు. పెళ్ళికొడుక్కి ముఖాన కత్తివేసినా నెత్తురుచుక్క ఉండేదికాదు. ఈ పిల్ల వెకిలిది, పిచ్చిది, అమాయకురాలు, బుద్ధిలేదు. ఇట్లా ఎవరికి తోచినట్లు వాళ్ళని వెళ్ళిపోయే వారు.

ఇట్లా పాతిక సంబంధాలు వచ్చాయి. ఏదీ కుదరలేదు. అమ్మా, నాన్నా దిగులుపడిపోయారు.

అక్కయ్యకు పద్దెనిమిదో ఏడు వచ్చింది. అన్నయ్యకు పదహారు, నాకు పధ్నాలుగో ఏడు.

అన్నయ్య స్కూల్ ఫైనల్ తప్పాడు. నేను పాసయ్యాను. అక్కయ్య అందం చిందులు వేయసాగింది. తెలివి తేటలకూ, మెదడు ఉండవలసిన అందచందాలు శరీరానికి ఉన్నాయి. ఈ వెర్రిబాగుల్దాన్ని ఎవరయినా చెడకొడతారేమోనని అమ్మ భయపడి పోయేది. వీధిగుమ్మం దాటనిచ్చేదికాదు. ఎంతో కష్టపడి చెపుతూ ఇంటిపని నేర్పేది. వంటపని దగ్గరవుండి చెప్పి చేయించేది. ఆరుమాసాలకు అక్కయ్యకు అన్నం వండటం వచ్చింది, కూరలు తరగటం వచ్చింది. మిగతా వంట ఇంకా రాలేదు.

అన్నయ్య చదువు మానేశాడు. నాన్నకు ఇక చదువుకోనని ఎదురు తిరిగాడు. గట్టిగా మాట్లాడితే ఇంట్లోనుంచి వెళ్ళిపోతాననే వాడు.

"ఇంత రౌడీగా మారిపోయావేంరా" అని తలబాదుకుంది.

"ఈ రోజుల్లో వాళ్ళే బాగా చలామణీ అయి డబ్బు సంపాయిస్తున్నారు నా సంగతెందుకుగానీ అక్కయ్యకు పెళ్ళిచెయ్యండి. ఎవడయినా లేపుకు పోగలడు" అన్నాడు. ఈ మాటలు విన్న నాన్న హృదయం ఆక్రోశించింది. అప్పుడు నేనూ ఉన్నాను. అన్నయ్య దవడలు నాన్న చేతుల్లో పేలిపోయాయి. అంతే !

అన్నయ్య చర్యలు ద్వితీయ దశలోకి వెళ్ళాయి. అన్నయ్య రౌడీగానే మారాడు ఏం చేశేవాడో తెలీదు. వాడి రాకపోకలకూ, భోజనానికి ఒక వేళంటూలేదు. నాన్నని రూపాయి అడిగేవాడుకాదు. రూపాయి తను ఇచ్చేవాడుకాదు. వాడి ఖర్చులకు ఎప్పుడూ డబ్బులుండేవి.

ఒకరోజున అక్కయ్య నాన్నతో అన్నది. "నాకు మళ్ళీ పెళ్ళి సంబంధాలు చూడటంలేదేం."

"నిన్నెవడు చేసుకుంటాడే బుద్ధిలేని వాడెవడయినా నిన్ను పెళ్ళాడాలి"

"అదే అలాంటివాడు కనబళ్ళేదూ ఈ రాజమండ్రిలో కాపోతే కాకినాడ. లేకపోతే ఏలూరు" అన్నది.

నాన్నకు నిజంగా కళ్ళంట నీళ్ళొచ్చాయి. ఇంత అందాల బొమ్మకు ఈ కర్మ ఏమిటా అని కుళ్ళిపోయేవాడు.

"ఉన్న ఇల్లూ వాకిలి అమ్మి కట్నం ఇచ్చి నీకు మంచి సంబంధం చూసి పెళ్ళిచేస్తాను. వెకిలిగా మాట్లాడకుండా భర్తకు అన్నం వండి పెడుతూ నీ కాపురం గుట్టుగా చేసుకుంటావా సునందా" అన్నాడు నాన్న.

"ఆ మాత్రం తెలీదూ. పెళ్ళి చెయ్యండి. అన్నీ తెలుస్తాయి. ఎన్నేళ్ళని గుండెలమీద వేడి నిప్పుల కుంపటిగా వుండను" అన్నది అక్కయ్య.

నాన్న తీవ్రంగా వరాన్వేషణ ప్రారంభించారు. ఉన్న ఆ కాస్త పెంకుటిల్లు ఎనిమిది వేలకు అమ్మేశారు.

మళ్ళీ వరాన్వేషణ ప్రారంభించారు నాన్న. రెండు జతల చెప్పులు అరిగాయి. పెళ్ళిచూపుల సందర్భంలో ఎట్లా ఉండవల్సింది అక్కయ్యకు నేర్పాను. నేను పెళ్ళికొడుకుగా అక్కయ్య పెళ్ళికూతురుగా రిహార్సలు వేయించాను.

కళ్యాణం వచ్చినా, కక్కొచ్చినా ఆగదంటారు. అక్కయ్యను పెళ్ళాడ్డానికి ఆనందరావనే ఆయన ఒప్పుకున్నారు. పెళ్ళిచూపులప్పుడు అక్కయ్య వెకిలితనం బయటపడలేదు మాటల్లో అమాయకత్వం మాత్రమే అతనికి తెల్సింది. పెళ్ళికొడుకుతో నాన్నగారు అన్నారు.

"అమ్మాయి అందచందాలు చూశారు. చదువు కాస్త తక్కువ. కొంచెం అమాయకురాలు. చెపితే తెల్సుకుంటుంది."

"పరావాలేదండి. నాకు కావలసింది అమాయకురాలే. కాకపోయినా మీ అమ్మాయి అందం అమాయకత్వాన్ని కప్పేస్తుంది."

నాన్న కట్నం సంగతి కదిలించారు. ఆరువేలు కావాలన్నారు నాన్నగారు ఒప్పుకున్నారు. కారణం పెళ్ళికొడుకు గవర్నమెంటు ఉద్యోగం చేస్తున్నాడు. అత్తా, ఆడబిడ్డలు లేరు. తండ్రి రిటైరయినాడు. ఈ కొడుకు దగ్గిరే ఉంటాడు. ఒక్కడే కొడుకు. పెళ్ళికొడుక్కి కాకినాడలో ఉద్యోగం, స్వంత ఇల్లు కాకినాడలో వున్నది.

ఒక సుముహూర్తాన ఆరువేల కట్నంతో, రెండువేలు పై ఖర్చులతో అక్కయ్య పెళ్ళయిం . తల దాచుకునేందుకు ఇల్లు లేకపోయినా ఈ పెద్దవాగుల్దానికి పెళ్ళిచేసి కన్నె చెర వదిలించుకున్నామనే తృప్తితో అమ్మా, నాన్నా సంతోషపడ్డారు. నేనూ ఎంతో సంతోషించాను.

మొదటిరాత్రి గదిలోకి పంపేరు మర్నాడు అక్కయ్య సంతోషంగానే ఉన్నది. బావ ముఖం వెల వెల బోయింది. బావ నాన్నతో అన్నాడు.

'వెకిలితనానికీ. అమాయకత్వానికి చాలా తేడా ఉంది మావ గారూ.''

''ఏం బాబూ '.

''ఆడపిల్లకు అందమూ, స్త్రీత్వమే కాదు కావలసింది. అమాయకురాలయినా సహించవచ్చు కాని వెకిలిచేష్టలు సహించలేం.''

''అంత పొరపాటుగా మాట్లాడింది.''

''కాదు నేనే పొరబాటుగా మీ అమ్మాయిని అర్థం చేసుకున్నాను. రెండుమూడు నెల్లు అత్తగార్ని మా ఇంట్లో ఉంచి మా కాపురం చూడమనండి. వెకిలితనం పూర్తిగా రూపు మాసిపోవాలి.''

ఏదో గట్టి నిర్ణయానికే వచ్చినట్లు అన్నాడు బావ.

అక్కయ్య కాపురానికి వెళ్లేటప్పుడు అమ్మకూడా వెళ్ళింది.

ఈ విషయాలన్నీ అమ్మ చెప్పింది. రోజూ రాత్రి నిద్రపోయే ముందూ, ఉదయం లేవగానే బావ పాదాలకు నమస్కరించి మంగళ సూత్రాలు కళ్ళకు అద్దుకునేదట.

''పాదాలకు నమస్కరించి మంగళ సూత్రాలు కళ్ళకు అద్దుకోవాలని ఎవరు చెప్పారు,'' అన్నాడు బావ.

''మా అమ్మ చెప్పింది. తప్పా.''

''తప్పనికాదు. నీలో ఇటువంటి భావాలు ఉన్నాయని నాకు తెలీదులే.''

''ఏమిటో గొడవగా ఉంది. అది పతివ్రతల లక్షణంట. నేనయితే ఎవర్నీ చూళ్ళేదు పోనీ మీరు చెప్పండి ఎట్లా ఉండాలో హ్హహ్హహ్హ'' అని

నవ్వించదట, అట్లాంటి నవ్వు అక్కయ్య ఎప్పుడో కాని నవ్వదు. దాని కున్న అమాయకపు భావాలకు ఎంతో ఆనందం కలిగితే దానికంటి చూపు కూడా వెకిలిగా మారిపోయి అంతకన్న వెకిలిగా నవ్వుతూ తొడమీద కొట్టుకుని చప్పట్లు కొడుతుంది. పెళ్ళయాక ఈ వెకిలిచూపూ, వెకిలినవ్వూ కొంచెం అధికమయాయి. కాపురానికి వెళ్ళాక బావంటే తనకు భర్తకదా, గౌరవంగా, ప్రేమగా, అణకువగా ఉండాలని దానికి తెలీదు. ఉన్నట్లుండి ఒక్కసారి కౌగిలించుకుని వెకిలిగా నవ్వేదిట. అది వయస్సులోఉన్న ఉద్రేకమూకాదు, భర్తంటే అతి చనువుగా ఎట్లా మాటాడినా నవ్వినా, ముట్టుకున్నా ఫరవాలేదనే ఒక మగమనిషి,

"చూడు సునందా, నువ్విట్లా వెకిలిగాప్రవర్తించకూడదు. ఎవరైనా చూస్తే ఏమనుకుంటారు, నీ మీద అందరికీ చిన్నచూపుగా ఉంటుంది" అన్నాడు బావ,

"మనిద్దరం ఒకళ్ళ నొకళ్ళం పెళ్ళి చేసుకున్నాం, నా మెళ్ళో బంగారపు మంగళ సూత్రాలు కట్టారు, మనం ఎట్లానయినా ఉండచ్చు, ఏం తప్పులేదు పోనీ ఎట్లా ఉండాలో మీరు చెప్పండి."

"చక్కగా నవ్వుతూ ప్రేమగా, గౌరవంగా,సిగ్గుగా మాట్లాడాలి, నీ చూపుల్లో వెకిలితనం రాకూడదు. మన పక్కింటి రాజ్యలక్ష్మి చూడు ఎట్లావుందో. అట్లా ఉండటం నేర్చుకో."

మర్నాడు మధ్యాహ్నం భోజనాలయాయి, బావ ఆఫీసుకు వెళ్ళాడు, అమ్మకాస్త నడుంవాల్చింది. అక్కయ్య పక్కింటి రాజ్యలక్ష్మిగారింటికి వెళ్ళింది. అక్కయ్య మనస్తత్వం ఆవిడకూ అంతుపట్టలేదు, అందుకని ఏ అభిప్రాయానికి ఆవిడ రాలేదు.

"మీ వారు మిమ్మల్ని పెళ్ళి చేసుకున్నవారే కదూ" అన్నది అక్కయ్య. ఆవిడకోపం తారస్థాయికి వెళ్ళినా తమాయించుకుని-

"అవును" అన్నది,

"వారంటే ప్రేమగా, నవ్వుతూ, సిగ్గుగా,గౌరవంగా వుంటారా"

"భర్తని అట్లా చూడాలంటే ఏం చెయ్యాలి"

"ఏమీ చెయ్యక్కర్లేదు. మన మనస్సులో మెదిలే భావాలే మన చేత ఏ సమయంలో ఏం చెయ్యాలో అటా చేయిస్తాయి. నువ్వట్టా చెయ్యటం లేదా" నవ్వుతూ అడిగిందావిడ.

"నాకు మనసులో భావాలేం మెదలటం లేదే చనువుగా ఉంటాం కదా. ఎవరి మీదో గౌరవం ఎందుకూ ఆయనే పాఠాలు చెప్పే మాస్టారా నమస్కారం అనేందుకూ, ఎప్పుడు పడితే అప్పుడు కావిలించుకో రాదేం"

సునంద మొద్దు పిల్లని ఆవిడకు అర్థమైంది. పైకి నవ్వినా లోపల సానుభూతి లేకపోలేదు.

"లేదమ్మా ప్రతీ పనికి ఏ సమయా సమయాలుంటాయి. ఆకలయిం దనగానే, స్నానం చేస్తూ అన్నం తింటావా. ఏం చేసినా కాస్త ఆలోచించి చెయ్యాలి"

"భలేవారే. భర్తంటే నాకు గౌరవం లేకపోలేదు. రోజూ కాళ్ళకు దణ్ణంపెట్టి మంగళసూత్రం కళ్ళకద్దుకుంటాను. మీరూ అట్లా చేస్తారా"

"లేదమ్మా. కాని అట్లా చెయ్యటం మంచిదే"

"మంచిదయితే ఎందుకు చెయ్యరు. మీరు పతివ్రత కాదన్నమాట. నేను పతివ్రతని. పూర్వం పతివ్రతలు అట్లా చేసేవాళ్ళట."

ఆవిడ ఏం చెప్పాలో అర్థంకాక నవ్వింది.

"అట్లా చేస్తే పెళ్ళాడిన భర్త దృష్టిలో మనం తేలికయిపోతాం. మనల్ని వాళ్ళు లెక్కచెయ్యక ఆడిస్తారు. మనం కూడా వ్యక్తిత్వాన్ని కాపాడుకోవాలి. పాతివ్రత్యం ప్రవర్తనలో ఉండాలి. పరపురుషుణ్ని వాంఛించకూడదు. ప్రేమానురాగాలు-నిత్యజీవితంలో దానంతట అది మనం మసులుకునే తీరులోనే ఉంటుంది. కాని కాళ్ళకు దణ్ణంపెట్టి వెకిలిగా నవ్వినంత మాత్రం చేతరాదు"

"బాగుంది బాగుంది. ఇవాళ నుంచీ దణ్ణం పెట్టటం మానేస్తాను. ప్రేమగా మసులుకుంటాను."

అని వచ్చేసింది. రెండు రోజులు గడిచాయి. అక్కయ్య బావ పాదాలకు దణ్ణం పెట్టటం మానేసింది. బావ అడిగాడు.

"నేనూ తెలికయిపోతాను. అందుకని దణ్ణం పెట్టటం మానేశాను. ప్రేమగా మసులుకుంటాను"

"అట్లా అని ఎవరు చెప్పారు"

"ప్రక్కింటావిడ"

అమ్మ రోజూ దగరుండి చెప్పి వంటచేయించేది. ఎంతదగ్గరుండి చేయించినా వంటలో ఏదో లోపం జరిగేది.

"సునందకు వంట చెయ్యటం కూడా చేతకాకుండా పెంచారేం అత్తయ్యా."

"దానిచేతే చేయిస్తున్నాను. పదార్థాలో ఏమైనా తక్కువైందా బాబూ"

"అవును, ఇన్నాళ్ళనుంచి మా నాన్నగారు లేరు, ఆయన పూ ఊరెళ్ళి నెలయింది, రేపే వస్తానని ఉత్తరం వచ్చింది ఆయనకు విసుగుదల జాస్తి, సునందకు అన్ని పన్లూ జాగ్రత్తగా నేర్పండి. ఆ వెకిలితనం పోవాలి"

"అట్లాగే బాబూ" అన్నది అమ్మ. ఈ మాటలన్నీ అక్కయ్య విన్నది.

"మీతో ప్రేమగా ఉండాలని ఎట్లా మసులుకోవాలా అనే ఆలోచిస్తున్నా. కూరలో రెండుసార్లు ఉప్పుపడ్డది. ఆ వ్యక్తిత్వం అంటే ఏమిటబ్బా"

బావకు పట్టరాని కోపం వచ్చి "నీ బొంద నా శ్రాద్ధం" అని విసుక్కుంటూ వెళ్ళిపోయారు.

ఆ మర్నాడు ఉదయమే అక్కయ్య మావగారు ఉమాపతి గారొచ్చారు ఆయన పల్లెటూరి వ్యవహార్త. ప్రయివేట్లు చేస్తూ వుంటాడు. పెళ్ళయిన నాలుగో రోజునే ఆయన వాళ్ళ ఊరెళ్ళిపోయాడు కోడలు పరిసితి ఆయనకు తెలీదు.

"పెళ్ళయిన నాలుగో రోజునే వెళ్ళిపోయానమ్మా, ఏమిటో పల్లెటూరి వ్యవహారాలు. సరే, కాపురా.కి వచ్చిన తరువాత ఇదే నిన్ను చూట్టం. ఈ పూలూ పళ్ళూ తీసుకోమ్మా" అని బుట్టెడు పళ్ళూ, పెద్ద పూలపొట్లం అక్కయ్య చేతిలో వుంచాడాయన. "నమస్కారం. నమస్కారం అత్తయ్యగారు పాపం పోయారటగా. ఆవిడగారుంటే ఎంతో ప్రేమగా మిమ్మల్ని చూసుకునేది. భార్యలేని మావగారు మీరు" అన్నది అక్కయ్య.

ఆయన నిర్ఘాంతపోయి అక్కయ్యవైపు కళ్ళార్పకుండా చూసి, కొడుకువైపు చూచి మాట్లాడలేదట.

"నువ్వు నోరు మూసుకుని అవతలకు నడు" కోపంతో అన్నాడు బావ.

"కాళ్ళకు దణ్ణం పెట్టటం మానేసినా నన్ను తక్కువగానే చూస్తున్నారు" అని వంటింట్లోకి వెళ్ళిపోయింది. అమ్మ నెత్తినోరు బాదుకుంది. ఆయన ఆ రోజున ఆ ఇంట్లో కాఫీ కూడా తాగలేదు.

"కోడలు ఇట్లా మాట్లాడుతోందేమిరా అబ్బీ"

"నా కర్మ. అందం చూసి మోసపోయాను అది కోతిబుద్ధి. మెదడూ ఉన్న అందాల రాశి, అమాయకురాలు. వెకిలి, మంచిచెడ్డలు తెలీవు" నెత్తిబాదుకుంటూ చెప్పాడు బావ.

కొడుకు ముఖం చూసేసరికి ఆయనకూ కళ్ళ నీళ్ళ పర్యంతమైంది.

"మోసపోయావా"

"అవును అనుభవించక తప్పదు"

"సరే, నేను తిరిగి మన ఊరు వెళ్ళిపోతాను. నేను ఇక్కడ ఉంటం మంచిదికాదు. అంతేకాదు. మీఅత్తగార్నికూడాపంపెయ్యి. నువ్వు రెండు మాసాలు సెలవుపెట్టు. ఆ పిల్లను నువ్వే తర్ఫీదు మనిషిగా చెయ్యి. అప్పటికీ మారకపోతే ఇంకాలోంచెం ముందుకు వెళదాం" అని సలహా యిచ్చాడాయన.

ఆ మర్నాడే అమ్మ వెళ్ళిపోయింది: బావ సెలవు పెట్టారు, ముందు పదిహేను రోజులే సెలవు పెటారు,

అమ్మ వెళ్ళిన రోజున అక్కయ్య అన్నం వండుతున్నది, బావ కూడా వంటింట్లోనే కూర్చున్నాడు, అక్కయ్య ఎట్లా వంటచేస్తుందోనని బావ చూస్తున్నాడు. స్టౌమీద ఎట్లాగో అన్నం వండింది, బంగాళాదుంపలు ఉల్లిపాయలువేసి వేయించమన్నాట్ట బావ, బంగాళాదుంపలు తరిగింది. ఉల్లిపాయలుపెచ్చు తీస్తున్నది, కళ్ళంట నీళ్ళొచ్చాయి, కళ్ళు తుడ్చుకుంది, ఆ ఉల్లిపాయ చెయ్యి కంట్లో పెట్టుకుంది,

"అసలే ఉల్లిపాయ ఘాటుకే కళ్ళల్లో నీళ్ళు తిరుగుతయ్యి కదా ఆ చేత్తోనే కళ్ళు తుడ్చుకున్నావేం సునందా" అన్నాడు బావ.

"ఆ మాత్రం తెలివితేటలుంటే మిమ్మల్నెందుకు పెళ్ళాడేదాన్ని, మా వాళ్ళు నా గొంతు కోశారు" అని గదిలోకివెళ్ళి మంచంమీద పడుకుంది, బావకి నవ్వాలో ఏడ్వాలో, బాధపడాలో తోచక నచ్చచెప్పి తీసుకువద్దామని గదిలోకి వెళ్ళాట్ట,

"ఎప్పుడు తల్చుకుంటే అప్పుడేనా, సిగ్గులేదూ" అన్నది అక్కయ్య.

బావకు నిజంగానే కోపం వచ్చింది, "ఛీ ఛీ నీతో మాట్లాట్టం నాదే బుద్ధి తక్కువలే" అని ఇవతలికి వచ్చి చొక్కా వేసుకుని ఎక్కడికో వెళ్ళిపోయాడు,

అక్కయ్య వెనకనుంచి వచ్చి చప్పట్లు కొడుతూ "ఇ హి హి హి ఓడిపోయారు అబ్బాయిగారు, లేకపోతే నేను వెకిలిదాన్నిట, వెర్రి బాగులదాన్నిట, నన్నెపుడూ అట్లా అనకండేం అంటే నాకు కోపమొస్తుందే, ఊ నా మాట విని చొక్కా విప్పేయండి, మా బాబు కదూ, బంగారుకొండ" అంటూ వెకిలిగా నవ్వి వెనకనుంచి కితకితలు పెట్టింది,

చేతులు విదిలించుకుని బావ వెళ్ళిపోయాడు. అక్కయ్య బుర్ర గోక్కుంటూ నిల్చుంది,

బంగాళాదుంపల కూర వండి పది గంటలకలా భోజనం చేసి పక్కింటి రాజ్యలక్ష్మి గారింటికి వెళ్ళింది. అక్కయ్య పరిస్థితిని అర్థం చేసుకున్న రాజ్యలక్ష్మి "పొద్దున్న మీ వారేదో కోప్పడుతున్నారల్లే ఉంద" అన్నది.

"ఆయనెవరూ కోప్పటానికి నిన్నగాక మొన్న వచ్చిన భర్త. మా నాన్నా అమ్మ కూడా నన్నెప్పుడు కేకలెయ్యరు. ఎప్పుడయినా నా కర్మ కొద్దీ పుట్టావే అనేవారు. ఈయనేమిటో నన్ను కేకలేస్తారు. అవునుగాని ఇందులో నా తప్పేదో చెప్పండి"

అని జరిగిందంతా చెప్పింది.

"నువ్విట్లా చెయ్యటం చాల తప్పు సునందా. ఆయనకి కితకితలు పెట్టటమేమిటి. భర్తంటే చిన్నప్పుడు ఆడుకున్న స్నేహితురాలు కాదు. యావజ్జీవితం ముడివడి ఉండే అనిర్వచనీయమైన ప్రేమానురాగాలను చిలికించే దైవసమానుడు. వేళాకోళంగా మాట్లాడే సమయా సమయాలు ఏవో నువ్వు గ్రహించే ఉంటావు" అన్న దావిడ ఎగతాళిగా నవ్వి.

అక్కయ్య కాసేపు బుర్రగోక్కొని,

"నేను నవ్వితేనేమో వెకిలిగా నవ్వారంటారు. మీరు నవ్వితేనేమో అంత అందంగా ఉన్నదంటారా" కోపంతో అన్నది. ఆవిడ సానుభూతితో రెండు నిమిషాలు అక్కయ్యవైపు చూసి.

"ఆ విధాత నిన్ను సృష్టించే వ్యవధిలో నీ అందాన్నే తీర్చిదిద్దుతూ కూర్చుని. అయినా చూద్దామని తెలివితేటల పాలు తగ్గించి ఉంటాడు సునందా. వెకిలితనం నీ నవ్వులో, నడకలో, మాటలో చూపులో తెల్సి పోతుంది." అన్నది.

"మొన్ననేమో భర్తకు లొంగివుంటే వాళ్ళు మనల్ని ఆడిస్తారు. మన వ్యక్తిత్వం కాపాడుకోవాలి అని చెప్పారు. ఇప్పుడేమో దైవసమాను

దంటరి, అసలు నా కన్నా మీరే వెకిలల్లే ఉందే. భర్తను, గురించి రోజు కొక రకంగా చెప్పారు. అని చివాల్న లేచి వచ్చేసింది."

బావ ఆ పగలల్లా ఇంటికిరాలేదు. స్నేహితులతో తిరిగి మధాహ్నం హోటల్లో భోంచేసి రాత్రి ఎనిమిది గంటలకు ఇంటికి చేరాడు.

"ఓహో వచ్చారూ. రండి. భర్తంటే దైవ సమానులట, రాజ్య లక్ష్మి చెప్పారు. అంటే ప్రతి పెళ్ళానికీ ఒక దైవ సమానుడిలాంటి మొగుడు. అలాంటప్పుడు ఈ పెళ్ళయిన ఆడాళ్ళంతా గుళ్ళలోకి పోతా రెందుకూ, ఏమిటో నాకు నిజంగానే కాదు నేను నిజంగానే వెర్రిదాన్ని. కాళ్ళు కడుక్కొంత నమస్కారం చేస్తాను" అన్నది అక్కయ్య. ఈ మాటలకు బావ ఎంతో కుమిలిపోయాడు. అసలు అక్కయ్యకు ఏం మాట్లాడాలో. ఎట్లా మాట్లాడాలో తెలీదు. "పొద్దునసంగా వెళ్ళారు ఇంటికి రాలేదేం, భోజనం ఎక్కడ చేశారు? నా మీద అంత కోపం వచ్చిందా, క్షమించండి" అని అక్కయ్య అంటుందేమో ననుకున్నాడు బావ. కాని అదేమీ అనలేదు అక్కయ్య.

"వంటయిందా సునందా"

"వంట పొద్దునే చేశానుగా. మీరు కోపంవచ్చి వెళ్ళిపోయారుగా, పొద్దున తిన్నచోటే రాత్రికీ తింటారనుకున్నాను. నాకు చద్దెన్నం తినటం అలవాటే, ఉన్న చద్దెన్నం తినేశాను. మీరొస్తారని తెలియదు" అన్నది.

అక్కయ్య వంట చేస్తానని అనలేదు. బావకు విసుగూ నిరాశ. నిస్పృహా ఎక్కువై పోయాయి. మాట్లాడకుండా వెళ్ళి ఒక గ్లాసుడు మజ్జిగ తాగి, పక్కమీద పడుకున్నాడు. అక్కయ్యకు. ఎట్లా నచ్చచెప్పాలో తోచలేదు

బుజ్జగించి చెపితే వింటుందేమోనని మంచితనంగా మాటాడు దామనుకున్నాడు.

"సునందా"

"వస్తున్నా. అది సరేగాని మీ తల్లో పేలున్నయ్యా నిజం చెప్పండి."

"నా తల్లో పేలా, నేను పుట్టిబుద్ధెరిగిం తరువాత నా తల్లో ఎప్పుడూ పళ్ళేదు"

"అబద్ధం రాత్రిళ్ళు మీ తలోనుంచీ నా తలోకి పాకి ఉంటయ్యి. ఏమిటో పెళ్లయాక అన్నీ గొడవలే. ఇహ్హీహిహ్హి" అంటూ వచ్చి పక్క మీద కూర్చుని బావ ముఖంలోకి కళ్లార్పకుండా చూసింది. ఆ చూపులో ప్రేమలేదు, చిలిపితనంలేదు, ఆప్యాయతలేదు. అదొక రకమైన పిచ్చిచూపు "అయితే నా తల్లోకి పేలెటా ప్రవేశించాయి, చెప్పండి."

బావకు అసహ్యంవేసి కళ్ళు మూసుకుని గోడవైపుకు తిరిగి పడుకున్నాడు.

బావ కాళ్ళకు దణ్ణంపెట్టి, మంగళ సూత్రాలు కళ్లకద్దుకొని పక్కనే పడుకుంది.

అరగంట పోయాక బావ ఇటు తిరిగి ఎంతో సంతోషాన్ని ముఖానికి పులుముకుని "సునందా అన్నీ తెలిసిన ఆడదానివి. దాంపత్యసుఖం తెల్సిన నీకు వెకిలితనంగా చూడకూడదని, మాట్లాడకూడదని, తెలివి తేటల్ని వృద్ధి చేసుకోవాలని, మాటల్లో ఆకర్షణ ఉండాలని తెలీదా, అసలు నీ మనస్సూ ఆలోచలూ ఎట్లా ఉంటయ్యి" అన్నాడు.

"నాకేమి తెలీదు. నాకు ఆలోచనలు రావు. దాంపత్యసుఖమా, ఛీ పోండి" అని మంచందిగి బుర్ర గోక్కుంటూ వెళ్ళి కిందపడుకుంది.

బావ ఆ రాత్రి అక్కయ్యతో ఏమీ మాట్లాడలేదు.

రెండు రోజులు గడిచాయి. బావకు విసుగుదల ఎక్కువైంది. స్నేహితులెవరయినా వస్తే అక్కయ్య మనస్తత్వం ఎట్లా ఉంటుందోనని ఏదో నిర్ణయానికి వచ్చి మూడో రోజున ఇద్దరు స్నేహితుల్ని ఇంటికి తీసుకువచ్చాడు.

"సునందా, ఇద్దరు స్నేహితులొచ్చారు. మాంచి కాఫీ పట్టాలి" అన్నాడు బావ.

"ఏం వాళ్ళ తాలూకు పెళ్ళాలు లేరా"

"ఛ నోర్ముయ్. అట్లా అనకూడదు. వాళ్ళు నిన్ను చూద్దామని వచ్చారు. అతిథులు" అని నచ్చచెప్పి కాఫీ కాయించి గ్లాసుల్లో పోసి వాళ్ళకూ తనకూ అక్కయ్యచేత ఇప్పించాడు.

"కాఫీ చాలా బావుందండి" అన్నాడొక స్నేహితుడు.

"మంచి స్ట్రాంగ్ కాఫీ తయారుచేశారు" అన్నాడొక స్నేహితుడు.

అక్కయ్య ముఖం విప్పారింది. ఆ నవ్వులోని వెకిలితనం వాళ్ళిద్దరూ చూశారు.

"వినండి. వినండి నేను కాచిన కాఫీ బావుళ్ళేదని మీరు రోజూ సణుగుతారు. వీళ్ళేమో నేనిచ్చిన కాఫీ బావుందన్నారు. ఇప్పుడు చెప్పండి నేను వెర్రిబాగుల్దాన్నా. వాళ్ళ పెళ్ళాలు అన్నట్లు మీఇద్దరికి పెళ్ళయ్యే షంటుంది. వెర్రిబాగులవాళ్ళో వాళ్ళ పెళ్ళాలకి కాఫీ కాయడం కూడా రాదన్నమాట" ఇహిహిహి హాహాహా అని నవ్వింది.

"సునందా ఏమిటా నవ్వు" బావ కేకలేశాడు. అక్కయ్య నవ్వటం మానేసింది.

"ఏమండి సునందగారూ, మీరు చాలా బాగున్నారు. మనిద్దరం సినిమాకు వెళదామా" అన్నాడొకతను.

అక్కయ్యకు కోపం వచ్చింది.

"మీతో సినిమాకు రావాలా మావారి స్నేహితుడుగారూ. పర పురుషుణ్ని కన్నెత్తి చూడకూడదు. ఏమండీ మిమ్మల్నే మీ భార్యలు పతివ్రతలు కారా" అని వంటింట్లోకి వెళ్ళిపోయింది.

వాళ్ళు అక్కయ్య మాటలకు ఏమీ కోపం తెచ్చుకోలేదు. ఆవేశ

అకయ్యా మన సత్వం ఇంకో రకంగా తెల్సుకుందామని బావ వాళ్ళద్వారి చేతా అట్లా మాటాడించారు.

ఆ తరువాత బావతో వాళ్ళు అన్నారట "మిస్టర్ ఆనందరావ్, మీ ఆవిడ బొత్తిగా ఏమీ తెలీండికాదు. మంచి గుణవతి, తనకు సంబంధించి నంతవరకూ మంచీ చెడూ తెల్సు. షి ఈజ్ ఏ నయస్ లేడీ. ఆ మంచి చెడలు తెలీని ఆడదయితే ఆవిడను వదిలివెయ్యటమే మంచిది. నీ భార్య లక్ష్మిదేవిలా ఉన్నది. కావాలనే ఆ బ్రహ్మదేవుడు అమ్మాయిలో వెకిలి తనాన్ని ప్రవేశపెట్టాడు. ఆ వెకిలితనమే లేకపోతే నీ భార్య అపరంజి బొమ్మ. ఇప్పటికయినా మించిపోయింది లేదు. మానసిక శాస్త్రవేత్తయిన డాక్టరుకు చూపించు. ఆ మెదడులోని నరాలకేమయినా ఉత్తేజమూ, తెలివి తేటలూ కలిగించటానికి ఏమైనా చికిత్స ఉన్నదేమో"

వాళ్ళ మాట ప్రకారమే అక్కయ్యను విశాఖపట్టణం తీసుకు వెళ్ళాడు బావ. రానంటే రానన్నది అక్కయ్య. ఎంతో బలవంతం మీద ఒప్పుకున్నది.

అక్కడ డాక్టర్లు అన్ని పరీక్షలు చేసి, కరెంటు ట్రీట్‌మెంట్ ఇచ్చి పదిహేను రోజులు ప్రయత్నించారు. అక్కయ్య పరిస్థితి మామూలు గానే ఉన్నది. చివరకు డాక్టర్లు అన్నారట.

"పుట్టకతో ఉన్న ఈ వ్యాధికి మందులేదు మీరు బాధపడవలసిందే. పూర్వజన్మ ప్రారబ్ధం"

ఆ రోజుల్లా బావ ఏడ్చాడు. సముద్రంలో పడేసి చంపేద్దామని ఆలోచించి బీచికి తీసుకువెళ్ళి ఏవో కబురు చెప్తూ రాత్రి తొమ్మిది గంటలవరకూ కూర్చున్నారట.

ఆ సముద్ర ఘోషలో బావకు ఏదో జ్ఞానోదయం కలిగినట్టయి నిండుప్రాణిని అందులో భార్యను చంపితే ఎన్నో అనర్థాలు చుట్టుకుంట య్యని ఒక నిశ్చయానికివచ్చి ఆ రాత్రే బయలుదేరి నాన్న, అమ్మవద్ద అక్కయ్యను దిగడిచి వెళ్ళిపోయాడు బావ.

అంతే బావ అక్కయ్యను వదిలేశాడు.

# 2

అక్కయ్య పెళ్ళికోసం నాన్న పెంకుటిల్లు కాస్తా అమ్మేటంతో అద్దె పెట్టుకోలేక ఒక పూరింట్లో చేరాం. ఆ పూరింటికీ పదిహేను రూపాయలు అద్దె. అన్నయ్యవల్ల కుటుంబానికి ఏ సహాయంలేకపోగా ఆ పరిసితిలో వాడితిండే బట్టకూడా ఒక సమస్యగానే వుండేది. ఏ హయ్యరు గ్రేడ్ ట్రైనింగో చదివితే ఎవరికాళ్ళయినా పట్టుకుని నీకూ ఒక మేష్టరు ఉద్యోగం ఇప్పిస్తానన్నాడు నాన్న. వాడువినలేదు.

నేను మంచి మార్కులతో స్కూల్ ఫైనల్ ప్యాసయ్యాను. ఒక్కొక్కప్పుడు భగవంతుడుకూడా మనుష్యులకు మించిన అవకతవక పనులు చేస్తూనే ఉంటాడు. చదువుకుందామనే ఉద్దేశ్యం వున్నవాళ్ళని, ఆర్థిక ఇబ్బందులు, ఆర్థిక ఇబ్బందిలేని వారికి చదువురాదు. డబ్బు లేకపోయినా మగపిల్లవాడు కదా అని అప్పోసప్పోచేసి చదువు చెప్పిద్దామంటే వాడు మొరాయించి చదువుకోనని రౌడీగా తయారవుతాడు. ఆయన భగవంతుడు కనుక అన్నీ లీలలన్నారు ఆయనచేతిలో ఈ రకంగా దెబ్బతిన్న వాళ్ళని వాళ్ళ వాళ్ళ ప్రారబ్ధ కర్మ అన్నారు.

రెండోవాడు చిన్నప్పుడే మారుబడిపోవటంతో అమ్మ పంచప్రాణాలూ వాడి మీదనే పెట్టుకుని వాడిని ఏమీ అనేదికాదు ఒకవేళ నాన్న కేకలేసినా అమ్మ వలవల ఏడుస్తూ ఉన్న వీడొక్కడూకూడా మన కళ్ళముందుఉండటం మీకు ఇష్టంలేదు. నేను చస్తే అందరి బుద్ధులూ మారతాయి" అనేది.

ఈ పరిస్థితిలో నాకూ చదువు సాగలేదు. కాలేజీ చదువు చెప్పించలేనన్నాడు నాన్న. ఏం చెయ్యటానికీ తోచక టైపూ షార్టుహ్యాండ్ నేర్చుకో పోగాను. నాన్నకూడా సరేనన్నాడు.

ఈ విధంగా సాగుతున్న ఈ కుటుంబంలో సభ్యురాలుగా మళ్ళీ చేరింది అక్కయ్య.

కాపురానికి వెళ్ళిన నాలుగు నెలల్లో అక్కయ్య తిరిగివచ్చింది. గుమ్మంలో అడుగుపెట్టిన బావ ముఖం విచారంతో వుండిపోయింది. మంచి నీళ్ళు తాగి రెండు నిమిషాలు కూర్చున్నాక,

"మావగారూ, నన్ను మీరు మోసం చేశారని అనను కన్యచెర వదిలించుకోటానికి పెళ్లిచేశారు. మీ అమ్మాయి అందంచూసి నేను పెళ్లాడాను. ప్రతివాడూ తన భార్యకు అంద చందాలతోపాటు గుణగణాలు కూడా ఉండాలని కోరుకుంటాడు కాని ప్రపంచ జ్ఞానం తెలీని మూర్ఖురాలుగా ఉండాలని కోరుకోరు. విశాఖ పట్నంలో డాక్టర్లుకూడా చెప్పారు. మనసుకు వెకిలితనంపోదు తెలివితేటలురావు. నా అదృష్టంకొద్దీ ఆరోజే వస్తే ఏనుగు అంబారీమీద ఊరేగింపుగా తీసుకువెళ్లి తాను. అంతవరకూ కన్నెనేరానికి మీ ఇంట్లోనే ఉంటుంది"

ఈ మాటలని బావకాఫీకూడా తాగకుండాఎవర్నీ పలకరించకుండా వెళ్లిపోయాడు. అమ్మ ఏడ్చింది. నాన్న ఒగాలుపడి కూర్చున్నాడు. అన్నయ్య నవ్వుకుంటూ వెళ్లిపోయాడు. నేను అక్కయ్య దగ్గరకు వెళ్లాను. నవ్వు ముఖంతో తనపెట్టె సర్దుకుంటున్నది అక్కయ్య.

"అక్కా, బావ ఏమన్నాడో విన్నావా",

"ఏం వినాలి ఆయన మాటలు అంతే. ఐవా పుట్టింటికొచ్చాను. చక్కగా ఉంటానూ నన్నుచూసి మీరంతా ఏడుస్తారెందుకే ఇహిహ్హిహ్హీ."

దవడ వగలకొడదా మనిపించింది. నన్ను నేను సమాధాన పర్చుకున్నాను. నెమ్మదిగాచేస్తే ఏ టుందేమో నని పించింది.

"అక్కయ్యా."

"ఏమిటే."

"బావ మంచివాడుకదూ. నిన్ను ప్రేమగా చూసేవాడేనా."

"ఇదిగో మే మిద్దరం మొగుడూ పెళ్లాలం. అనేక రహస్యా లుంటాయి, అడక్కూడదు పెళ్ళయితే నీమొగుడు సంగతి నేనూ అడగను. ఎవరి మొగుడు వారికే ఊఁ అంతే" అన్నది. నాకు నవ్వాలో ఏడ్వాలో తెలీలేదు.

రెండు మూడురోజులు అక్కయ్యతో మాట్లాడలేదు. దాని పద్ధతీ భావాలూ ఎట్లా ఉంటయ్యోనని చూస్తూ ఉండేదాన్ని. అమ్మ ఏదో అడి గేది ఆ సమాధానం వెకిలిగానే ఉండేది కాకపోయినా కొన్నాళ్ళు ఉండి అమ్మ దాని కాపురంచూసి వచ్చింది.

ఒకరోజున అమ్మ అన్నది.

"ఓసే సుధా అక్కయ్యను రెచ్చగొట్టకుండా మంచిమాటలతో దాన్ని దాల్లో పెట్టొచ్చేమో చూడు. ఆ ఓపిక నాకులేదు, దాని కాపురం ఇట్లా అయిందికదా అని బాధపడి ఏడవటంతప్ప నేనేం చెయ్యగలను. నువ్వు తెలివిగల దానివి. బాధ్యత లేకపోయినా దాన్ని మనిషిగాచేసే బాధ్యత నీ మీద పెడుతున్నాను ప్రయత్నించు."

టైప్ ఇనిస్టిట్యూట్‌కు ఉదయం ఎనిమిది గంటలనుంచీ తొమ్మిది వరకూ ఉన్న ఒక్కగంటలో వెళ్ళేదాన్ని, షార్టుహాండు సాయంతం ఆరు నుంచీ ఏడుగంటలవరకూ, ఇక తప్పితే స్నేహితురాలింటికయినా వెళ్ళటం మినహా వేరె చదువు లేకపోవటంతో తీరికగానే ఉండేది,

నాన్న స్కూలుకు వెళ్ళాక నేను ఏదోచదువుతూనో, షార్టుహాండ్ ఎక్సర్‌సైజులు చేసుకుంటూనో అక్కయ్యను పలకరించే దాన్ని.

"నాకు పెళ్ళిచేసుకోవాలనిలేదు. ఉద్యోగం చేస్తాను."

'తప్పు సుధా. ఉద్యోగం మొగవాళ్ళు చెయ్యాలి. నువ్వు ఆడదానివి ఆడవాళ్ళు కాపురం చెయ్యాలి."

"ఉద్యోగంచేస్తూ కాపురం చెయ్యకూడదా?"

"ఛీ పాడు. అందుకేనా ఆదేదో భాషలో రాస్తున్నావూ ఇందులో

అ ఆ ఇ ఈ ఉ లేవు ఎ. బి. సి. డీలు లేవు ఏమిటా గీతలూ. ముగ్గులూ" అన్నది షారుహాండ్ రాత పుస్తకంచూసి.

"ఇంతకీ బావ ఉద్యోగం ఏమిటే, జీతం ఎంతేమిటి" ఆ మాత్రమైనా తెలుసుకోకుండా ఉంటుందా అనుకున్నాను

"చూడు సుధా, అదేదోనమ్మా, ఆదేదో ఆఫీసులో పని. పదిగంటలకి వెళతారు. సాయంత్రం ఆరింటికి వస్తారు. ఏదయితేనేంగాని జీతం మాత్రం తెస్తారు. జేబులో నోట్లుంటయ్యి."

''జీతం ఎంతేమిటి? బావ జేబు చూస్తావా" నవ్వుతూ అడిగాను.

"ఎంతయితే ఏం, ఎంతో ఉంటుంది. మొత్తానికి జీతంతెచ్చే ఉద్యోగమే. నేనేం దొంగనా జేబులు చూడ్డానికి."

దొంగతనం అంటే తప్పనే సంగతి అక్కయ్యకు తెలుసు.

''జీతం తేగానే నీకే ఇస్తారా"

''నాకెందుకూ పెట్లోపెట్టి తాళం వేస్తారు,"

''బావతో ఏం మాట్లాడుతావే అక్కా''

"మొగుడూ పెళ్ళాల కబుర్లు నీ కెందుకే. ఏదో అంటారు ఏదో చేస్తారు.'' నెత్తిగోక్కుంటూ వెకిలిగా నవ్వింది.

అక్కయ్యకు మంచీ చెడూ కాస్త తెలుసు కాని తెలివితేటలుగా వాటినిగురించి ఆలోచించే మానసిక పరిణామం మెదడులో లేదు.

ఈ విధంగా సంవత్సరం గడిచింది. అక్కయ్య మనస్తత్వంలో ఏ మార్పూ రాలేదు. తన భర్త తీసుకువెళ్ళలేదే అన్న భావం, విచారం కూడా ఉన్నట్లులేదు. చుట్టుపక్కల కొందరికి తెల్సిపోయింది. మేష్టరుగారి పెద్దమ్మాయికి తెలివితేటలు లేవు. అమాయకురాలు. వెకిలిగా నవ్వుతుంది.

ఒకసారి ఇద్దరు ముగ్గురు అమ్మలక్కలు సానుభూతిగా అక్కయ్యను పలకరించారు. అందుకు అక్కయ్య సమాధానం, ''నా మొగుడు నన్నొదిలేస్తే మీ కెందూకూ బాధ, ఏం నన్నుచూసి మీ మొగుళ్ళు మిమ్మల్ని వదిలేస్తామన్నారా బలే బలే''

వాళ్ళు జాలిపడి వెళ్ళిపోయారు. బావ సంవత్సరం దాటినా ఉత్తరం రాయలేదు. నాన్నకూ ఏం చెయ్యటానికి తోచలేదు. మనోవర్తికి దావా వెయ్యమంటుంది అమ్మ. మనం మనోవర్తికి దావావేస్తే బావ విడాకులు కోరాడేమోనని నాన్న భయం, ఈ విషయంలో అన్నయ్య ఏమీ చెప్పడు. ఏమీ పట్టించుకోడు. కావటానికి ఈడొచ్చిన పెద్దకొడుకు అన్నయ్య, బ్రాకెట్ కంపెనీలో జేరాడు, ఏమిస్తాడో తెలీదు, నాన్నకు పైసా ఇవ్వడు, నాన్ననడిగి పైసా తీసుకోడు,

నేను టైప్ లోయర్, షార్టుహాండ్ లోయర్ పాసయాను, టైప్ హయ్యర్ నేర్చుకుంటున్నాను,

"బావకు ఉత్తరం రాయరాదుటే అక్కయ్యా" అన్నాను.

"ఉత్తరమా ఏమని?"

"తీసుకు వెళ్ళమని,"

"ఎందుకూ ఇక్కడ నాకేం తక్కువైందని,"

"పెళ్ళయి కాపురానికి వెళ్ళిన ఆడదాన్ని భర్త వదిలేసి పుట్టింటికి పంపేశాడంటే లోకులు ఏమనుకుంటారో తెలుసా, అది నీకూ, పుట్టింటి వాళ్ళకూ గౌరవంకాదు,"

అక్కయ్య నెత్తి గోక్కుంది.

"మొగుడి ఇంటికి వెళ్ళి కాపురం చేస్తే బాగానే వుంటుంది కాని, ఆ ఏమిటో యక్కడే బావుందిలేద్దూ. అక్కడయితే వంట చెయ్యాలి, వంట బావుండకపోతే విసుక్కుంటారు, అదో గొడవ. ఇక్కడే వుంటా లేద్దూ,"

"అయితే పెళ్ళెందుకు చేసుకున్నావ్."

"మీరంతా చేస్తానంటే పెళ్ళి చేసుకున్నాను. మొగుడు దగ్గరికి పంపిస్తే వెళ్ళాను. ఆయన పంపిస్తే వచ్చాను. మళ్ళీ రమ్మంటే వెళతాను, అంతే."

వెకిలిగా నవ్వి వెళ్ళింది. అక్కయ్య పరిస్థితిలో మార్పులేదు. దాన్ని గురించి మేం బాధ పడవలసిందే. భర్త, సంసారమూ దానికి తెలి

పినా ఆ అనుభూతి దాని మనస్సుకు పట్టినట్లులేదు, నావల్ల తప్పు ఉంటం నుంచే నన్నాయన పుట్టింట్లో వదిలివెళ్ళారనే గ్రహింపే దానికి ఉంటే ఇంక దాన్ని గురించి అనుకోటం ఎందుకూ ? దాని జీవితంలో ఇంక ఏ మార్పూ రాదేమో, చెప్పినా దానికి అర్థంకాదు, అర్థం చేసుకునేందుకు అది ప్రయత్నించదు.

దాన్ని గురించి మేం ఎంత దిగులుపడి దాని మనస్సులో, భావాల్లో మార్పు తీసుకువద్దామని ప్రయత్నిస్తామో ఆ ప్రస్తావన అది అంత తేలికగా తీసిపారేసేది.

మరో ఆర్నెల్లు గడిచాయి. నేను హైస్కూల్ హయ్యరు పాసయ్యాను. వయస్సు కూడా పద్దెనిమిది సగపడింది,

ఒక రోజున ఆశ్చర్యకరమయిన సంఘటన ఒకటి జరిగింది.

ఆ రోజున మా ఇంటికి ఒక స్కూల్ మేష్టరువచ్చారు. ఆయనా సెకండరీ గ్రేడ్ టీచరు, మాకు తెలియకపోయినా మా నాన్నగారికి బాగా పరిచయస్థులు. మా అక్కయ్య పెళ్ళికి కూడా ఆయన వచ్చాడు. వచ్చాక వాళ్ళ టీచర్ల సమస్యలూ జీతాల సంగతే మాట్లాడుకుని "ఒకసారి మీ రెండో అమ్మాయిని పిలవండి" అన్నాడు, నాన్న నన్ను పిలిచారు, భయపడుతూనే ఎందుకోనని వెళ్ళాను.

"నీ పేరేమిటమ్మా" అన్నాడు. చెప్పాను,

"మా తమ్ముడు జనార్దనరావు. వాడూ బి. ఎ. బి, ఇడి. టీచరు, నువ్వు వాడికి ఎటా తెలుసో నాకు తెలీదు. నిన్ను ప్రేమించానన్నాడు. పెళ్ళిచేసుకుంటాట్ట. అందుకనే వచ్చాను" అన్నాడు.

నాకు మతిపోయింది. నాన్న విభ్రాంతితో చూశాడు. అంతేకాదు ఆ అబ్బాయితో నాకెట్లా పరిచయము అని ఆలోచించాను. ధైర్యం తెచ్చుకున్నాను.

"ఆ జనార్దనరావు గారెవరో నాకు తెలీదండి. నేను ఆయనకు ఎట్లా తెలుసోఆదీతెలీదు. నేను టైప్ ఇన్‌స్టిట్యూట్‌కు వెళ్ళుతున్నప్పుడు మీ రోడ్ సైడ్ రోమియోగారు చూసి అంతఘాటుగా నన్ను ప్రేమించారేమో తెలీదు. క్షమించండి" అని అమ్మదగ్గరకు వెళ్ళిపోయాను.

ఆయన మనస్సుకు కష్టం కలిగిందేమో నాకు తెలీదు. ఆ ప్రస్తావన చాలించి కాసేపు నాన్నతో మాట్లాడి వెళ్ళిపోయారు. ఆయన వెళ్ళాక నాన్న నా దగ్గరకు వచ్చారు. అమ్మా, అక్కయ్యా అక్కడే ఉన్నారు.

"ఏమ్మా అట్లా మాట్లాడావ్. అక్కయ్యను చూస్తూంటే ఆ దిగులుతో నాకు నీ పెళ్ళి మాటే గుర్తురాలేదు. నాకూ పెళ్ళీడుకొచ్చిన రెండో ఆడపిల్ల ఉన్నది దానికి పెళ్ళి చెయ్యాలి అనే భావమే ఇంతవరకూ కలగలేదు. ఇవాళే ఈ సందర్భంగా గుర్తొచ్చింది. సరే, ఆ జనార్దనరావు నీకు తెలుసా" అన్నారు నాన్న.

నా విషయంలో నాన్న కూడా ఇట్లా అంటున్నారేమా, అనుమానపడుతున్నారేమా అని మనస్సులో బాధపడ్డాను.

"దైవసాక్షిగా అతనెవరో నాకు తెలీదు నాన్నా. అసలా ఉద్దేశ్యమే నాకు లేదు, నాకున్న ఉద్దేశ్యం ఉద్యోగం చెయ్యటం ఒక్కటే, అదే నా ధ్యేయం నిన్నటి పేపర్లో క్లర్కు పోస్టులకీ, టైపిస్టు పోస్టులకీ సర్వీస్ కమిషన్ పరీక్షల నోటిఫికేషన్ వేశారు, పది రూపాయల ఫీజు కట్టే టైపిస్టు సెలక్షన్ పరీక్షకు వెళతాను, దైవం చల్లగా చూస్తే సెలక్టు కాగలననే నా నమ్మకం" అన్నాను,

నాన్న ముఖంలో వెల్లివిరిసిన ఆ ఆనందం నాకిప్పటికీ కళ్ళకు కట్టినట్లే ఉన్నది. సంతోషంతో కళ్ళు తుడుచుకుంటూ "సరేనమ్మా నీ ఇష్టం" అన్నారు. "అదేం వీల్లేదు సుధాకి పెళ్ళి చెయ్యాల్సిందే. మొగుడు ఏలుకోకపోతే ఏం నువ్వు ఇక్కడే ఉందువుగాని, పెళ్ళయితే చక్కగా కొత్త చీరెలూ, పట్టుచేరెలు, మంగళసూత్రాలు. నల్లపూసలూ, మెటెలూ, చంద్రహారం అన్నీ వస్తయ్యి, నా మెడ చూడు ఎంత నిండుగా ఉందో" అన్నది అక్కయ్య నుదురు తుడుచుకుంటూ వెళ్ళారు నాన్న,

సర్వీస్ కమిషన్ పరీక్షకు ఫీజు కటాను, జనరల్ నాలెడ్జి పుస్తకాలు కొని చదివేదాన్ని, ఏమిటో ఆరాటం, ఏదో దిగులు, ఏదో సంతోషం,

పరీక్షకు వెళ్ళొచ్చాను. పాసయినట్లె అనిపించింది, మరో ఆర్నెల్లు గడిచాయి. ఒక రోజున నా పేర రిజిస్టర్ పోస్టులో కవరు. గుండెలు దడ

దర లాడాయి. సంతకంపెట్టి కవరు తీసుకుని మనస్సులోనే ఆ కళ్యాణ చక్రవర్తికి నమస్కరించి కవరుచించి కాగితం తీసి చదివాను.

నా అభీష్టం నెరవేరింది. కోరిక చిగిర్చింది. అదే మగపిల్లవాడ యితే పిల్లిమొగ్గలు వేసేవాడేమో. అమ్మ దగ్గరకు వెళ్ళాను. అప్పుడు అన్నం తిని చెయ్యి కడుక్కుంటున్నది అమ్మ. నాన్న స్కూలుకు వెళ్ళారు. అక్కయ్య ఇంకా అన్నం తింటోంది.

రెండు చేతుల్లో వెనగ్గా కవరు దాచి, చెయ్యి కడుక్కుని వస్తున్న అమ్మని ముద్దు పెట్టుకున్నాను. అమ్మ ముఖం చిట్లించి కోపంతో "ఏమిటే నీ బొంద" అన్నది.

"అమ్మ నీ మొగుడుటే సుధా ఛీ ఛీ" అని చీదరించుకున్నది అక్కయ్య.

వెనకనుంచి కవరు తీసి అమ్మ చేతికిచ్చి చెప్పాను.

"సర్వీస్ కమీషన్ పరీక్ష పాసయాను, ఈ జిల్లాకే రెవిన్యూ డిపార్టుమెంట్‌కి టైపిస్టుగా ఎలాట్ చేశారు. ఫలాని ఆఫీసుకు వేసినట్లుగా మళ్ళీ కలెక్టరు ఆర్డరు వేయాలి."

అప్పటికి అమ్మ ముఖం విప్పారింది. అంతలోకే మళ్ళీ చిన్న బుచ్చుకుంది.

"ఈ అదృష్టం వాడికూడా ఉంటే ఎంత బాగుండేది. కావలసిన మగపిల్లాడికి చదువురాక జులాయి వెధవలా తిరుగుతున్నాడు. అక్కర్లేని ఆడపిల్లకు చదువూ ఉద్యోగమూ అడక్కుండానే వస్తున్నాయి" అన్నది.

ఎందుకో అమ్మ మాటలు నా మనస్సుకు కష్టం కలిగించాయి. అక్కర్లేని ఆడపిల్లకు అనేసరికి ఎందుకో బాధపడ్డాను. ఆడపిల్లంటే ఈ మనుష్యుల భావాలు ఇంకా ఇట్లా ఉన్నయ్యేమో అని అనుకుని ఏం మాటాడకుండా ఇవతలకు వచ్చేశాను. అక్కయ్య భోజనం చేసి నా దగ్గర కొచ్చింది, "నేను ఉద్యోగం చెయ్యటం నీకూ ఇష్టం లేదా అక్కయ్యా"

"అదేమిటే నువ్వు మహారాజుగా ఉద్యోగం చెయ్యి. నువ్వు ఉద్యోగం చేస్తే జీతం వస్తుందిగా, నాకొక చీర కొనిపెడుదూ" అన్నది,

ఇన్నాళ్ళకు ఒకమంచి అభిప్రాయం అక్కయ్య నోటివెంట వచ్చి నందుకు ఎంతో సంతోషించాను,

సాయంత్రం ఇంటికి వచ్చాక నాన్న నా ఆర్డరు కాగితాలు చూసి "రేపే నేను కాకినాడ వెళ్ళి కలెక్టరుగార్ని చూసి ఈ ఊళ్ళోనే పోస్టింగ్ ఇప్పించమని అడుగుతానమ్మా. ఎక్కడో వేస్తే ఆడపిల్లవు ఒంటరిగా ఎట్లా వెళతావు" అన్నారు.

ఆ మర్నాడే నాన్న కాకినాడ వెళ్ళి కలెక్టరుగార్ని చూసివచ్చారు. మరో పది రోజులు గడిచాయి. రాజమండ్రిలోని ఆర్. డి. ఓ, ఆఫీసులో టైపిస్ట్‌గా అపాయింట్ చేసినట్లు ఆర్డర్సు వచ్చాయి. కావలసిన సర్టిఫికేట్లు తీసుకుని ఆ మర్నాడే ఆఫీసులో టైపిస్టుగా జాయినయాను. ఆ విధంగా నా జీవితం మరో మలుపు తిరిగింది.

రోజూ ఉదయం పది గంటలకల్లా భోజనం చేసి వెళ్ళిసాయంత్రం ఆరు గంటలకు వచ్చేదాన్ని. ఆఫీసు అయిదు గంటలవరకూ అని పేరుకే గాని అందరూ ఆరు గంటలవరకూ ఉండేవారు. ఆఫీసులో తనొక్కతే కావటంతో మొదట్లో కాస్త బెరుకనిపించినా తరువాత ఆ వాతావరణం అలవాటయింది, టైపుచేసే ఫెయిర్ కాపీలు కూడా తప్పుల్లేకుండా నీట్‌గా ఉంటంతో, కొత్త టైపిస్టు బాగానే పని చేస్తున్నదనే పేరు వచ్చింది.

మధ్యాహ్నం లంచ్ టైంలో మొదటి వారంరోజులూ జవాను చేత కాఫీ మాత్రం తెప్పించుకుని త్రాగేదాన్ని, సాయంత్రం అయేసరికి కాస్త శ్రమనిపించేది. నా పరిస్థితి గమనించిన నాన్న "ఫలహారం చెయ్యటంలేదు కదూ. కాఫీ నీళ్ళతో బండెడు కాగితాలూ టైపు చెయ్యమని ఎవరు చెప్పారమ్మా, నీక్కావలసిన టిఫిన్ కూడా తిను, పొట్ట మాడ్చుకునే ఉద్యోగం నువ్వు చెయ్యక్కర్లేదు" అని గట్టిగా కేకలేశాడు, అమ్మ కూడా కోప్పడింది,

ఆ రోజునుంచి టిఫిన్ కూడా తీసుకునేదాన్ని, రోజూ ఇంటికి రాగానే అక్కయ్య.

"ఏయ్ మొగరాయుడూ ఇవాళ టిఫినేమిటే" అనేది, మొదట్లో కాస్త బాధపడ్డా అక్కయ్య మాటలు అంతగా పట్టించుకునేదాన్ని కాదు.

మొదటి నెల జీతం వచ్చింది, ఆ రోజున జీతం తీసుకుంటూంటే ఆ అనుభూతి వర్ణనాతీతం, జీతమంతా తెచ్చి నాన్నకే ఇచ్చాను. నాన్న ఓ పదిహేను రూపాయలు నాకు మళ్ళీ ఇచ్చి "నీ ఖర్చులకు వాడు కోమ్మా, ఈ మిగతా జీతమంతా ఏం చెయ్యాలో తెలుసా" నవ్వు ముఖంతో నా వైపు చూశారు,

"నీకూ అమ్మకు బట్టలుకొను, నాకు మాత్రం జేబురుమాలు కొనివ్వు." అని నా జీతమంతా నాకే ఇచ్చేశారు నాన్న.

ఆ మర్నాడు సాయంత్రమే వెళ్ళి అందరికి బట్టలు తెచ్చాను, నేను తెచ్చిన బట్టలుచూసి అన్నయ్య అన్నాడు,

"నా కన్న నువ్వేనయమే సుధా. కాని ఒక్క మాట నువ్వు ఉద్యోగంచేసి సంపాదించే దానికన్నా నేను ఎక్కువే సంపాదించగలను, కాని సంపాదనకు మీ అందరి దృష్టితో విలువలేదు. ఈ రోజు నుంచీ నేనూ సంపాదించడానికి ప్రయత్నిస్తాను. కాని దాని ఆరాలు మీరు అడక్కూడదు,"

నాన్న ముఖం వెలవెల బోయింది.

"దొంగతనం చేస్తావురా" అన్నాడు నాన్న.

"కాదు దాని అన్నలాంటిదే రౌడీ తనం"

మరో మూడు మాసాలు గడిచాయి, ఆఫీసులో అందరూ పరిచయ మయ్యారు. ఉద్యోగమూ జీతమూ అలవాటై పోయాయి.

ఏదయినా జీవితంలో తాదసపడినపుడు కోరి తెచ్చుకొన్నదయితే ఆ అనుభూతి మనస్సులో కొన్నా నిల్చిపోతుంది. మనకు తెలియకుండా మన మనస్సులో ఏమీలేకుండా సందర్భపడిన సంఘటనయితే మనస్సులో అది మరువరాని సంఘటనగానే నిల్చిపోతుంది.

ఒక రోజున సాయంత్రం ఆరుగంటలకు టైపు చెయ్యవలసిన కాగితాలన్నీ క్లియర్ చేసి ఇంటికి వెళ్ళబోతుంటే శ్రావణకుమార్ అనే యు. డి. సీ వచ్చి ఓ నాలుగు పేజీల డ్రాఫ్టుబల్లమీద పడేసి,

"సుభాషిణిగారూ, ఈ డ్రాఫ్టు ఇవాళ టైపయి డిస్పాచి కావాలి" అని అక్కడే నిల్చున్నాడు.

ఆ రోజు ఎందుకనో నాకు కాస్త విసుగ్గానే ఉంది. అందులో మండు వేసంకాలం. మే నెల. బోసీ అయిదుగంటల లోపేవస్తే కొట్టక తప్పేదికాదు. ఆరుగంటలకు పట్టుదలగావచ్చి అతనా విధంగా అనే సరికి నాకు కాస్త చిరాకుకలిగి "పుస్తకంలో నోట్ చేసి టైం నోట్ చెయ్యండి. ఆరూ అయిదు నిమిషాలైంది. రేపు రాగానే కొడతాను" అని వెళ్ళి పోయాను.

"ఆఫ్టరాల్ యూ ఆర్ ఏ టైపిస్టు ఒక యు. డి సి.ని మీరు డబాయిస్తారా ఇవాళ మీరు కొట్టక పోవాలి రేపు చార్జి మెమో ఇప్పిస్తాను" అని సిగరెట్ వెలిగించి స్టెయిలిష్‌గా పొగవదులుతూ కుడికాలు నా టేబుల్ మీద పెట్టి నిల్చున్నాడు.

నాకూ చిన్నతనమనిపించింది. కోపమూ ఉక్రోషమూ నా పట్టుదలని పెంచాయి.

"మిష్టర్ శ్రావణకుమార్, నేను ఆఫ్టరాల్ టైపిస్టునయితే మీరు ఆఫ్టరాల్ యు. డి. సి. నన్ను కించపరచినంత మాత్రాన మీకు ఎడ్వాన్సు ఇంక్రిమెంట్ రాదు. ప్లీజ్ బిహేవ్ ప్రాపర్లీ" అని వచ్చేశాను. అంతా విస్తుపోయి చూస్తూ నిల్చున్నారు. రెండు నిమిషాల్లో వాతావరణం ఇటా మారిపోతుందని ఎవరూ ఆశించలేదు,

నేను వెళ్ళిపోయి మర్నాడు వచ్చాను. అంతా నిన్నటి సంఘటనను గురించే ఆలోచిస్తున్నారు. ఆఫీసులో రెండు వర్గాలయాయి. నన్ను సమర్థించారు కొంతమంది. శ్రావణకుమార్‌ని సమర్థించారు మరికొంతమంది.

నేను రాగానే ఆ కాగితమే టైపుచేసి జవానుచేత అతనికి పంపేశాను. ఒరిజినల్ రిఫరెన్సు అతని సీటుకుచేరి అప్పటికి నెలా పదిరోజులైంది. ఇది గుర్తించుకున్నాను.

మధ్యాహ్నం రెండు గంటలకు ఆర్. డి. ఓ గారి వద్దనుంచి పిలుపు వచ్చింది. ఆయన రూంలోకి వెళ్ళాను. శ్రావణకుమార్ అక్కడే ఉన్నాడు ఆఫీసరుకు నమస్కరించి నిల్చున్నాను.

"ఈ అర్జెంటు రిఫరెన్సు నిన్ననవగా ఇస్తే టైపు చెయ్యకుండా ఇవాళ టైపుచేశావుట. ఆడపిల్లవై యుండి అతన్ని దబాయించావుట" అన్నారు ఆర్. డి. ఓ.

"సాయంత్రం ఆరుగంటలకువచ్చి నేను మిషన్ మూసేసి వెళ్ళబోయే సమయానికి వారు పట్టుదలగావచ్చి ఇవాళ టైప్ చెయ్యాలన్నారు. అంతవరకూ నా దగ్గరవున్న కాగితాలన్ని టైప్ చేశాను. ఏమీలేవు టైం నోట్‌చేసి ఇవ్వండి. రేపు రాగానే టైపు చేస్తానన్నాను. అందుకాయన కోపం తెచ్చుకొని ఏమన్నారో వారినే అడగండి" అన్నాను.

ఆర్. డి. ఓ. గారు అతనివైపు చూశారు.

"ఆఫ్టరాల్ యు ఆర్ ఎ టైపిస్టు, ఒక యు. డి. సి ని మీరు దబాయిస్తారా. ఇవాళ మీరు కొట్టకపోవాలి రేపు చార్జి మెమో ఇప్పిస్తాను" అని అన్నట్లు చెప్పాడు.

"ఈ మాటనడం తప్పుకాదా, నువ్వు యు. డి. సి. వి. నీ దృష్టిలో అమ్మాయి ఆఫ్టరాల్ టైపిస్టు. అంటే రివెన్యూబోర్డు సెక్రటరి దృష్టిలో నేను ఆఫ్టరాల్ ఆర్. డి. ఓ. ని అంతేనా" అన్నారాయన. ఏం మాట్లాడకుండా తలవంచుకుని నిల్చున్నాడు, శ్రావణకుమారు. "యు కెన్ గో" అని నా వైపు చూశారు, నేను వచ్చేశాను. తరువాత తెల్సింది. ఆ కరెంటు అతని దగ్గర నెలా పదిరోజులు ఆలస్యమైనందుకు ఆర్. డి. ఓ. గారు శ్రావణకుమారుని బాగా మందలించారని.

ఈ సంఘటన జరిగాక అందరూ నన్ను గౌరవంగా చూట్టం మొదలుపెట్టారు. అతనంటే పడనివాళ్ళు నన్ను సమర్థిస్తూ అతనిమీద చాడీలు నాతో చెప్పేవారు.

మొత్తంమీద ఒక కొత్త వాతావరణం ఏర్పడింది. నేను టైపు చెయ్యవలసిన కాగితాలన్నీ అయిదు గంటలలోగానే వచ్చేవి.

ఆ రోజునుంచే శ్రావణకుమారు నాతో మాట్లాట్టమే మానేశాడు. రిజిష్టరులో ఫెయిర్ కాపీలు నోట్ చేసి వెళ్ళేవాడు ఈ సంఘటనతో ఆఫీసులో అతని ప్రిస్టేజి కొంత తగ్గినట్లుగా ఉండేది. అందరితోనూ దబాయించి మాట్లాడే పద్ధతి తగ్గించాడు. అతని ముఖంచూస్తే ఎందుకో నాకూ చిన్నతనమనిపించేది.

ఒక రోజు నేనే అన్నాను. "శ్రావణకుమారుగారూ. జరిగింది మర్చిపోండి. క్షమించండి"

"నో నో అదేం లేదండీ. ఉద్యోగం అన్నాక అనేకం జరుగుతూ ఉంటయ్యి" అన్నాడు.

మరో పదిహేనురోజులు గడిచాయి. ఆ రోజు ఒకటో తారీఖు. ఉద్యోగుల జీవితాలు జీతాలతోనే గడుస్తాయి. జీతాలు వచ్చిన రోజున వాళ్ళ మనస్సుల్లో వెన్నెలలు కురుస్తాయి, జీతాలకన్న అప్పులు ఎక్కువగా ఉన్నవాళ్ళు ఉన్నారు. వాళ్ళు జీతాలు నిరాశతోనే తీసుకుంటారు. సాయంత్రం నాలుగయింది, జీతం తీసుకుని సీట్లోకొచ్చి కూర్చున్నాను. ఎన్నడూ ఆఫీసుకు రానివాడు ఆ రోజున అన్నయ్య ఆఫీసు కొచ్చాడు, ఇంటిదగ్గర వాళ్ళకు ఏదయినా ప్రమాదం జరిగిందేమోనను కున్నాను. నన్ను చూస్తూనే,

"సుభా జీతమొచ్చిందా, అర్జంటుగా ఓ పాతిక రూపాయలు కావాలి మళ్ళీ వారంరోజుల్లో ఇచ్చేస్తాను" అని చెయ్యిజాపాడు, నా మనసులో అనేక అనుమానాలు ముసిరినా అవన్నీ ఆఫీసులో అడక్కూడదని వెంటనే

పాతిక రూపాయలూ ఇచ్చాను, ఇట్లా జరుగుతుండగానే ఆఫీసులో అన్న య్యకు తెల్సినవాళ్ళు ముగ్గురు నలుగురు వచ్చి,

"ఏం గురూ, మా చెప్పిస్తుకే వేస్తున్నావ్ టోపీ నీ దృష్టిలోనూ పడింది" అన్నారు. నా శరీరం మంచుగడ్డయి పోయింది. అన్నయ్యంటే వాళ్ళకు ఏ పాటి గౌరవం ఉందో క్షణంలో తేలిపోయింది.

"టోపీనా, ఓహో మీ ఆలోచన అంతవరకూ పోయిందన్నమాట. సుభాషిణి ఎవరోకాదు, మా చెల్లెలు" అని వెళ్ళిపోయాడు. వాళ్ళు నిర్ఘాంతపోయి ఒకరి ముఖాలొకరు చూసుకున్నారు.

"మా అన్నయ్య మీకు తెలుసా" అన్నాను.

"వాణినాథం మీ అన్నయ్యని ఇప్పుడే తెల్సింది." ఆ మాటలో తేలికభావం కనిపించింది, అంతవరకూ నా మీద వాళ్ళకున్న గౌరవభావం ఒక మెట్టు జారినట్లు గ్రహించాను.

ఆ రాత్రి బాగా పొద్దుపోయాక అన్నయ్య ఇంటికివచ్చాడు. అంతకు క్రితమే అన్నయ్య ఆఫీసుకువచ్చి పాతిక రూపాయలూ తీసుకు వెళ్ళినట్లు నాన్నకు చెప్పాను.

"అంత అర్జంటుగా పాతికరూపాయలూ ఎందుకావాల్సి వచ్చిం దిరా అన్నయ్యా" అడిగాను

"ఎందుకో కావాల్సొచ్చింది, అదంతా నీకనవసరం. వారం రోజుల్లో నీ బాకీ తీర్చేసాను" కోపంగానే అన్నాడు.

"మా ఆఫీసులో వాళ్ళు నీకు తెల్సా"

"ఆడవాళ్ళ బ్రతుకులు నాకు బాగా తెల్సు. ఆ నలుగురూ బ్రాకెట్ ఆడేవాళ్ళే, మంచి పేకాటరాయుళ్ళు."

"నీ ఉద్యోగమూ అదేగా"

"సుభా అదంతా నీకు అనవసరం."

నాకూ కోపంవచ్చింది. అన్నయ్య ఆఫీసుకు రావడంతో వాళ్ళ నలుగురి భావాలూ నాకు కళ్ళకు కట్టినట్లు కనిపించటంతో ఈ విషయమూ ఇప్పుడే తేల్చుకోవటం మంచిదని అనేశాను.

''నీకు డబ్బు కావలిస్తే ఇంటిదగ్గరే అడుగు నా కోసం ఆఫీసుకు ఎన్నడూ రాకు నన్ను గౌరవంగా ఉద్యోగం చేసుకోనీ."

నాన్నా, అమ్మా విభ్రాంతితో చూశారు. అన్నయ్య ప్రయోజకత్వం వాళ్ళకూ తెల్సినా నేనింత సూటిగా మాటాడుతానని వాళ్ళనుకో లేదు. అక్కయ్య వెర్రి చూపులుచూస్తూ గుమ్మాన్ని ఆనుకుని నిల్చుంది.

"ఓహో, నేను మీ ఆఫీసుకి రావటంవల్ల నీ గౌరవం పోయిందన్నమాట. అంటే నీ దృష్టిలో నేను గౌరవం లేనివాణ్ణన్నమాట. వెరీగుడ్, పోనీలే నా సత్తా ఏమిటో నాకు తెలియకపోయినా నువ్వన్నా చెప్పావు"

విసురగా అని గదిలోకి వెళ్ళిపోయాడు. ఆ రాత్రి నాకు నిద్రపట్ట లేదు. అన్నయ్య మరేం కొంపమీదికి తెస్తాడోనని భయపడ్డాను.

ఆఫీసుకు వెళుతున్నాను, వస్తున్నాను, వాతావరణం ప్రశాంతంగానే ఉన్నది.

వారంరోజులు గడిచాయి. ఒక రోజున లంచ్ టయింలో టిఫిన్ తిని కాలాగుతున్నాను. శ్రావణకుమార్ నా సీటు దగ్గరకు వచ్చాడు. అందరూ కాఫీకి వెళ్ళారు.

"మీరు టీ పార్టీ ఇవ్వాలి, కనీసం కాఫీ అయినా'' అన్నాడు.

''ఎందుకో చెప్పితే తప్పకుండా కాఫీ ఇప్పిస్తాను."

"వాణీనాధం మీ అన్నయ్య అయినందుకు" కాస్త కలవరపడ్డా తేరుకున్నాను.

"వాడు మా అన్నయ్య ఇప్పుడు కాలేదు, నేను పుట్టినప్పుడే వాడు నాకు అన్నయ్య" నవ్వి అన్నాను.

"మాకు తెల్సింది ఇటీవలనే కద. అందుకని ఇప్పించాలి, తప్పదు."

జవాన్ని పిలిచి ఫ్లాస్కు ఇచ్చి పంపాము కాఫీ టిఫిన్ తేవటానికి.

"నిజంగా తెప్పిస్తున్నారా."

"ఆఁ మా అన్నయ్య మీకెట్లా తెలుసు."

"కొంతమందికి కొన్ని అలవాట్లుంటయ్యి. నాకు పేకాట ఫ్రెండ్. కాని అలాంటివాడు మీకు అన్నయ్య కావటం ఒక క్రెడిట్" అన్నాడు ఏదో ఆలోచిస్తూ.

"ఎందుకని"

"అతను చాలా సమర్థుడు. నిక్కచ్చి మనిషి. జులాయిగా తిరిగి నట్లు కనిపిస్తాడు కాని నాలుగు డబ్బులు సంపాదించుకోగలడు. కాకపోతే దుర్గుణాలు మానవుడిలో ఉంటయ్యిగాని, మానుల్లో వుండవుకదా. వాణీ నాథం మీ అన్నయ్యని తెల్సినవాడెవరూ మీ జోలికిరాడు."

అన్నయ్య ప్రతాపాలు కథలుగా చెప్పుకునే రీతిలో వున్నయ్యని కాస్త కాస్త తెలుస్తున్నది. మంచి తెలుసుకోడానికి సంవత్సరం కావలసి వస్తే చెడు తెలుసుకోటానికి నెలరోజులు చాలన్నమాట.

"పోనీలెండి యిప్పుడు వాడి ప్రతాపం ఎందుకు. ఆ మీకు కాఫీ, టిఫిన్ ఆఫీస్ మెంబరుగా ఇస్తున్నాగాని, వాడు మా అన్నయ్యనికాదు తెల్సిందా" ఎందుకనో అన్నయ్యమీద అభిమానం పెంచుకోలేక పోతు న్నాను.

"అట్లాగే నా మీద కోపం పోయిందా."

"ఆఫ్టరాల్ టైపిస్టుని నా కోపం మిమ్మల్నేం చేస్తుంది." ఎగతాళిగా అన్నాను.

"ఏం చెయ్యకపోయినా కోపం పోనక్లేకదా. ఒక ఆడపిల్లకు ఆ మాత్రం కోపం నా మీద ఉన్నదంటే అదీ ఒక అదృష్టమే" సిగరెట్

వెలిగించుకోబోయాడు, అంతలోనే మళ్ళీ సిగరెట్ పెట్టె జేబులో వేసుకున్నాడు,

"మీ మీద నాకు కోపం ఉండటం అదృష్టం ఎలా అవుతుంది."

"కోపంగానయినా మీ మనస్సులో నేనుంటాను కనుక" గుండె ఝల్లుమన్నది, సిగ్గుపడ్డాను, జవాను టిఫిన్ తెచ్చాడు,

నెల గడిచింది. ఉదయం పదిగంటలయింది. భోజనం పూర్తయింది, ఆఫీసుకు వెళ్ళటానికి తయారవుతున్నాను, శ్రావణకుమారు సైకిల్ మీద వచ్చాడు, ఆశ్చర్యపోయాను, ఎందుకొచ్చాడో ఊహకు అందలేదు,

"గుడ్ మార్నింగ్ సుభాషిణీ చిన్న సహాయంకోసం వచ్చాను. ఏమీ అనుకోరుకద" అన్నాడు,

"ఏమీ అనుకోను చెప్పండి" కొంచెం ఇబ్బందిగాచూస్తూ అన్నాను. ఆఫీసు స్నేహం ఇంటిదాకా రావటంలో ఆంతర్యం ఏమిటో నాకు బోధపడలేదు.

"కొంచెం అర్జంటు పని ఉంది, ఆఫీసుకు రాలేను. ఈ క్యాజువల్ లీవప్లికేషన్ ఆఫీసులో ఇవ్వండి." అని సెలవు కాగితం ఇచ్చాడు,

"అటాగే"

"శ్రమకు మన్నించాలి" అతను వెళ్ళిపోయాడు.

వాళ్ళ ఇల్లెక్కడో నాకు తెలీదు. సైకిల్ మీద ఆఫీసుకే వెళ్ళి సెలవు కాగితం ఇవ్వచ్చుగా. ఎందుకిట్లా చేసినట్లు. ఇతని శలవు కాగితం నేను తీసుకువెళ్ళి ఇస్తే ఆఫీసులో ఏమనుకుంటారు. శలవు కాగితాలు తెచ్చి ఇచ్చేంతవరకూ స్నేహం వృద్ధి చెందిందనుకుంటారా,

శలవు కాగితం అతను ఇవ్వడం నేను తీసుకోటం అక్క ఆయ్య చూస్తూనేవుంది. ఎవరే మీ ఫ్రెండా."

"ఆఫీసులో క్లర్కు"

"ఆఫీసులో ఇవ్వాల్సిన కాగితం నీ కివ్వటం ఎందుకూ."

"నేను ఆఫీసుకు వెళుతున్నాను కనుక" కోపంగానే అన్నాను. అక్కయ్య అడిగిందని కాకపోయినా అతను అట్లా ఇవ్వటం నాకూ బాగుండలేదు.

"పెళ్ళికాకుండా ఉంటే బావుండును."

''నువ్వు చేసుకుంటావా." నాకూ వళ్ళుమండిపోయింది.

"ఇహిహిహి" పెకిలిగా నవ్వుతూ వెళ్ళింది అక్కయ్య.

మనస్సు సరిపెట్టుకుని ఆఫీసుకు వెళ్ళగానే జవానుచేత అతని శలవు కాగితం హెడ్‌క్లార్కు దగ్గరకు పంపించాను.

మరో ఆయిదు నిమిషాల్లో జవానొచ్చి "మిమ్మల్ని హెడ్‌క్లర్కు గారు రమ్మంటున్నారు" అన్నాడు.

వెళ్ళాను. విష్ చేశాను.

''శ్రావణకుమారు శలవు కాగితం మీ కెట్లా వచ్చింది'' అన్నాడాయన.

''నేను ఆఫీసుకు బయలుదేరబోతుంటే సైకిల్ మీద మా ఇంటికి వచ్చి ఆఫీసులో ఇమ్మని చెప్పి వెళ్ళాడు" అన్నాను.

"ఇట్లాంటి ట్రిక్కులు ఇతనికి అలవాటే. ఇంకెప్పుడూ ఇతని శలవు కాగితాలు తీసుకోకండి. యు కెన్ గో" అన్నారాయన. నా సీట్లోకి వచ్చేశాను.

శ్రావణకుమారంటే ఆఫీసులో చాలా మందికి ఇంత వ్యతిరేక భావం ఎందుకున్నదో నాకు అర్థంకాలేదు. ఒక ఆఫీసులో ఇన్ని రాజకీయాలుంటే అసలు రాజకీయవేత్తలు ఎత్తుగడలూ, ఉపన్యాసాలూ ఆ మాత్రం లేకపోతే వాళ్ళు చలామణి కారనుకున్నాను.

అప్పటికప్పుడే నేను శ్రావణకుమారు శలవు కాగితం తీసుకు వచ్చినట్లు ఆఫీసంతా తెల్సిపోయింది.

"మీ ఇల్లు వాడికెట్లా తెలుసునండీ" అన్నాడొకతను.

"ఆఫీసుకన్నా మీ ఇల్లే అతనికి దగ్గిరయి ఉండొచ్చు." అన్నాడు మరొక యు. డి. సి.

"శలవు కాగితం తెచ్చినందువల్ల తప్పులేదనుకోండి. మనమంతా ఒక ఆఫీసులో వాళ్ళం, కాని వాళ్ళతో జాగ్రత్తగా ఉండాలి అన్నాడొక ఎల్. డి. సీ. "మోస్టు ట్రిక్కీఫెలో అందోయ్" అన్నాడింకో టైపిస్టు.

నాకూ నవ్వొచ్చింది. పళ్ళబింకాన ఆపుకున్నాను. "అతన్నిగురించి ఎవరిఅభిప్రాయం వాళ్ళు చాలాచెప్పారు. ఇంకాఎవరైనా చెప్పేవాళ్ళుంటే చెప్పండి ఒక్కసారే వింటాను. నాకు అతనిమీద ఏ అభిప్రాయంలేదు. మనందరం ఒక ఆఫీసులో ఉద్యోగం చేస్తున్నాం, ఈ సదభిప్రాయంతోనే శలవు కాగితం తెచ్చాను. మీ శలవు కాగితాలూ తెమ్మంటే మీ ఇళ్ళకు వచ్చి తీసుకుంటాను. పాపం మీరంతా మా ఇంటికి రావటం కష్టం" అన్నాను.

ఎవరి సీట్లలోకి వాళ్ళు వెళ్ళిపోయారు. ఆ సాయంత్రం ఆరున్నర కు శ్రావణకుమారు మళ్ళీ మా ఇంటికి వచ్చాడు. నేను ఆఫీసునుంచీ వచ్చి పది నిమిషాలయింది. నాన్నకూడా స్కూల్‌నుంచి వచ్చారు.

"శలవు కాగితం ఇచ్చారా" అన్నాడు.

"ఆహా, ఈ రోజు అందరికీ ఇదే అసెంబ్లీ క్వశ్చన్‌లా తయారయింది. మిమ్మల్ని గురించి అందరి అభిప్రాయాలూ నేను అడక్కుండానే చెప్పేశారు. మీ పాప్యులారిటీకి అంజలి ఘటించవలసిందే" అన్నాను పైకి నవ్వుతూ చెప్పినా లోపల ఉడికిపోతున్నాను. నాన్నకూడా అక్కడే ఉన్నారు.

"అదేమిటమ్మా, శలవు కాగితానికే ఇంత గొడవ జరిగిందా, ఏం నాయనా, మీ ఆఫీసులో శలవు దొరకటం కష్టమా ఏమిటి" అన్నారు నాన్న.

శ్రావణకుమార్ నా వైపుచూస్తూ అన్నాడు. "ఈ రోజున నా కసలు శలవుఅవసరమేలేదు. కాని కొంతమందిని స్టడీ చేయ్యాల్సొచ్చింది. దానికి ఇదే చిటకా వైద్యమనుకున్నాను. మీచేత శలవుకాగితం పంపాను. చింతకాయ పుల్లగా ఉంటుందనే అందరి భావం. కాని బాగా పక్వానికొచ్చి పండితే అంత పుల్లని కాయా కొంత తియ్యబడుతుంది" అన్నాడు.

నేను వంటింట్లోకి వెళ్ళాను. సాయంత్రం రాగానే నాకూ, నాన్న గారికీ కాఫీ ఇస్తుంది అమ్మ. ఆ రోజున ఇంకా కాఫీ తాగలేదు. అతని క్కూడా కాఫీ ఇద్దామంటే పాలులేవు. ఆ ఉన్న కాఫీనే టూబై త్రీ చేసి మూడు గ్లాసుల్లోపోసి తెచ్చాను. ఈ లోగా నాన్నగారు అతన్ని కుశల ప్రశ్నలు వేస్తున్నారు.

"కాఫీ తీసుకోండి" అన్నాను.

"ఇప్పుడే తాగొచ్చానండీ" అన్నాడు శ్రావణకుమార్.

"ప్రొహిబిషన్ ఉన్న ఈ రోజుల్లోనే" అన్నాను.

"కాఫీకి ప్రొహిబిషనేమిటండోయ్"

అతని ముఖ కవళికల్నిబట్టి అతను నేనన్నది ఊహించినది తప్పు కునేందుకు ఈ మాటన్నాడని గ్రహించాను. ముగ్గురం కాఫీ తాగాం.

"నేను జోక్‌గా అన్నదానికి జోక్‌గా సమాధానం చెప్పారు." ముగ్గురం నవ్వుకున్నాం.

"అయితే నా శలవు కాగితం దుమారం లేపిందన్నమాట".

"ఏదో కాస్త. కాకపోయినా గాలి ఉంటేనేగా దుమారం రేగేది. అది లేనప్పుడు ఎక్కడి చెత్త అక్కడే ఉంటుంది" అన్నాను.

కొంచెం ఇబ్బందిగా చూశాడు.

"మీ నాన్నగారేం చేస్తూ ఉంటారు" అన్నారు నాన్న.

ఈయనేదో బాదరాయణ సంబంధం కలిపేటట్లున్నాడని గ్రహించాను.

"ఈ లోకంలో విషయాలే మనకు పూర్తిగా తెలీనప్పుడు పరలోకంలో ఉన్న మా నాన్నగారేం చేస్తుంటారో ఎట్లా చెప్పేది'' అన్నాడు

"నువ్వు చాలా సరదాగామాట్లాడతావోయ్. వెరీగుడ్, వెళ్ళిరా" అన్నారు నాన్న.

బ్రతికానురా భగవంతుడా అనుకున్నాను. శ్రావణకుమార్ వెళ్ళిపోయాడు.

గుమ్మం అవతల ఉండి పొంచి వింటున్న అక్కయ్య నెత్తి గోక్కుంటూ వచ్చింది.

"ఈ సంబంధం అయితే బావుంటుంది నాన్నా" అన్నది.

"ఎవరికే పిచ్చిదానా'' అన్నారు నాన్న.

"సుభాకీ" అన్నది.

నా మనస్సులో ఏ సంచలనమూ కలగలేదు. నాన్న మనస్సు ముంగబోయింది.

"ఆ. పెద్దకూతురు పెళ్ళిచేసి తాటాకుల పాకలో కాపురం చేస్తున్నాను. రెండోకూతురు పెళ్ళిచేసి ఈ తాహతూలేక చెట్టుకింద....

"నాన్నా!" ఉగ్రరూపం దాల్చిన శక్తిలా అన్నాను అంతకోపం ఆవేశం, క్రోధం, ఉక్రోషం ఇంకా ఇంకా ఏమేమివచ్చాయో నాకు తెలీదు, నన్ను చూసిన నాన్న, అక్కయ్య బ్రమాన్పడిపోయారు.అక్కయ్య గజ గజ వణికిపోయింది. నాన్నకు నోటమాట రాలేదు. అమ్మ పెరటో నుంచి వచ్చింది, ఏమీ అర్థంకాక దిగాలుపడి నిల్చుంది పోయింది,

"నేను పెళ్ళి చేసుకుంటే నాకు నచ్చినవాణ్ణి నువ్వు మెచ్చినవాణ్ణి, రూపాయి కట్నం లేకుండా మీ అంగీకారంతో పెళ్ళిచేసుకుంటను. నన్నుగురించి నువ్వు కల్లోకూడా బాధపడక్కర్లేదు" ఆవేశంతో అనాను, అందరి హృదయాలూ తేలికపడ్డట్టు వాళ్ళ ముఖాలే చెప్పాయి.

హెపీస్టుగా నా సర్వీసు ఒక సంవత్సరం పూర్తయింది. ఒక ఇంక్రిమెంటు వచ్చింది.

నేను చ్రతకలేకపోననే ధీమా కలిగింది. ఉన్న ఉద్యోగం పోదు. ఇంకో సంవత్సరంలో ప్రొబేషన్ పూర్తయినపుడు అప్పూవుడు ప్రొబేషనరునై పోతాను. ఉద్యోగం వేరు. జీవితంలో కలిగే మార్పులు వేరు. ఉద్యోగరీత్యా ఆ పరిధిలో కొన్ని నిబంధనలూ, చట్టాలూ ఉన్నాయి ఆఖరి గీతలో మన ఇష్ట ప్రకారం నిజాయితీగా ఉద్యోగంచేసి ఆర్థికంగా, సాంఘికంగా కొంత మనశ్శాంతిని పొందవచ్చు. ఏ వ్యక్తికయినా ఆర్థిక స్వాతంత్ర్యం ఉంటేనే ఇతరత్రా కూడా రాణిస్తాడు, స్వశక్తిపై ద గౌరవప్రదంగా ఆర్థిక స్వాతంత్ర్యపు విలువ మనవారికన్నా ఎక్కువగానే ఉంటుంది. మానసికంగా ఎంతో సంతృప్తి,

అటువంటి సంతృప్తి నాలో కలిగినా ఎప్పటికయినా సాయంత్రం ఇంటికి రాగానే మనస్సు విప్పి చెప్పుకునే 'నా వారు' అనే వ్యక్తి ఉండాలనే కోరికకు అంకురం నాకు తెలియకుండానే ఏర్పడింది. పురుషవాంఛ కోసం కాంక్షించే కాంక్షకాదు. సంసార సాగరంలో కాలూని, ఆ సముద్రపు కెరటాలలో స్నానం చేద్దామనీ కాదు. ఒక స్త్రీగా ఆదర్శ గృహిణిగా జీవితాన్ని మలుచుకుందామనే ప్రాతిపదికమీద శారీరక వాంఛని తీర్చిదిద్దుకోడానికే కాదు. ఏదో, ఎందుకో, ఏమిటో తెలియని ఆకాంక్ష. నేను నా హృదయం విప్పి కబుర్లు చెప్తూంటే మనస్ఫూర్తిగా విని సంతోషంతో నా అభిప్రాయాన్నిమన్నించి గౌరవించి ఆచరించే వ్యక్తికావాలి.అట్లాగే వారి అభిప్రాయాన్ని కూడా మనస్ఫూర్తిగా విని ఎంతో ఆనందంతో ఆచరణలోకి తెచ్చి గౌరవంతో అమలుపరుస్తాను. వారి హృదయంలోకి నేనూ, నా హృదయంలోకి వారూ ఎప్పుడూ ప్రవేశిస్తూ తనివితీరా తృప్తిగా కబుర్లు చెప్పేవారుగా ఉండాలి. శారీరకంగా, మానసికంగా, ఆలోచనా పరంగా, అభిప్రాయానుసారంగా ఎలాంటి భేదాభిప్రాయాలూ ఉండకూడదు. అలాంటి వ్యక్తి ఎవరు ? తల్లిదండ్రులు కారు, అక్కచెల్లెళ్ళు కారు, అన్నదమ్ములు కారు, చివరికి ప్రాణమిత్రులు కారు, అలాంటి

వ్యక్తి స్త్రీకి భర్త. పురుషుడికి భార్య. ఇటువంటి దాంపత్యమైతే ఎంత బావుంటుంది ?

వార్ని విడిచి ఒక్క క్షణం కూడా వుండలేనని ఘనంగా చెప్పే స్వభావం నాకక్కర్లేదు. భర్తను కొంగుకు కట్టుకుని తిప్పగల సాహసము నాకులేదు. అనుక్షణమూ భర్త కౌగిలిలో కరిగిపోదామనే ఆకాంక్ష నాకు లేదు. నేనూ సంపాదన పరురాలిననే అభిజాత్యంతో భర్తను లెక్క చెయ్య కూడదనే గడుసు మనస్త్వం నాకులేదు. భర్త ఆదరణనూ, ఔన్నత్యాన్ని చాటుకుంటూ చుట్టుపక్కల అమ్మలక్కలతో గర్వంగా, ఠీవిగా మాట్లాడే మనస్తత్వాన్ని నా మనసులో ప్రవేశించనీయను స్త్రీ కుండవలసిన వ్యక్తిత్వాన్ని, గౌరవాన్ని, సాంఘిక విలువనూ, సామాజిక నీతిని సర్వం భర్త పాదాల మీద కుప్పగాపోసి ఆయన పాదధూళిని నేను నెత్తిమీద వేసుకోను. ఇంకా ఏవేవో కోరికలు, అభిప్రాయాలూ, ఆదర్శాలూ, ఉద్దేశాలూ, విమర్శలూ.

ఇవన్నీ నా జీవితంలో అమలు జరగాలంటే ? అలాంటి చేదువైన వ్యక్తి కావాలంటే ? కావలసింది పె....ళ్ళి అయితే ఆ వ్యక్తి ఎవరు ?

ఈ ఆలోచనలన్నీ ఆఫీసునుంచి ఇంటికి వస్తుంటేనే కలిగేవి. ఇంటికి వెళ్ళగానే ఆ వాతావరణం లేదు. ఈ మనస్సే ఆ ఇంట్లో ఉన్నా ఆ మనస్సులో అమ్మా నాన్నా, భర్త వదిలిపెట్టిన అమాయకురాలైన అక్కయ్య, వాడి లోకమేదో వాడికే అర్ధంకాని రౌడి మనస్తత్వం కల అన్నయ్య వీళ్ళే ప్రవేశిస్తారు. కాని మరో విషయం తలకెక్కదు. ఆఫీసులోనూ అంతే. ఆర్. డి. ఓ.గారు, హెడ్ క్లర్కు, యు. డి. సి.లు, యల్. డి. సీ లు, కోరెపిస్టు, జవాన్లు, పైపు చెయ్యాల్సిన కాగితాలూ, అర్జంట్లు, టుడేలు, సీక్రెట్ డిస్పోజల్సు, కాన్ఫిడెన్షియల్ పేపర్లు, డైరీ, పెండింగ్ పేపర్లు, తెల్ల కాగితాలకూ, కార్బన్ కాగితాలకూ, టైప్ రిబ్బన్లకూ ఇండెంటు చెయ్యటం, అప్పుడే అయిపోయాయా అని క్వశ్చన్ మార్కు ముఖంతో రెండు ముక్కలనిండా పొడుందట్టించే స్టేషనరీ క్లార్కూ మరో ప్రపంచం కాని అదో ప్రపంచం.

ఈ అదో ప్రపంచంలోనే లాఠీలు లేని రాజకీయాలు, హత్యలు లేని కుట్రలు, బల్లి పురుగుల్ని తింటుంది. ఉడుత అందిన కాయల్ని కొస్తుంది. చిలక సగం కాయ కొట్టుకు తినగానే ఆ కాయ కిందకు రాలిపడుతుంది. ఇందులో కొన్ని జలచరాలు చిన్నచేప, పెద్దచేప, తిమింగలం, కొన్ని ఎందుకూ పనికిరాని పత్తిగుల్లలు కొన్ని తేళ్ళు, పాములు మాత్రం లేవు.

అక్కయ్య ఇన్ని నెల్లనుంచీ ఎన్నడూ బైటికి రాలేదు. అది ఒక్కర్తీ ఎక్కడకీ వెళ్ళి రాలేదు, అమ్మగాని, నేనుగాని ఎవరో ఒకరం వుండవలసిందే. ఇంట్లో కూర్చుంటే దాని ఊహలు బావిలోని కప్పమాదిరే ఉంటయ్యేమోనని ఒక రెండో శనివారం రోజున బట్టలు కొనుక్కుందామని అక్కయ్యను తీసుకుని బయల్దేరాను. చేనేత సప్తాహం జరుగుతోంది. రూపాయకి పది పైసలు రిబేటు. మెల్లిగా నడిచివెళ్ళి ఆ కొట్టుదగ్గరకి చేరాం, దారో అక్కయ్యకు చెప్పాను, "నెత్తి గోక్కోవద్దు వెకిలినవ్వు తగ్గించు. అర్థంలేని అభిప్రాయాలు చెప్పకు" అన్నాను. సరేనని తల ఊపింది,

ముందు ఒక వరసనఉన్న కొట్లన్నీ చూస్తూ వెళ్ళాం. వింతగా చూడసాగింది అక్కయ్య అది చూపినంతసేపూ తొందర చెయ్యకుండా నేనూ నిల్చుని చూచేదాన్ని. అక్కయ్య కావాలంటే దానికి నచ్చిన చీరె కొందామని డబ్బు కూడా తీసుకువెళ్ళాను.

అన్ని కొట్లూ తిరిగ్గా చూచాక "ఇక వెళదామా" అన్నది అక్కయ్య.

"నువ్వేం చీరె కొనుక్కోవా ?"

"చీరా నువ్వు కొనిపెడతావా ?"

"అవును, కావాల్సిన చీరె తీసుకో, డబ్బు తెచ్చాను."

"ఏం వద్దులేద్దూ కాసేపు ఆ పక్కన కూర్చుని అందర్నీ చూసి వెళ్ళిపోదాం.

కాళీ జాగాలో కూర్చున్నాం. అరగంటసేపు అక్కయ్య వచ్చే పోయేవాళ్ళని చూస్తూ కూర్చుంది. దానంతట అది ఏం మాట్లాడలేదు.

"బావకు ఉత్తరం రాయరాదూ తీసుకువెళ్ళమని ఆయన మాదిరి మవ్వూ భీష్మించుకుని కూర్చుంటే ఎలా" అన్నాను.

"ఆయనకు నేనక్కర్లేకపోతే ప్రతిమాలమంటావా. నాకేం పట్టింది" అన్నది. ఈ మాటకు నవ్వాలో, ఏడవాలో తోచక బాధ పడ్డాను.

"పరేగాని ఆ అబ్బాయిని పెళ్ళి చేసుకోరాదుటే" అన్నది చేత్తో చూపిస్తూ. అటు చూశాను. శ్రావణకుమార్, మమ్మల్ని చూసి ఇటు వచ్చాడు.

"ఓ, గుడీవినింగ్. షాపింగుకు వచ్చారా" తనూ మా ఎదురుగా కూర్చున్నాడు.

"కాదు. గాలి మేద్దామని. ఈ సప్తాహాలు చూస్తుంటే భారీ ఎత్తున వేసే టికెట్టులేని నాటకాల్లా ఎంతసేపు కూర్చున్నా కాలం గడిచి పోతుంది" అన్నాను.

అతనూ నవ్వి, "నేనూ కాలక్షేపానికే వచ్చాను" అన్నాడు.

పక్కనున్న కూల్ డ్రింక్ షాపునుంచీ మూడు ఐస్‌క్రీంలు తెచ్చాడు మా ఇద్దరికి చెరొకటి ఇచ్చి తనొకటి తీసుకున్నాడు. ఏదో మర్యాదకు అతను తెప్పించినట్లు పైకి కనపడినా ఆంతర్యంలో అతను నాకు సన్నిహితుడు కావటానికే ఇట్లా మసలుకుంటున్నాడేమోనని అని పించింది.

"చల్లని ఐస్‌క్రీం ఇప్పించారు. మా చెల్లెల్ని పెళ్ళి చేసుకోరాదు టండీ" అన్నది అక్కయ్య.

నా శరీరమంతా చల్లబడి పోయింది. చాలా సేపటివరకూ తేరు కోలేకపోయాను. అక్కయ్యను నమిలి మింగుదామన్నంత కోపం

వచ్చింది. ఈ తెలివి తక్కువ దద్దమ్మ మాటలు నా తల కొట్టేసినంతగా బాధపెట్టాయి. అతనూ అయిదు నిమిషాలు మాట్లాడలేదు.

"ఇంత చల్లని ఐస్‌క్రీం తింటూ మీ అక్కయ్యగారు ఎంత చల్లని మాట చెప్పేరో చూశారా" అన్నాడు.

"అక్కయ్యకేం? చెప్తుంది. అమ్మటానికి పెంకుటిల్లు ఉన్నది కనుక దాని పెళ్ళి ఇల్లమ్మి చేశారు. ఇంక నా పెళ్ళి చెయ్యాలంటే నాన్న తను అమ్ముడు పోవాల్సిందే" అన్నాను అక్కయ్య మీద కోపంతో.

"అక్కర్లేదు. నేనే మీకు అమ్ముడుపోతాను. మీ మనస్సుని మాత్రం నాకు కానుకగా ఇవ్వండి" అని వెళ్ళిపోయాడు శ్రావణకుమార్.

నాన్నగారు ఆకాశమంత పందిరీ భూదేవంత అరుగూ వేయలేదు. మేమున్న పాకముందే షామియానా వేయించారు, పది చాపలు వేయించారు. పైసా కట్నం లేకుండా నిరాడంబరంగా పెళ్ళి జరిగింది. అందరి ఆశీస్సులూ లభించాయి.

ఆఫీసులో వాళ్ళంతా అన్నారు "మీరేం ప్రేమించి పెళ్ళి చేసుకున్నట్లు గట్టి దాఖలా ఏమీ లేదు, ఓ పదిహేను రోజులు సెలవు పెట్టి హానీమూన్‌కయినా వెళ్ళరండి."

"మాది సినిమా పెళ్ళిలా కనిపించిందా మీకు" అన్నాను నవ్వుతూ.

"సుభాషిణి మాటలు తేనెలా వుంటాయి, మనస్సు చల్లని వెన్నెల ఇంక వేరే హానీమూన్ ఎందుకూ" అన్నారు శ్రావణకుమార్. అంటే మా శ్రీవారు.

మాటలకు మాత్రమే చేరువైన పదిమంది వ్యక్తులతో మాట్లాడినప్పుడు కలిగే సంతోషంకన్న మనస్సుకు చేరువైన ఒక జీవిత భాగ

స్వామితో మాట్లాడుకుంటే కలిగే అనుభూతి సంతోషమూ ఎన్నో వందల రెట్లు మన జీవితానికి ఆనందం కలుగజేస్తాయి.

మొదటిరాత్రి తొలి అనుభవాలు శరీరాన్ని పుష్కలంగా ముంచెత్తినా మనస్సులోని మాటలు మధురానుభూతిని చవి చూపిస్తాయి కాని నా జీవితంలో మొదటి రాత్రి ప్రతివిషయంలోనూ నా మనస్సుకు హద్దుల్ని ఏర్పరచింది.

"సుభా ఆ నాటి నా కోరిక తీర్చుకునేందుకు నా మాటలు గుర్తున్నాయా" అన్నారు

నేను గోముగా చూసి మనసారా నవ్వుతూ వారి గుండెలమీద తల వాల్చి అడిగాను.

"ఏమిటా మాటలు, ఏమాకోరిక?"

"నీ మనస్సు నాకు కానుకగా ఇవ్వమని కోరుకున్నాను గుర్తుందా"

"ఆ ఐస్‌క్రీమ్‌తో పెళ్ళి సంబంధం కుదిరిన సంఘటన గుర్తుంది. ఈ సారి కూల్‌డ్రింక్స్ ఇప్పిస్తారా"

"కూల్‌డ్రింక్స్ ఫ్రిజిడేర్‌లో ఉన్నంతసేపే చల్లగా ఉంటాయి. ఆ తరువాత ఆ చల్లదనమంతా వేడెక్కుతుంది. వైవాహిక జీవితమూ అంతే."

ఎదురుగా టేబుల్‌మీద ఫలహారాల పళ్ళెం నోరూరిస్తున్నది. ఒక మైసూరుపాక్ తెచ్చి నోటికి అందించాను.

"వైవాహిక జీవితం అంతే" అన్నారు. "ఎంతేమిటి?"

ఆనాటి టైప్ చెయ్యవలసిన కాగితం సంగతీ తరువాత జరిగిన గ్రంథమూ గుర్తొచ్చింది. కాని ఇది ఆఫీసుకాదు, ప్రత్యేకించిన గది.

"నీ మనస్సుని కానుకగా ఇవ్వమని కోరుకున్నాను. పెళ్ళయింది కాని మనస్సు మాత్రం ఇవ్వలేదు" అన్నారు. వారి కళ్ళలోకి చిలిపిగా

చూశాను. ఈ సృష్టిలో ఆకలిదప్పులు అందరికీ ఉండేవి. కాని మత్తెక్కించే మధురానుభూతి మనస్సులో ఉన్న యువ జంటల ప్రత్యేకత.

"పెళ్ళిచేసేది పెద్దలు. వాళ్ళ బాధ్యత అంతవరకే. భార్య మనస్సుని భర్త మాత్రమే ఒడుపుగా చేజిక్కించుకోవాలి. నీ మనస్సు తానుగా కావాలి అంటూ పందిరిమంచంమీద పడుకున్నంత మాత్రాన రాదు" అన్నాను.

"కాదు సుభా. నీ అంద చందాల్నిచూసి నేను నిన్ను ప్రేమించ లేదు. అసాధారణమైన నీ మనసుచూసి నిన్ను ప్రేమించాను. ఆ మనస్సు నా మనస్సులో కల్సిపోవాలి" ప్రాధేయ పూర్వకంగా అడిగినట్లు చూశారు.

"నా మనస్సు అసాధారణమైందని అంటున్నారు. ఆ ప్రత్యేకత ఏమిటో నాకే తెలీదు. సాధారణమైనా అసాధారణమైనా ఉన్న మనస్సుని మీరు నా మెళ్ళో మూడుముళ్ళూ వేస్తున్నప్పుడే మీకు సమర్పించాను."

"ఒట్టు"

నాకు నవ్వొచ్చింది. చిన్నపిల్లాడిలా చెయ్యి జాపారు.

"నా ప్రైవేటు ఉద్యోగం తోడు" అరచేతిలో గిల్లి వళ్ళో వాలిగి పోయాను.

"నీ మనస్సు నాదయినపుడు నా మనస్సూ వయస్సూ నీది. నేను చెప్పినట్లు నువ్వువింటావు కదూ."

"ఓ వింటాను. చెప్పండి. నా మనస్సు మీదయినప్పుడు, మీమనస్సు నాదన్నారు. అంటే గుండె మార్పిడిలా మనస్సు మార్పిడా" ఎగతాళిగా అన్నాను. తను లేచివెళ్ళి పళ్ళెంలోవున్న జీడిపప్పులు తెచ్చి ఒక పప్పు సగం కొరికి తతిమ్మా సగం నాకిచ్చారు.

"సుభా, కట్నంలేని పెళ్ళి ఉప్పులేని పప్పులా చప్పగా వుంటుంది. కాని ఆ చప్పని పప్పులో తగినంత ఊరగాయ కలుపుకుంటే ఎంతో రుచిగా వుంటుంది. ఆ ఊరగాయ నీ చేతిలో వుంది."

నా కుడిచేతిని తన చెంపలకు రాచుకుంటూ అన్నారు.

"వంటింట్లో ఆవకాయ జాడీ పట్టమన్నారా"

"కాదు సుభా. నువ్వు ఉద్యోగం చెయ్యాలి. ఏ పరిస్థితిలోనూ ఉద్యోగం మానెయ్యకూడదు."

"అట్లాగే, ఇంక మీ కోరికల లిస్టు తిరిగ్గా రేపు చెప్తురుగాని ఈ రోజుకి నిద్రపోతారా."

వారంరోజులు గడిచాయి. నేను కాపురానికి వచ్చేశాను. వచ్చే టప్పుడు అమ్మ నన్ను కావిలించుకుని ఏడ్చింది. కాపురానికి కూతుర్నిపంపే టప్పుడు అది ప్రతి కన్నతల్లికీ అలవాటేమో అనుకున్నాను.

"సుభా, కోరిన వరుణ్ణి కట్నం ప్రమేయం లేకుండా పెళ్ళి చేసు కుని సుఖంగా కాపురానికి వెళుతున్నావు. నువ్వుంటే అక్కయ్య తెలివిన పడుతుందేమో అనుకున్నాను. నువ్వు వుంటేనే దాని మనస్సు చీకట్లో వుంటుంది. నీ ఇంటికి నువ్వు వెళ్ళిపోతే ఇంక దాని జీవితం పూర్తిగా చీకటైపోతుందేమో" అన్నది అమ్మ.

సహజ ధోరణిలో అక్కయ్య వెకిలిగా నవ్వి "ఎక్కడికిపోతుందే కొన్నాళ్ళు మొగుడితో గడిపాక అదీ ఇక్కడికే వస్తుంది. అది రాకపోతే నేవెళ్ళి తీసుకొస్తాను" అన్నది,

అమ్మా, నాన్నా మురుదు బాదుకుంటూ "మా కర్మకొద్ది దొరికావే. శుభమా అంటూ అది కాపురానికి వెళుతుంటే నీ అపశకునం మాటలూ నువ్వూను" అని అక్కయ్యను కేకలేశారు.

అక్కయ్యకు చిన్నబుచ్చుకోవటంకూడా తెలీదు. "సుభా, త్వరగా వచ్చెయ్" అని నవ్వుతూ నిల్చుంది,

నేను వారితో టాక్సీ ఎక్కాను, నాకు తెలియకుండా నా కళ్ళల్లో నీళ్ళు చిప్పిల్లాయి.

వారికి తల్లిలేదు. చిన్నప్పుడే తల్లిపోయింది. తండ్రీ రెండో పెళ్ళి

చేసుకున్నారు. ఆ సవతి తల్లే వాళ్ళి పెంచి పెద్దచేసింది. ఆవిడకూ ఇద్దరు పిల్లలు పుట్టిపోయారు. తరువాత సంతానం కలగలేదు. వాళ్ళి కన్నతల్లి కన్నా ఎక్కువ ప్రేమతో, మమకారంతో పెంచి పెద్దచేసింది కన్నప్రేమ. ఆమెకు దూరమయినా ఈ పెంచిన ప్రేమ ఆవిడగారి నరనరాల్లో జీర్ణించి పోయింది. ఆవిడ లోకానికి సవతితల్లి. కాని యథార్థానికి కన్నతల్లి కన్న మిన్న. ఆవిడ పేరు యశోదమ్మ. వారి తండ్రిపోయి నాలుగేళ్ళయింది. తల్లీ కొడుకూ ఉన్న ఆ ఇంట్లో కోడలుగా ప్రవేశించాను నేను. అది వారి స్వగృహం. వేరే ఆస్తిలేదు. మరో మూడురోజులు గడిచాయి. సెలవు అయిపోయింది. ఇద్దరం ఆఫీసులో జాయినయ్యాం. రోజూ తొమ్మిదన్నర కల్లా ఇద్దరం భోజనం చేసేవాళ్ళం. భోజనాలయి ఆ కంచాలు కడిగి, అత్తయ్యకు సాయంచేసి నేను ఆఫీసుకు వెళ్ళటానికి సిద్ధపడేసరికి పదిం బావయేది. ఇద్దరం బయలుదేరి ఆఫీసుకు వెళ్లేవాళ్ళం. సాయంత్రం ఆరు గంటలకల్లా ఇద్దరం బయలుదేరి వచ్చేవాళ్ళం.

జీవితంలో మార్పు కనిపించేసరికి ఇంటి వాతావరణంతో పాటే ఆఫీసు వాతావరణంలోనూ మార్పువచ్చినట్లు కనిపించేది. అందులోనూ భార్యాభర్తలు ఒకే ఆఫీసులో పనిచేస్తున్నప్పుడు ఆ మార్పు ఇంకా సహజం.

ఒకటో తారీఖున జీతంవచ్చింది. మా పెళ్ళి పదిహేనో తారీఖున అయింది. ఆ రోజునుంచి వారి భార్యను, అంటే పద్నాలుగో తారీఖు వరకూ నేను తల్లిదండ్రుల ఆధీనంలో ఉన్న పిల్లను. వారి మనస్తత్వం కనిపెట్టాలని ఒక చిన్న తమాషా చేద్దామనుకున్నాను.

ఏదో సామెత చెప్పినట్లుగా నాకన్న వారే రెండాకులు ఎక్కువ చదివారు. జీతం తీసుకుని ఇంటికి రాగానే వారన్నారు.

"సుభా, ఈ రోజునుంచీ మనిద్దరి జీతాలూ కలిపి వాడుకుందాం. ఖర్చులుపోను మిగిలింది బ్యాంకులో దాచుకుందాం. ఏదీ నీ జీతం ఇవ్వు. ఖర్చులకు ఓ ఇరవై రూపాయలు తీసుకో" అని జీతం ఇవ్వమన్నట్లుగా

చెయ్యి జాపారు. క్షణంసేపు విస్తుపోయాను. ముఖంలో ఆ భావం కన పడనీయలేదు.

"నా జీతంమీద మీకు హక్కు పదిహేనో తారీఖునుంచీ సంక్ర మించింది. మొదటి పధ్నాల్గురోజుల జీతం మీ కివ్వనక్కరలేదు. ఆ జీతం మా నాన్నగారికి ఇస్తాను" అన్నాను. వారు ఎగతాళిగా నా బుగ్గగిల్లి "మైడి యర్ సుభా పెళ్ళినాటికీ పధ్నాలుగు రోజులముందే తాంబూలాలు పుచ్చు కుని లగ్నాలు పెట్టుకున్నాం. ఆ రోజునుంచీ నువ్వు నా దానివే. కనుక నెల జీతంమీదా నాకు హక్కున్నది. భామామణీ" అన్నారు నిజంగా నాకు నోటమాటరాలేదు. జీతమంతా వారికే ఇచ్చేశాను. ఒక్క పైసాకూడా నేను తీసుకోలేదు.

''జీతం అంతా ఇచ్చేశావేం కోపంవచ్చిందా" మనస్సులో కోపం ఉన్నా పైకి నవ్వు ముఖంతో అడిగారు.

''జీతం నా కెందుకండీ మధ్యాహ్నంపూట మీరే కాఫీటిఫిన్ ఇప్పిం చండి. కావలసిన బట్టలూ, వెచ్చాలూ మీరే తెస్తారు. ఇంక నాకు డబ్బుతో పనిలేదు" అంతకన్నా మాట్లాడలేక పోయాను.

వారం గడిచింది, సరిగ్గా మధ్యాహ్నం రెండుకాగానే జవానుచేత కాఫీ, టిఫిన్ తెప్పించి నాకు పంపేవారు. నేనేమీ అనేదాన్ని కాదు.

పెళ్ళికాని రోజుల్లో ఉద్యోగం చేస్తున్నప్పుడు ఆడదాని ఆర్థిక స్వాతంత్ర్యాన్ని గురించి ఎన్నో కలలు కనేదాన్ని. ఆఫీసుకు వెళుతున్నా ఇంటికి తిరిగి వస్తున్నా ఉద్యోగం చేస్తున్నాననే ధీమా నా మనస్సులో పల్టీలు కొట్టేది. పెళ్ళితో అదే మారిపోయింది. ఏదో పెద్ద అప్పు తీర్చ టానికి మాత్రమే ఉద్యోగం చేస్తున్నట్టున్నది. చేతులో అయిదు పైసలు ఉండేదికాదు, ఖర్చులకు తీసుకుంటే వారు అంటారనికాదు కాని నా జీతం మీద అంత నిష్కర్షగా ఎందుకు అధికారం చూపిస్తున్నారో నాకూ అర్థం కాక అర్థమయ్యేలా చేసుకుందామనే దీక్షతో ఈ నిర్ణయానికి వచ్చాను. ఏమిటో నాలో నాకు తెలీకుండానే ఉక్రోషంతో కూడిన అభిమానం తలెత్తింది.

ఒక రోజు రాత్రి అన్నారు,

"జీతం తీసుకున్నానని కోపం వచ్చిందా" సుభా.

"లేదు నా మనస్సునే మీకు కానుకగా ఇచ్చినప్పుడు నా జీతం మీ కివ్వటంలో కోపం ఎందుకూ. నా మనస్సే మీ దగ్గరే ఉన్నప్పుడు అసలు కోపం మాత్రం ఏ ముఖం పెట్టుకుని వస్తుంది" అన్నాను. ఏదో విజయ గర్వంతో ఉన్నట్లుగా నా వైపు చూశారు.

రోజూ భోజనాలు కాగానే ఆఫీసుకి వెళ్ళేముందు మా ఇద్దరి కంచాలూ నేనే కడిగి ఆ కాస్త సమయంలో అత్తయ్యకు ఇంటిపనిలో కొంచెం సాయంచేసి ఆఫీసుకి బయలుదేరే దాన్ని. అట్లా ఇంటి పనికూడా నేనే చెయ్యటం వారికి నచ్చేదికాదు,

ఒకరోజున గడియారం ఆగిపోయింది. టైము తెలీలేదు వారు ఆఫీసుకి వెళ్ళటానికి తయారయారు,

''సుభా పదిన్నరయింది ఇవాళ ఆఫీసుకు రావా ఏమిటి'' కోపంతో కేకేశారు.

"ఇదుగో అయిదు నిమిషాల్లో వచ్చేస్తున్నా'' అన్నాను. వెంటనే అత్తగారిమీద కోప్పడ్డారు.

"పిన్నీ సుభాని పెళ్లి చేసుకుంది. నాతో పాటుగా ఉద్యోగంచేసి నెల్లు జీతం రాళ్ళు తేవటానికి. వంటింట్లో నీకు సాయంచేస్తూ అప్పలమ్మలా ఇంటిపని చెయ్యటానికి కాదు, నాకు పెళ్ళయి కోడలు కాపురానికి రాగానే నీకు అత్తగారి హోదా వచ్చిందనుకుంటున్నావేమో, అదేంకాదు"

కొడుకు ఇంతమాట అంటారని ఆవిడ అనుకోలేదు. కాకపోయినా ఆవిడ మనస్సులో అత్తా కోడలనే దృష్టేలేదు. నన్ను ఎంతో ఆదరణగా చూసేవారు వంటపనిలోగాని, ఇంటిపనిలోగాని నే నావిడకు సాయం చెయ్యటానికివస్తే "వద్దమ్మా. ఇద్దరంచేసే పనేదీ లేదిక్కడ నువ్వే దన్నా చదువుకో. త్వరగా తెమిలి ఆఫీసుకు వెళ్ళు ఏమీలేకపోతే గదిలో

కూర్చుని కబుర్లు చెప్పుకోండి'' అనేది. అటువంటిది కొడుకు ఈ మాటనే సరికి ఆవిడ ఖిన్నురాలైంది.

"సుభా నా మీద నీకు గౌరవం ఉన్నదనే అనుకుంటున్నాను. అదే కనక నిజమయితే ఈ రోజునుంచీ నువ్వు ఇంటిపనిలో జోక్యం పెట్టుకో వద్దు. వెళ్ళమ్మా వెళ్ళు" లేనిపోని ఈ అభాండానికి మనస్సులో బాధ పడుతూ అన్నదావిడ. నేనేం మాట్లాడకుండా ఆఫీసుకు బయలుదేరాను.

కలెక్టరాఫీసులో పనుండి వారు కాకినాడ వెళ్ళారు. రెండురోజుల వరకూ రారు. మర్నాడు ఉదయమే కాకినాడ వెళ్ళబోతూ "సుభా, నేను లేనని అత్తయ్యతో ముచ్చట్లాడుతూ ఆఫీసు మాట మర్చిపోయేవ్ ఉద్యోగం చేసే ఆడవాళ్ళంటే నాకున్న సదభిప్రాయంలో వెయ్యో వంతయినా పిన్నికిలేదు. అయిదున్నరకల్లా ఇంటికివచ్చెయి. ఆవిడతో ఎక్కువగా కలగ చేసుకుని మాట్లాడకు'' అన్నారు.

మనస్సులో నొచ్చుకుని ఊరుకున్నాను. సాయంత్రం ఆరుగంటలకు బయలుదేరి మామూలు వేళకే ఇంటికి వచ్చాను. కాకినాడ వెళ్ళే ముందు రెండురూపాయలు చేతిలో ఉంచి ఖర్చులకు వుంచుకో అన్నారు. ఈ మనిషి ప్రవర్తన ఇంతనీచంగా ఉన్నదేమా అని బాధపడి కానీ చూద్దామని మనస్సు సరిపెట్టుకున్నాను.

రాత్రి భోజనాలయాక ఎవరి పక్కలమీదికి వాళ్ళు చేరాం. అప్పటికి రాత్రి ఎనిమిది గంటలే అయింది.

"వాడు నీతో సరిగ్గా ఉంటున్నాడా సుభా'' అన్నది అత్తయ్య.

అత్తయ్యవేసిన ఈ ప్రశ్నకు నేను ఆశ్చర్యపడకపోయినా ఈ కొడుకును గురించి ఆవిడ జీవితంలో కొన్ని బాధలు పడిందేమోనని అనుమానం కలిగింది.

"అదేం లేద త్తయ్యా. నేనంటే వారు చాలా ప్రేమగా ఉంటారు. నాతో సరదాగానే ఉంటారు," అన్నాను.

అత్తయ్య నవ్వుతూ నా బుగ్గలు నిమిరింది. ఆవిడ హృదయం అగ్నిపర్వతమో మంచుకొండో నాకు తెలీలేదు.

# 5

"ప్రేమ, సరదా అనేవి రెండు రకాలు. కడుపులోనుంచి మన స్ఫూర్తిగా త్రికరణ శుద్ధిగా ఉన్న ప్రేమ, సరదా మొదటిది. తన పబ్బం గడుపుకునేందుకు నటించే ప్రేమ, సరదా రెండోది. మొదటి దానికన్న రెండవదానితోనే ఎంతో నమ్మకం కలగజేస్తారు కొంతమంది. ఈ రెంటిలో వాడి వ్యవహారం ఏ కోవకు చెందిందో నీకు తెల్సునా సుఖా" అన్నది అత్తయ్య. మంచంమీద పడుకున్నదల్లా లేచి కూర్చున్నది. నేనూ నా మంచం మీద కూర్చున్నాను.

"ఇష్టపడి పెళ్ళి చేసుకున్న భార్య విషయంలో రెండోరకమైన ప్రేమను ఒలకబోస్తారంటారా. వారిలో నటన లేదండీ. కాకపోతే మాట మాత్రం పెళుసు. మనసు మంచిది."

నా పొట్టమీద చేత్తో నిమురుతూ "ఈ మాట - ఇక్కణ్ణించే వచ్చిందా" అన్నదావిడ.

"పోనీ వారు నటిస్తున్నారనే అనుకుందాం. మీ అభిప్రాయం చెప్పండి."

ఆవిడ ఒక్కసారి నిట్టూర్చి నడుంవాల్చి కళ్ళు మూసుకుంది, నేను కూర్చునే ఉన్నాను.

"నేను కన్నతల్లిని కాకపోయినా త్రికరణ శుద్ధిగా ఆ పరమాత్ముడి సాక్షిగా వాణ్ని కన్నతల్లి కన్న ఎక్కువ వాత్సల్యంతోనే పెంచి పెద్ద వాణ్ని చేశాను. మీ మావగారు ఈ మునిసిపాలిటీలో బిల్ కలెక్టరుచేసి కాలం గడిపారే తప్ప పెద్ద ఉద్యోగమేం చెయ్యలేదు. ఆయన జీవితంలో సాధించింది ఈ ఒక్క చిన్న యిల్లు మాత్రమే కట్టగలిగారు. తల్లిపోయే సరికి మీ ఆయన నాలుగేళ్ళవాడు. నా కడుపున పుట్టిన ఇద్దరు మగపిల్లలూ పోవటంతో వీడిమీద నాకు గల మాతృవాత్సల్యం నాకు తెలీకుండానే

మర్రిచెట్టులా విస్తరించింది. ఎట్లా పెంచానో నా ఆత్మకూ ఆ పరమాత్మకూ తెలుసు.

వాడూ పి. యు. సి. వరకూ చదివి సర్వీస్ కమీషన్ పరీక్షపాసై ఉద్యోగంలో చేరాడు. అప్పర్ డివిజన్‌లోకివచ్చి మూడేళ్ళయింది. వాడికి అన్ని రకాల దుడుకుతనమూ ఉంది. మాట తొందర, అభిప్రాయాలు తొందర. అనుకున్నది సాధించేంతవరకూ నిద్రపోడు. ఉచ్చువేసినట్లు వల పన్నినట్లు మనిషిని తన గుప్పిట్లోకి తెచ్చుకుంటాడు. తల్లిగా నేను చెప్పలేకపోయినా భార్యగా నువ్వు తెల్సుకోవలసిన విషయాలు ఎన్నో ఉన్నయ్యి. క్రమేపీ నువ్వు తెల్సుకోవాలి. ఎన్నో సంబంధాలు అయిదారు వేలకు పైగా కట్నం ఇస్తామంటూ వచ్చాయి. ఆ పిల్లల్ని చూశాడు. సుతిమెత్తని మనస్తత్వం కలవాళ్ళూ, చదువుకున్నా ఉద్యోగం చెయ్యటానికి ఇష్టపడని ఆడపిల్లలూ వాడి దృష్టికి ఆనలేదు. ఒకవేళ అట్లాంటి వాళ్ళు తటస్థపడి పెళ్ళయినా వాడి చేతులో వాళ్ళు నెగ్గుకురాగలరనే నమ్మకం నాకూ లేదు. డబ్బు సంపాదించటంలో, జల్సాగా ఖర్చుపెట్టడంలో వాడికి వాడే సాటి. నిన్నూ, నీ మనస్తత్వాన్నీ ఎన్నో రకాలుగా తరచి చూసే వాడి గీటురాయికి తట్టుకుని మేలిమి వన్నె బంగారంలా నిలబడ్డావు కనుకనే కట్నం లేకపోయినా నిన్ను పెళ్ళిచేసుకున్నాడు. ఆడది కదా అణిగిమణిగి ఉన్నా వాడికి గిట్టదు. ప్రతి విషయంలోనూ ఆధిక్యత చూపిస్తూ రెట్టిస్తాడు, కళ్ళనీళ్ళు తెప్పిస్తాడు, కౌగిలించుకుని బుజ్జగిస్తాడు, నీళ్ళుకారిపోయామో ధ్వజమెత్తి పాతాళ లోకంలోకి పంపుతాడు. కొంతమంది ఆడ వాళ్ళుంటారు. నోరు పెట్టుకుని చెలామణి అవుతారు. జుట్టు పట్టుకుంటారు. వాడికి కావలసింది అలాంటి గడుసుతనంకాదు. వాడి అభిప్రాయాలూ మాటలూ అదేనమ్మా, క్రాస్‌వర్డు పజిల్లాంటివి. ఆ అభిప్రాయానికి అనేక వ్యాఖ్యలుంటయ్యి. సరయిన మాటలుపడితే నవ్వేస్తాడు కాని వెంటనే రెండో పజిలు తయారు చేస్తాడు. తన జీవిత భాగస్వామిగా ఎన్నో రకాలుగా నిన్ను పరీక్షించిన తరువాతనే నిన్ను పెళ్ళాడాడంటే కనీ

నం ఒక తప్పుతోనయినా వాడి పజిలు పూర్తి చెయ్యగలవనే నానమ్మకం. దానికి ప్రాతిపదికగా మొన్న నీ జీతం తీసుకున్నాడు కదూ" అన్న దావిడ.

చెప్పినంతసేపూ కధగా విన్నా. విరేచనాల చాక్లెట్ చప్పరించి నంత పనయిం .

నా కెందుకనో రెండు ప్రశ్నలు వెయ్యాలనిపించింది.

"వారు పర స్త్రీవ్యామోహితులా" రెండో ప్రశ్న వెయ్యలేక పోయాను.

"నేనెట్లా చెప్పగలను భార్య కనిపెట్టవలసిన విషయం" ముఖావంగానే అన్న దావిడ.

"నేను వార్ని మార్చగలననే నమ్మకం మీ కున్నదా అత్తయ్యా."

కావలసింది మార్పు కాదమ్మా. సంసారంలో కలతలు రాకుండా చూచుకోటం మాటలతో వాడి మనస్సుని ఆకట్టుకోటం. ఆ నిప్పుల మీద ఎప్పటికప్పుడు నీళ్ళు చల్లుతూ ఉండాలి."

"ప్రతినెలా జీతం వారికే ఇవ్వమంటారా"–"పరిస్థితి అదుపులోకి తెచ్చుకోవలసిందానివి నువ్వు. నేను వద్దన్నా ఆగేదికాదు,"

ఆ రాత్రి నేను నిద్ర పోలేదు. మూడో రోజున వారు కాకినాడ నుంచి వచ్చేశారు. యధా ప్రకారం జరిగిపోతున్నది.

వారికి వచ్చే ఉత్తరాలు ఆఫీసు అడ్రసుకే వచ్చేవి. ఇంటి అడ్ర సుకు వచ్చేవి కావు. రోజూ ఆఫీసుకు వచ్చే టపాలో జవాను ఎవరి ఉత్తరాలు వాళ్ళకు ఇచ్చేస్తాడు. ఆ రోజున ఆఫీసరుగారు యు. డీ. సీ.ల నందర్నీ పిలిచి ఏవో ఆఫీసు కాగితాల విషయం చెప్తున్నారు. తక్కిమ్మా ఆఫీసు స్టాఫంతా వాళ్ళకు ఆయన ఏం చెప్తున్నారోనని వరండాలో పక్క పక్కల్నా నిలబడి వింటున్నారు. ఈ సమయంలో ఆఫీసు జవాను

ఉత్తరాలన్నీ తెచ్చి నా బల్లమీద పడేశాడు. అడ్రసులు చూశాను. వారికి ఒక కవరూ, ఒక శుభలేఖ వచ్చాయి. కవర్ని నా డ్రాయర్లోవేసి శుభలేఖ వారికి ఇవ్వమని జవానుకు ఇచ్చాను. ఆ పెళ్ళి శుభలేఖ వారి పెత్తల్లి గారి వద్దనుంచి వచ్చింది. వారమ్మాయి పెళ్ళి. పెత్తల్లంటే వారి కన్నతల్లి అక్కగారు. కాకినాడలో పెత్తల్లి భర్త ప్లీడరు. వారి పేర వచ్చిన కవరు నెమ్మదిగా చించి చదివాను. నా కళ్ళు బైర్లు కమ్మాయి. మతిపోయినంత పనైంది. అది వారి స్నేహితురాలు రాసిన ఉత్తరం. అమ్మాయి పేరు శోభ. ఉత్తరంలో ఏ విశేషాలూ లేవు. వెల్లుండి ఆది వారం. కొవ్వూరునుంచి వస్తున్నాననీ రాజమండ్రి స్టేషనులో సాయంత్రం అయిదు గంటలకు కలవమనీ.

ఉత్తరం వారికి పంపటమా మానటమా అని ఎంతో ఆలోచించాను. పంపకూడదనే నిశ్చయించుకున్నాను. ఆ ఉత్తరాన్ని భద్రంగా దాచాను.

పావుగంట గడిచాక స్టాఫ్అంతా ఎపరిసీట్లోకి వాళ్ళు వచ్చేశారు. అప్పటికే ఆ శుభలేఖ వారి బల్లమీద పడేశాడు జవాను. నేను ఏమీ ఎరగ నట్లే నా కాగితాలు టైప్ చేసుకుంటున్నాను.

యధాప్రకారం కాఫీ, టిఫిన్ పంపారు. ఈ పద్ధతి నాకు నచ్చక పోయినా వార్ని పూర్తిగా అర్థం చేసుకోవటానికి వారు చెప్పినట్లే నడుచు కోవాలికదా ?

సాయంత్రం ఇంటికివెళ్ళాం. రాత్రి భోజనాలు కూడా అయ్యాయి. ఆ శుభలేఖ సంగతి తల్లితోగాని నాతోగాని చెప్పలేదు. కారణం నాకూ అర్థంకాలేదు. నేనూ వారి ఉత్తరాలు చూడనట్లే ఉండాలిగాని చూసినట్లు తెలీకూడదు. ఈ ఉత్తరాల దాపరికం వారి మనస్తత్వానికి మచ్చో గీటు కాయి.

మామూలుగానే నన్ను పలకరించారు. ఒక పక్క వారి స్నేహితు రాలి కవరు, మరోపక్క దాచిపెట్టిన శుభలేఖ. నా మనస్సులో అవిర్లు తేలుతున్నది. కాని నేను బయటపడకూడదు కదా ?

అత్తయ్య చెప్పిన సంగతులు నాలో రొద చెయ్యసాగాయి. వారికి ఎదురు తిరక్కూడదు. మంచితనంతోనే మన తత్వం తెల్పుకోవాలి.

"అట్లా ఉన్నావేం సుభా, ఏమిటా ఆలోచన" అన్నారు.

"నా మనస్సు మీకు కానుకగా ఇచ్చి చాలా రోజులైంది. ఇంక నేనెట్లా ఆలోచిస్తాను."

"నా మాట నాకే ఒప్పగించావు. మనస్సు ఆలోచనా లేకపోతే ఉద్యోగం ఎట్లా చేస్తున్నావ్."

"నాది ఉద్యోగపు మనస్సు. టైపిస్టు హృదయం మీరన్నట్లు ఆఫ్టాల్ టైపిస్టుని పెళ్ళయింది కనుక అఫ్టరాల్ భార్యని అంతేనా "

నవ్వుతూ దగ్గరకు తీసుకోబోయారు. మా ఇద్దరిమధ్యా శోభ నిల్చున్నట్టే ఉన్నది.

"నా మనస్సు మీకిచ్చాక బొత్తిగా మీ అభిప్రాయాలు తెలియటం లేదు. కాస్త విశదీకరించాలి" లేచి కూర్చున్నాను.

"ఏమిటో"

"నాలో ఏం చూసి నన్ను పెళ్ళాడారు. నా సౌందర్య శోభను చూసి అనుకుందామంటే అంత శోభాయమానమైన సౌందర్యం నాలో లేదుకదా."

"సౌందర్య శోభ కొందరిలోనే ఉంటుంది. అలాంటివారు నాకు తెలుసు. నీ తెలివితేటల్ని, ఉద్యోగం చెయ్యాలనే నీలో ఉన్న కాంక్షని చూసి పెళ్ళాడాను. కాని నీ తెలివితేటలు రాణింపుకు రావాలంటే నాలాంటి భర్తే నీకు కావాలి" అన్నారు.

"నా తెలివితేటలతో, నా ఉద్యోగ కాంక్షతో మీరు కాపురం చేస్తున్నారు కాని, నాలోని స్త్రీ సహజమైన మానవత్వంతో, కోరికలతో, అభిరుచులతో, ప్రేమానురాగాలతో, మనస్సుతో, హృదయంతో కాదన్న మాట."

వారు ఎగతాళిగా చూస్తూ నవ్వారు. "తన కాపురాన్ని నిలబెట్టుకోవాలని, భర్తపొందు కావాలనీ కోరుకునే ప్రతి వివాహిత స్త్రీలోనూ నువ్వు చెప్పిన లక్షణాలన్నీ ఉంటాయి. అవన్ని నీ ఒక్కదాని సొత్తే కాదు. వ్యభిచారి విషయంలో ఒక్క స్త్రీత్వమూ, డబ్బు మినహా మరేమీ ఉండవు."

"వ్యభిచారి అంటే"

డబ్బుకు శరీరాన్ని అమ్ముకునేది"

"స్నేహంలో శీలాన్ని అర్పిస్తే అది వ్యభిచారంకాదు"

కాస్త గతుక్కుమన్నారు. పైపళ్ళతో క్రింది పెదవిని కొరుక్కున్నారు. గోళ్ళు కొరుక్కుని కిటికీనుంచీ అవతల పారేశారు. మెటికలు విరుచుకున్నారు. ఎడంచేత్తో గడ్డాన్ని నిమురుకున్నారు.

"హోటల్లో డబ్బిచ్చి భోజనం చేస్తే, అది అన్నాన్ని కొనుక్కు తిన్నట్టే అవుతుంది. అదే ఊరికే మనస్ఫూర్తిగా ఆకలిగొన్న వారికి పెడితే అతిథి సత్కారం అవుతుంది. అంతే తేడా."

నా మనస్సు భగ భగ లాడుతున్నది. ఈ మనిషిలో మంచీ మానవత్వం పూర్తిగా లేకపోలేదు కాని అవి వక్రమార్గంలో పరిభ్రమిస్తున్నాయి. వాటిని అదుపులో పెట్టాలి. కాని కొంత వ్యవధి కావాలి.

"అతిథికి నాలుగు రూపాయలు తాంబూలంలో పెట్టిస్తే ఇంకా మంచిదికదూ" అన్నాను.

"నిజం, ఇంతకీ నువ్వు శీలం అర్పించిన ఆ స్నేహితుడెవడు సుభా"

నా పళ్ళు మండిపోయింది. అభిమానం పొంగి పొర్లుకొచ్చినా కన్నీరు రాలేదు.

"ఆ సమయం వచ్చినపుడు ఆ స్నేహితుడెవరో, స్నేహితురాలెవరో మీరే చూస్తారు" అన్నాను.

# 5

నేను కాపురానికి వెళ్ళిన రెండు మాసాల్లో అమ్మా, నాన్నా రెండు మూడుసార్లు వచ్చి చూసివెళ్ళారు కాని నేను అక్కడికి వెళ్ళలేదు.

ఆ రోజు ఆదివారం. సోమవారం ఉదయం వస్తానని చెప్పి ఆదివారం ఉదయమే నాన్నగారింటికి వెళ్ళాను. అమ్మా నాన్నా ఎంతో సంతోషంగా నా సంసార పరిస్థితులు అడిగారు. ఆడపిల్లగా అక్కయ్యకు ఉండవలసిన అదృష్టం కూడా నాకే కలిగిందన్నాను, తృప్తిగా చూశాడు నాన్న.

"పోనీలే దానిరాత అట్లా ఉన్నా నీ అదృష్టమన్నా ఇటా ఉన్నది చాలా సంతోషం తల్లీ" అని అన్నది అమ్మ. అక్కయ్య నన్ను ఎగాదిగా చూసి "కొంచెం చిక్కినట్లున్నావేమే సుభా. మీ ఆయన మంచివాడేనా" అని తన సహజ ధోరణిలో నవ్వింది.

"ఎంతో మంచివారు. అసలు మంచి చెడ్డలకు కొలత, తూకమూ లేవుకదా,మన మనస్సనే త్రాసులో తృప్తి అనే రాయి వేసి తూచుకోవలసిందే" అన్నాను.

"అయితే ఇంక ఇక్కడే వుండిపోతావుగా" నెత్తి గోక్కుంటూ అన్నది,

"ఛీ శకునపక్షి" అన్నది అమ్మ.

సాయంత్రం అయిదు గంటలైంది, నా గుండెల్లో రైళ్ళు పరుగెత్తాయి. గృహకృత్యపు విషయంలో సంసారంగుట్టు రచ్చకెక్కించి నందువల్ల ప్రయోజనం శూన్యం, మనస్సులో మెతగా ఉన్నా వివరాలు తెల్సుకోటంతో మెతకదనం పనికిరాదు. గుడ్డుగా ఉన్నప్పుడే గూడు తప్పించాలి గాని పిల్లయింతర్వాత గూడు వెతుక్కుంటూ అదేవస్తుంది.

స్నేహితురాలింటికి వెళ్ళొస్తానని చెప్పి పావు తక్కువ ఆరు గంటలకల్లా రాజమండ్రి స్టేషన్‌కు చేరాను. సరిగ్గా ఆరుగంటలకు రైలొచ్చింది. ఆ శోభ ఎవరో తెలీదు. కాని తెల్సుకోవాలి.

## నీళ్ళురాని కళ్ళు

ప్రయాణీకులంతా జట్కాల్లో, రిక్షాల్లో, కార్లల్లో వెళ్ళారు. కొందరు నడిచివెళ్ళారు. ఒకమ్మాయి స్టేషనులోనే ఒకబల్లమీద కూర్చుంది. చేతులో ఒక చిన్న లెదర్ సూట్కేస్ ఉన్నది.

అంత అందమైందీకాదు. అనాకారీ కాదు. ఆ కళ్ళల్లో ఆకర్షణ ఉన్నది. చుట్టూ ఒకసారిచూసి నిట్టూర్చింది. నేనూ పక్కనే కూర్చున్నాను.

"ఈ రైల్లో దిగారా" అన్నాను.

"అవునండీ. మా వాళ్ళింటికి వెళ్ళాలి. స్టేషన్‌కు రమ్మని ఉత్తరం రాశాను, వాళ్ళు రాలేదు, వాళ్ళ ఇల్లు తెలీదు."

"మీ పేరు."

"శోభ, మీరెక్కడికి వెళ్ళాలి."

"ఎక్కడికీ వెళ్ళక్కరలేదు. స్నేహితురాలు అనకాపల్లి వెళుతుంటే రైలెక్కించుదామని వచ్చాను. ఈ జనాన్నిచూస్తుంటే కొత్త కాలక్షేపం. మీరు చదువుతున్నారా. మీవారేం చేస్తున్నారు."

విరోధినయినా స్నేహంతోనే ఆదరణగా మాట్లాడి పడగొట్టాలి.

"బి. ఎ, చదువుతూ మానేశాను. ఆర్థిక ఇబ్బంది, తండ్రిలేరు. అమ్మ ముగ్గురు పిల్లలూ నా కన్న చిన్నవాళ్ళు. ఆస్తిలేదు. చదువెట్లా సాగుతుంది. ఒక జీవితం బలి అయితేనేగాని కొన్ని సంసారాలు గడవవు. నాకు మా వారంటూ ఎవ్వరూలేరు" పేలవంగా నవ్వింది. బాధపడుతూనే జాలిపడ్డాను. అమ్మాయిమీద సానుభూతి కలిగినా ఆ ప్రలోభాన్ని తల్చుకుంటే అసహ్యం కలిగింది. కనువిప్పనేది అందరికీ కలగదు. అందుకు కారణం సంస్కారం లేకపోవడమేకాదు. ఆర్థిక పరిస్థితులే ప్రధాన కారణం,

"బి, ఏ. వరకూ చదివానన్నారు, ఉద్యోగ ప్రయత్నం చెయ్యలేదా,"

"హూఁ. ఉద్యోగం, అది చేశాను. అన్నీ అయినయ్యి."

మళ్ళీ ఒకసారి ఎవరికోసమో చూసింది. హతాసురాలయినట్లుగా కూర్చుంది.

"మళ్ళీ మీకు తిరుగు రైలు ఇప్పుడు లేదేమో మా ఇంటికి వెళదాం రండి. మా వారు ఏదయినా ఉద్యోగం ఇప్పించగలరేమో అడుగుతాను. ఆయన చాలా ఉదారస్వభావులు. చేతనైనంతవరకూ తప్పక సాయం చేస్తారు "

"మీ వారేం చేస్తున్నారు. మీ ఇల్లెక్కడ. మీరు."

"మేజిస్ట్రేట్ ఆఫీసులో ఉద్యోగం. రండి వెళదాం."

సందేహించింది. రానన్నది, బలవంతం చేశాను. ఉద్యోగం ఇప్పిస్తానని ఆశ కలిగించాను. రాత్రికి ఉండి ఉదయమే వెళ్ళిపోతానన్నది. ఇంటిదగ్గర బయల్దేరేటప్పుడే అమ్మకు చెప్పాను. స్నేహితురాలింటి దగ్గర్నుంచీ మా ఇంటికి వెళ్ళిపోతానని, అమ్మ నవ్వి సరేనన్నది. కొత్త కాపురమని అమ్మ ఊహ.

శోభా, నేనూ ఇద్దరం రిక్షా ఎక్కి మా ఇంటికి వెళ్ళాం. తల్లీ కొడుకూ ఇంట్లోనే ఉన్నారు.

ఒకరినొకరు చూసుకుని నిర్ఘాంత పోయారు. నేను ఏమీ తెలీనట్లే అన్నాను

"మా స్నేహితురాలు రాణి అనకాపల్లి వెళుతుంటే రైలెక్కించటానికి రాజమండ్రి స్టేషన్‌కు వెళ్ళాను. ఈ అమ్మాయి కనిపించింది. స్టేషన్‌కు రమ్మని ఉత్తరంరాస్తే చుటాలు రాలేదట."

"మనింటికెందుకు తీసుకొచ్చావ్" విసుగ్గా అన్నారు.

"నాటి ఆడపిల్ల. పరిస్థితులు చెప్పింది. మీరేదయినా ఉద్యోగం ఇప్పిస్తారేమోనని నేనే రమ్మన్నాను. ఆడపిల్ల రాత్రిపూట ఎక్కడుంటుందని మనింటికి రమ్మన్నాను. ఏదయినా ఉద్యోగం ఇప్పించండి పాపం, మీకు ఎంతయినా పుణ్యముంటుంది."

కోపం, దుఃఖం, ఆవేశం పొంగి పొర్లుకొస్తున్నా వాటన్నిటికీ ధైర్యం మనో నిబ్బరం అనే అడ్డుకట్ట వేశాను. ఆ కట్టకు గండి ఎప్పుడు పడుతుందోనని నాకే అనుమానంగా ఉన్నది.

"మీది ఏ వూరండీ" ఆ అమ్మాయిని అడిగారు.

"కొవ్వూరు"

"మీ పేరు"

"ఏం చదివారు"

"బి. ఏ. చదువుతూ మానేశాను. ఉద్యోగం ఇప్పిస్తారనే ఆశను కలిగించారు. మీ భార్య"

"అనిత మీకు తెలుసా"

"లేదు."

"అవకాశం దొరుకుతే ఉద్యోగం ఇప్పిస్తాను. ఈ రాత్రికి ఉండి రేపు ఉదయమే వెళ్ళిపోండి. మీ చుట్టాలకు మీరు రాసిన ఉత్తరం చేరలేదేమో"

"కావచ్చు."

ఆ తయ్యకూడా అన్నీ వింటూ నిల్చున్నారు. నిజంగా వీళ్ళిద్దరూ గుండెలు తీసిన బంట్లు. ఎంత తెలివిగా ఒకరినొకరు తెలీనట్లుగా మాటాడుతున్నారు? అని అనుకున్నాను.

పిన్నీ, "ఈ రాత్రికి ఈఅమ్మాయి ఇక్కడే భోజనంచేసి ఉంటుంది. లోపలికి తీసుకువెళ్ళు సుభా" అన్నారు.

ఆ ఇద్దరి మ్ముఖ కవళికలూ చూస్తుంటే నాకు కోపమూ, నవ్వూ వస్తున్నాయి. వారన్నట్లు శోభ వేశ్యకాదు. కాని అతిథి సత్కారాలు పొందుతున్న జాణ నా పరిస్థితిలోనే మరొక స్త్రీ ఉంటే ఈ సంఘటనే

తారసపడితే ఎంత యుద్ధమో చేసేవాళ్ళు. నా సుఖాన్ని పంచుకోటానికి వచ్చిన శోభను చూస్తుంటే నా మానసిక పరిస్థితి అట్లాగే ఉన్నా అల్లరి చేసి బజారెక్కేకన్నా ఈ విషయంలో వారి వేలుతోనే వారి కన్ను పొడిపించాలనే నిర్ణయానికి వచ్చాను. ఎంత చదువుకుని ఉద్యోగం చేసుకునే ఆడదయినా, ఉదాత్త భావాలు ఉన్నా తన భర్త పర స్త్రీ లోబడు కావటానికి ఇష్టపడదు. నుయ్యో, గొయ్యో చూసుకోవటం పాతకాలపు పద్ధతి. జుట్లు పట్టుకుని పోట్లాడుకోవటం రెండోరకం. ప్రాధేయపడి ప్రతిమాలుకోటం కొంత విజ్ఞతగల స్త్రీ లక్షణమే కాని నేను అనుసరిస్తున్న పంథాకు ఎంతో మనో నిగ్రహమూ, ఓపికా కావాలి. నా మొండి ధైర్యమే నన్నీ విధంగా చెయ్యమని పురికొల్పింది

వారు భోజనం చేశాక మేం ముగ్గురం కూర్చున్నాం. పైకి బింకంగా ఉన్నా లోపల ఎంతో భయపడుతున్నది శోభ. అన్నంకూడా సరిగ్గా తిన లేదు. "కొత్తచోటయినా సాటి ఆడవాళ్ళ దగ్గర భోజనం చెయ్యటానికి అంత ఖంగారు పడతారేం శోభా. మనవల్ల ఏ దోషం లేనప్పుడు భయపడ్డమనేది అద్దంలో మన ముఖాన్ని చూచి మనమే భయపడుతున్నట్లుగా ఉంటుంది"

శోభ మనస్సు కుత కుత లాడిపోతున్నది.

"అట్టే ఏం లేదండీ. ఆకలిగా లేదు."

"అనుకున్నదీ ఒకటీ అయింది మరొకటి అయితే ఎంత చదువుకున్న వాళ్ళమైనా ఖంగారు పడిపోతాం. తప్పులు చెయ్యటమనేది, నీతిని పాటించక పోవటమనేది స్త్రీ పురుషులిద్దరి విషయంలో ఒకటే అయినా సాంఘిక వ్యవస్థలోని ఆచారాన్నిబట్టి అనుసరించే విధానాన్నిబట్టి ఉంటుంది అవునంటారా."

"మీరన్నది నిజమే."

కూర ముద్ద తిని పచ్చడి కలుపుతున్నాం. ఆ తర్వాత మాట్లాడ వద్దని ముందే సైగ చేశాను.

"ఆకలి దప్పులు స్త్రీ పురుషులిద్దరికీ ఒకటే. శారీరకవాంఛా, కోరికా ఒకటయినా యౌవనంలో పొంగు ఒకే ప్రాతిపదికమీద ఏర్పడినా, స్త్రీకి శీలం ప్రాణంకన్నా ఎక్కువ అన్నారు. శీల సంరక్షణార్థం ప్రాణాన్నయినా త్యజించమన్నారు. కాని పురుషుడికి అంత కట్టుదిట్టమైనటువంటికఠిన మైనటువంటినిబంధనలను ఏర్పాటు చెయ్యలేదు. అందుకనేస్త్రీశీలానికి వెల కట్టారు. వెలయాలిని శరీరం అమ్ముకుని బ్రతుకుతున్న దన్నారు. పరస్పర ఉద్రేకాలకి అవినాభావ సంబంధం ఉన్నా ఆ ఉద్రేకాలు తీర్చుకోటానికి పురుషుడు స్త్రీకి డబ్బిస్తున్నాడు. అంతే కాని పురుషుడు తన శరీరాన్ని అమ్ముకుంటున్నాడని ఎవ్వరూ అనరు. నా సిద్ధాంతంమీద మీ వ్యాఖ్యానం" అన్నాను.

పచ్చడి ముద్ద ఒక్కసారికూడా నోట్లో పెట్టుకోలేదు శోభ. కన్నీటి బొట్లు కంచంలో పడ్డయి. నా మాటలు చరమ గీతాల్లా ఉన్నయ్యేమోనను కున్నాను. నా ఉద్రేకాన్ని చంపదల్చుకోలేదు.

"కన్నీరెందుకు శోభా"

"ఏం లేదండీ, మీ మాటలు వింటుంటే నా లోని మాలిన్యమంతా కరిగి కన్నీరై పోతున్నది. మనస్సుకు అఘాతం తగిలినప్పుడు కన్నీరెప్పుడు వెనక్కిపోదు" అన్నది.

"అవును, మీ పరిస్థితినిబట్టి మీ భావాలు, ప్రవర్తన మీకు పైకి వచ్చినా అంతర్యంలో మీ అంతరాత్మ మిమ్మల్ని హెచ్చరిస్తూనే ఉంటుంది. మానసిక భావదర్పణమే కన్నీరు. నాకు రావలసిన కన్నీరు మీకు వచ్చింది శోభా."

కంచంలో చెయ్యి కడిగేసుకుంది. నేనూ, అత్తయ్య మజ్జిగ పోసుకున్నాం.

"నేను తినమన్నా నువ్వు తినే పరిస్థితిలో లేవని నాకు తెలుసు. కొందరి కోరికలు చిరుతిండి లాంటివి. వాళ్ళకి భోజనం అక్కరలేదు. నువ్వు ఆ చిరుతిండి కోసమే ఇక్కడికి వచ్చావుకదూ" అన్నాను.

శోభ మాట్లాడలేదు, ఇంతలోకి వారొచ్చారు.

"ఏమిటి సుభా లెక్చరిస్తున్నావ్, చిరపరిచితురాలిలా మాట్లాడేస్తున్నావేం" అన్నారాయన.

"నాకు చిరపరిచితురాలు కాకపోయినా ఎవరికి చిరపరిచితురాలో నాకు బాగా తెల్సు. ప్రతివారూ పిల్లి పాలూ అనుకుంటే నరిపోదు."

వారివైపు ఒక్కసారి చూసింది శోభ. ఆ చూపులో అనేక రహస్యాలూ, సంకేతాలూ, గూఢార్థాలు నేను చూడగలిగాను.

" ఇంతకీ నువ్వు చెప్పేదేమిటో" మాటలో కటుత్వం, అంతర్యంలో రహస్యం రచ్చలోకి వచ్చిందే అనే దిగులు.

"శోభ మీకు తెలీదా" సూటిగా చూస్తూ ప్రశ్నించాను.

"నాకా, నాకేం తెలుసు. వార్ని నువ్వు పరిచయం చేసేవరకూ వారెవరో నాకు తెలీదు. నీ స్నేహితురాలేమో అనుకున్నాను" బుకాయించారు.

"పాపం తెలీదేం, ఏదో ఉద్యోగమైనా చూసి పెట్టండి"

అక్కణ్ణుంచి లేచి తన గదిలోకి వెళ్ళిపోయారు నేనూ రెట్టించదల్చుకోలేదు.

భోజనాలు అయాయి. ఆ తర్వాత పక్క వంటింట్లో వేశాను. వారు గదిలో పడుకున్నారు. నేనూ, శోభ ముందు గదిలో పడుకున్నాం.

నేను ఆదమరచి నిద్రపోతున్నట్లే పడుకున్నాను. కాని నిద్రపోవటంలేదు. శోభకు నిద్ర రావటమే లేదల్లే ఉంది.

ఒక రాత్రి వేళ వారు మెల్లిగా మా గదిలోకివచ్చి శోభ భుజం తట్టారు కళ్ళు తెర్చింది శోభ. ఇద్దరూ కాస్త అవతలకి వెళ్ళారు. నేను కళ్ళు మూసుకుని నిద్రపోతున్నట్లు శ్వాస విడుస్తూ చెవులు దోరపెట్టుకుని వినసాగాను సగం కళ్ళు తెర్చి చూస్తున్నాను.

"నా ఉత్తరం చేరలేదా" అన్నది శోభ.

"లేదు కొంపముంచావ్, మన వేగులు లెక్కపెట్టింది మా ఆవిడ."

"అదే నేనూ గమనించాను. ఉదయమే వెళ్ళిపోతాను. వచ్చే ఆది వారం మీరే కొవ్వూరు రండి."

"అట్లాగే" వారు మెల్లిగా గదిలోకి వెళ్ళబోతూ శోభ చేతికి ఎంతో కొంత డబ్బిచ్చారు.

చివాల్న లేచి నిల్చున్నాను. శోభ వణికిపోయింది. వారు అంగారు పడ్డారు.

"ఎందుకండీ అంత అంగారు. పాత స్నేహమేగా. కాకపోతే రహస్యం నాకు తెల్సిపోయింది శోభా. అనుభవానికి నేను అడ్డుగా నిల్చినా, నీకు కావాల్సిన డబ్బు వారిచ్చారు మా వారి పాత ప్రియురాల్ని కళ్ళారాచూసి మనసారా మాట్లాడాను. నా జన్మ తరించింది నా కొక సహాయం చేస్తావా శోభా.

బావురుమని ఏడుస్తూ నా కాళ్ళు చుట్టేసింది శోభ. వారు మెల్లిగా గదిలోకి నిష్క్రమించారు.

"నన్ను క్షమించండి. క్షమించానంటేగాని మీ పాదాలు వదలను" ఏడుస్తూ అన్నది శోభ.

"నాకు క్షమించరాని ద్రోహమే చేశావు శోభా. జరిగిందేదో జరిగి పోయింది. ఇక ఎప్పుడూ మావారి జీవితంలో మళ్ళీ ప్రవేశించకు. మళ్ళీ పాత పాటే పాడావో ఇద్దరం ఆలోకంలోనే కలుసుకోవటం. ఎందుకంటే ఈ లోకంలో ఇక నీతో మాట్లాడదల్చుకోలేదు. తెల్లవారగానే మర్యాదగా వెళ్ళిపో. ఇక వారికి కనపడనని ప్రమాణం చెయ్యి."

కోపంతో, క్రోధంతో అన్నాను నా హృదయం ఆక్రోశించింది రెండు కన్నీటిబొట్లు శోభనెత్తిన పడ్డయ్యి.

"వంద కొరడా దెబ్బలకన్న, పది తుపాకిగుళ్ళకన్న, ఎక్కువగానే మాటలతో శిక్షించాను. నా గుండెల్లా తూట్లుపడిపోయింది. నేనిక ఎవరి జీవితంలోనూ ప్రవేశించను, ఉదయమే వెళ్ళిపోతాను. శలవు" అన్నది శోభ.

ఉదయం అరుగంటలకల్లా శోభ వెళ్ళిపోయింది. పక్క ఎత్తుతూంటే దిండుకింద ముప్పై రూపాయలు కనిపించాయి. వారిచ్చిన మూడు పది రూపాయలనోటూ వదిలేసి వెళ్ళిపోయింది.

వారం రోజులవరకూ వారు నాతో మాట్లాడలేదు. ఆ నెల జీతం కూడా తీసుకోలేను. జీతం రాగానే వారి పెట్టెలోనే ఉంచాను. పైన నోట్లు కనపడినా వారు ముట్టుకోలేరు. ఆఫీసులోకాని, ఇంట్లోకాని ఏమ్మి పలకరించటమే లేదు. నేను అవమానపరచానని కోపం.

ఆ రోజు రాత్రి పడుకున్న వారిమీద చెయ్యివేసి పక్కమీద కూర్చున్నాను.

"ఎందుకండీ అంతకోపం, మన కాపురంలోకి ఇంకా పాకివస్తున్న చీడపురుగుని దులిపివేయటం తప్పా" అన్నాను.

కోపంతో నా చేతిని నెట్టిపారేశారు. మళ్ళీ చెయ్యివేసి ఇటుతిప్పుకోబోయాను.

"ఏమిటా మొండితనం, నువ్వు పశువువా, రాక్షసివా" చెయ్యి విదిలించేశారు.

"శోభ మనపాలిటి రాక్షసి. మీలోవున్న పశుత్వం పారిపోతూరంటే పెట్టింది. నా మొండితనమంటారా మన మధ్య చేరే చీడపురుగు పోవటానికి ఆ మాత్రం అవసరమే వనుకుంటాను."

ఇటు తిరిగారు. నా వైపు తీక్షణంగా చూసి, "నాకు వచ్చే ఉత్తరాలు నువ్వు తీసుకోవటం తప్పుకాదా. ఈ కార్యం కొత్తగా వచ్చిందా పాత అలవాటేనా." "ఉత్తరం తీసుకుని చదవటం తప్పే. వప్పుకున్నాను. నా రెండుచెంపలు గట్టిగా వాయించండి, సంతోషంతో ఆ దెబ్బలు స్వీకరిస్తాను. కాని కావలసిన ఉత్తరమే నా చేతులా పడింది. నా సంతోషం మీకు వ్యధ కలిగించింది కదూ" నవ్వు ముఖంతో అన్నాను.

వారి కోపం వారి మనస్సును రగిల్చివేస్తున్నది, నిజంగా నా చెంపలు వాయించాలనే ఉంది. కాని తన తప్పు తాను తెలుసుకున్నారు. తనంతటి

వారు నా చేతిలో ఈ రకంగా బైటపడి పోవటం వారికి బాగా చిన్నతన మనిపించింది. కాని వారు నా భర్త. నేను భార్యను. తప్పు ఒప్పుకోవటం చిన్నతనంగానే ఉంటుంది. ఈ విషయంలో నే నింక తర్కించదల్చుకోలేదు.

"ఇంకొకటి అడుగుతాను, కోపంలో కోపం కలిసిపోయేదే" అన్నాను.

"ఏమిటది."

"ఆ రోజునే మీకొక శుభలేఖ కూడా వచ్చింది. ఆ పెళ్ళికి మీరు వెళ్ళకపోవటమే గాక శుభలేఖ సంగతి మీ పిన్నిగారికిగాని, నాకు గానీ చెప్పనేలేదు ఎందుకని."

"పెళ్ళికి వెళ్ళటం ఇష్టంలేక, రైలు ఖర్చులూ చదివింపులూ ఓ యాభై వదుల్తయ్యి."

"అందుకని పెళ్ళిసంగతి చెప్పటమే మానెయ్యటం ఎందుకు అదేం ప్రేమలేఖ కాదుగా, అత్తయ్యకు చెప్పి, ఓ గ్రీటింగ్స్ టెలిగ్రాం పంపిస్తే ఎంత గౌరవంగా వుండేది."

"క్షమించు సుభా. నా మనస్సు మరీ గాయం చెయ్యకు" అన్నారు. నేనేం మాట్లాడలేదు. ఆ మాట వారి అంతర్యంలోనుంచి వచ్చింది కాదని నాకు తెలుసు.

"జీతం తీసుకోలేదేం."

"అక్కర్లేదు. ఇకనుంచీ నా జీతమే ఇస్తాను. ఇబ్బందులు నువ్వే చూడు."

"ఏ భర్తకయినా ఇద్దరి జీతాలు కలిపే వాడుకుందాం. జీతాలు విడిగా ఉంటం నాకేం నచ్చలేదు. నా మనస్సు మీకు చేరువైనకొద్దీ మీరు దూరంగా వెళ్ళిపోతున్నారు."

వారు మాట్లాడనేలేదు.

# 6

కార్తీక మాసం వచ్చింది. ఆఫీసు వాళ్ళంతా తలొక అయిదు రూపాయలూ చందాలు వేసుకుని వన భోజనాలు ఏర్పాటు చేశారు. ఈ వ్యవహారమంతా తన భుజస్కంధాలమీద వేసుకున్నారు, మా శ్రీవారు. వంటవాళ్ళను కుదుర్చుకోవటం, వంటసామాన్లు, గుండిగలూ, పాత్ర సామానూ ఒకటేమిటి సర్వం వారి పర్యవేక్షణలోనే జరిగింది.

ఈ ఏర్పాట్లన్నీ ఒక తోటలో జరిపారు. నన్నూ రమ్మన్నారు. సరే నన్నాను. అసలు మనస్సులో వెళ్ళాలని లేదు. కారణం నాకు నాలుగో మాసం. కడుపుతో ఉన్నానని సిగ్గనీ కాదు. ఆఫీసు వాళ్ళంతా ఏదో బాతాఖానీ వేస్తారు, పేకాడు కుంటారు. అడ్డమైన కబుర్లూ చెప్పుకుంటారు. వాళ్ళ మనస్తత్వాలూ నాకు తెలుసు. ఒక్కొక్కప్పుడు వాళ్ళ సంభాషణ నేను హర్షించలేను. అగ్గిపుల్ల దగ్గర్నుంచీ అణ్వస్త్రంవరకూ సర్వసల్ రిజిస్టర్ల దగ్గర్నుంచీ ఆఫీసర్ల భార్యలవరకూ, పెళ్ళి సంబంధాలనుంచీ వ్యభిచార గృహాలవరకూ అన్నీ వాళ్ళకు చర్చనీయాంశాలే. ఆ సంభాషణల్లో పాల్గొనటంగానీ, వినటంగానీ నాకు ఇష్టంలేదు. కాని వారికి కోపం తెప్పించకూడదని వెళ్ళాను.

నేను వెళ్ళేసరికి చాలామంది వచ్చారు. కాని నా ఊహకు అందనట్లుగా కొంతమంది తమ భార్యాపిల్లలతో వచ్చారు. పోనీ ఆడవాళ్ళున్నారు కదా అని కొంత సంతోషం కలిగింది.

వారూ, మరో ఇద్దరూ వంటవాళ్ళని పురమాయించి అన్నీ చేయిస్తున్నారు. వచ్చిన అయిదారుగురు ఆడవాళ్ళూ పిల్లలూ చెట్లక్రింద టార్పాలిన్ మీద కూర్చున్నారు. కొంతమంది పిల్లలు, బూరలు ఊదుకుంటూ చెట్ల క్రింద తిరుగుతున్నారు. కొంతమంది ఆఫీసువాళ్ళు పేకాడుకుంటుంటే

కొంతమంది ట్రాన్సిస్టర్లు పెట్టుకుని బాతాఖానీ కొడుతున్నారు. ఆ సమయంలో అందరూ అంతేనేమో. అదొక సరదా.

నేనూ ఆడవాళ్ళ దగ్గర కూర్చున్నాను. రామారావనే ఒక యు. డి. సి. వచ్చి, ఆ కూర్చున్న ఆడవాళ్ళలో ఆయన భార్య ఉంది కాబోలు, నన్ను వాళ్ళందరికీ పరిచయంచేశారు. ఆయన కాస్త చొరవగా ఏగతాళిగా, హాస్యంగా మాట్లాడుతారు. ఆయన తత్వం అది.

"చూడండి సుభాషిణిగారూ. ఒక్క మీ ఆయనకు తప్ప మాస్టాఫ్ మెంబర్లందరికీ మీరు ఆడబడుచు లాంటివారు. అంటే వీరంతా మీకు వదినెలు. దోసకాయముక్కలు పచ్చడి చెయ్యాలిట. మీ వదినెలచేత ఆ అర్ధ మణుగు దోసకాయలూ తరిగిద్దురూ, ప్రతికాయా మీరు చూసి చేదో, మంచో చెప్పండి" అన్నారు.

నవ్వుతూ ఒకరి ముఖాలొకరు చూసుకున్నారు. ఆయన భార్యే అన్నది.

"స్వర్గానికి వెళ్ళినా సవతిపోరు తప్పదన్నట్లుగా ఇక్కడకూడా వంటింటి వేషం వెయ్యాల్సిందే, సంవత్సరానికోసారి. ఇల్లాంటి అవకాశం వచ్చినప్పుడయినా మీ మగవాళ్ళు పాకశాస్త్ర ప్రవీణత చూపించకపోతే ఎలా, ఆ ముక్కలేవో మీరే తరగండి" అన్నదావిడ.

"రామారావుగారూ, సిగరెట్టు కాలుస్తూ వంటింట్లో కుంపటిదగ్గర కూర్చుని ఇంకా వంట కాలేదంటే అని విసుక్కోటం కాదు. ఓ మూనెడు కందిపప్పు వేయించి కందిపచ్చడి రుబ్బుతిపెండి. మీకు ఈ శుభ సమయంలో మీ శ్రీమతి చేత కందిశ్రీ బిరుదిస్తారు" అన్నాను. అందరూ పకపకా నవ్వేశారు.

ఈ మాటలు విని మరికొంత మంది నవ్వుతూ చేరారు. మా శ్రీవారు గాడిపొయ్యి దగ్గరున్నారని తెలిసింది. దగదగమండే పులిహోర కలుపుతున్నారు. ఆ వంటాయన జీతమప్పుడు [illegible]. ఆ వంటాయనతో తగాదా పడుతున్నారు.

"మీ ఆయన చూడండి. గాడిపొయ్యి ఇన్‌చార్జి డ్యూటీలో ఉన్నాడు. శ్రావణకుమార్‌కి వంట బాగా వచ్చేల్లేఉంది అతనికి పెళ్ళికి ముందే అన్నీ తెలుసు" అన్నాడొకతను.

"మీరు చాలా అదృష్టవంతులు సుభాషిణీ, మనవాడు చూస్తే బాలు అల్లుకుపోతాడు" అన్నాడు కోశాధికారి. పైకి వాళ్ళు పొగుడుతున్నట్లు కనిపించినా వాళ్ళ అంతర్యాల్లో మరో ధ్వని లేకపోలేదు.

"అసలేదయినా మన ఆడవాళ్ళల్లోనే ఉందిలేద్దురూ. మన మెతకతనం చూసే వాళ్ళు నెత్తినెక్కుతారు. నూటరెండు డిగ్రీలు జ్వరమొచ్చి మూలుగుతున్నా, వంటచేశాక మంచమెక్కి మూలగమనేవాళ్ళు ఉన్నారు. కాపీ కాపరానికొచ్చిన కొత్తలోనే వాళ్ళని వంచుకురావాలి గాని నలుగురు పిల్లలు పుట్టాక వాళ్ళు అసలే మాటవినరు. ఆ విషయం సుభాషిణిగారికి తెలుసుకాబట్టే వాళ్ళ శ్రీవారికి వంట వ్యవహారం క్షుణ్ణంగా నేర్పారు" అన్నది మా కోశాధికారి భార్య. ఆమె పేరు ఆదిలక్ష్మి, ముగ్గురు పిల్లల తల్లి.

మొత్తంమీద మావారి గాడిపొయ్యి పర్యవేక్షణ మా దాంపత్య జీవితానికొక సద్భావాన్నే తెచ్చిపెట్టింది.

వంటలయ్యాయి, సరిగ్గా పన్నెండు గంటలకు విస్తళ్ళు వేశారు. అందరూ కూర్చున్నారు, వడ్డన చేసేందుకు అయిదారుగురు స్టాఫ్‌మెంబర్లు తయారయ్యారు. వారిలో మా శ్రీవారూ ఉన్నారు.

వడ్డన జరుగుతోంది, కూరలపెట్టె తీసుకుని వారు గబగబా విస్తళ్ళల్లో కూరలు వడ్డిస్తుంటే ఈ మనిషిలో ఇన్నిరకాల అనుభవాలు ఎక్కడ దాగిఉన్నాయా అని ఆశ్చర్యపోయాను.

నా విస్తట్లో నిమ్మకాయ కారం వేస్తూ "సుభా, నీ కోసమే తయారు చేయించాను. ఈ నిమ్మకాయ కారంలో షడ్రుచులూ ఉన్నాయి, పారెయ్యక చక్కగా నంజుకో" అన్నారు.

11)

"నయమే అపేక్షనేది అట్లా ఉండాలి, భార్యకొక్క వలసిన పదార్థాలు ఇంత హడావుడి సమయంలో మీవారు తయారుచేయించారంటే మీ అనురాగం ఎట్లావుంటుందో అర్థమైంది, సుభాషిణిగారూ" అన్నది రామారావు భార్య, అందరూ నావైపు చూశారు, "మీకు తెల్సింది అంతవరకే, నా కోసం వారు చేయించింది నిమ్మకాయకారం, దీంతో మాదాంపత్యం ఎంత టిదో తేల్చి చెప్పారు మిసెస్ రామారావు, ఇందులో నిమ్మరసం ఉప్పూ నాతత్వంలాంటిది, మెత్తని జల్లెడలో జల్లించిన ఊరగాయ కారంలాంటిది మా శ్రీవారి మనస్సు" అన్నాను నేను.

భోజనాలు సగంలో ఉండగా మా అన్నయ్య వాణీనాథం వచ్చాడు, వాడి అవతారమూ వాణ్ణీ చూస్తుంటే నాకు చాలా చిన్నతనమనిపించింది. వాణ్ణి కూడా భోజనానికి కూర్చోమన్నారు మా శ్రీవారు, వాడూ నన్ను పలకరించి ఒక చివర్న పంక్తిలో కూర్చున్నాడు, అందరూ అన్నయ్యను చూశారు, మా ఆఫీసులో కొంతమందికి వాడు తెలుసు, అతనెవరండీ అని ఆడవాళ్ళు నన్నడిగారు.

"మా అన్నయ్య" తల వంచుకునే చెప్పాను, అన్నం తినాలనిపించలేదు, అన్నయ్యమీద కోపంకాదు, వాడి బుద్ధులూ, గుణాల మీద నాకు అసహ్యం,

"మీ అన్నగారేం చేస్తున్నారు" మరో ఆవిడ అడిగింది.

ఆ క్షణాన ఎంత ఇబ్బందిపడ్డానో చెప్పలేను. కడుపులో దేవినట్లనిపించింది.

"కొన్ని కుటుంబాలకు ఒక శాపం ఉంటుందండీ బిందెడు అమృతంలో ఒక్క విషపు చుక్కలాంటి వారూ ఉంటారు. అతనొక గేంబ్లర్, తిరుగుబోతుకు కావల్సిన అన్ని లక్షణాలు ఉన్నాయి." నెమ్మదిగా ఆవిడతో చెప్పాడు మా కోటైపిస్టు. ఆడవాళ్ళంతా ఒకరి ముఖాలొకరు చూచుకుని ఏవగింపుగా అన్నయ్యవైపు చూశారు, నన్నూ మా దాంపత్యాన్నీ కొని

యాడిన వారి మనస్సులో అన్నయ్యరాక శాశ్వతముద్ర వేసింది. నాకు అన్నం సయించలేదు. వెళ్ళిపోవాలనిపించింది కాని సభ్యతగా తోచలేదు.

భోజనాలయాక అన్నయ్యా, వారూ ఒక మామిడిచెట్టు క్రింద కూర్చుని అయిదు నిమిషాలు మాట్లాడారు. ఏం మాట్లాడారో ఎవరికీ తెలీదు. వెడుతూ "వస్తాను సుభా" అన్నాడు. నాగొంతుకి ఉరితాడువేసి లాగినంతగా బాధపడ్డాను. ఆ తరువాత వెళ్ళేవరకు ఆకవాళ్ళెవరూ నాతో మాట్లాడలేదు. వాళ్ళ మనస్సుల్లో నేనొక రౌడీకి, గాంబ్లర్‌కూ చెల్లెలిగా చిత్రీకరించబడ్డాను. అంతవరకూ నామీద ఉన్న గౌరవమంతా గాలికి ఎగిరిపోయిన ఫేలపిండిలా అయింది.

ఇంటికి వెళ్ళాక వార్ని అడిగాను, "అంత అర్జంటుగా అన్నయ్య ఎందుకొచ్చాడో ?" "మీ అన్నయ్యేగా, అడక్కపోయావా" వ్యంగ్యంగా అన్నారు.

"అవును మా అన్నయ్యే. బంధుత్వం నాది. ఆ బంధుత్వపుబాధ కూడా నేనే అనుభవించాను. గుసగుసలు గూడుపుఠాణీ మాత్రం మీది." ఉంక్రోషంతో అన్నాను. వారి మనస్సుకేదో మారిపోతాదని నాకు తెలుసు. కాని అదేమో తెల్సుకోవాలనే ఆశకాదు, ఆందోళన. మా జీవితాల మధ్య ఏ విషనాగునో వదిలిపెడతాడని నా భయం. "గుసగుస గూడుపుఠాణీ అని నువ్వే చెప్పావుగా. కాదని చెప్పినా నువ్వు నమ్మవు. అయినా గర్భవతివి ఇంత ఆందోళన పనికిరాదు. కావలసినంత విశ్రాంతితీసుకో సుభా" అన్నారు.

ఆ మాటల్లోని భావాలు పూర్తిగా అర్థమయాయి. యింక తర్కించ దల్చుకోలేదు.

మర్నాడు ఆఫీసుకువెళ్ళి సాయంత్రం నాన్నగారింటికి వెళ్ళొస్తానని చెప్పాను.

"మళ్ళీ రాజమండ్రి స్టేషన్‌కు వెళతావేమిటి" వెటకారంగా అన్నారు.

"లేదు, మనిషికి కావలసింది జ్ఞానం. అదే లేనప్పుడు కొబ్బరి చెట్టుకు మడిబట్ట కట్టినట్లే ఉంటుంది" అన్నాను. వారు నవ్వుకున్నారు.

ఆ సాయంత్రం ఆఫీసునుంచి నాన్నగారింటికి వెళ్ళాను. అమ్మాం నాన్నతో అన్ని విషయాలూ చెప్పాను. విశ్చేష్టులయారు.

రాత్రి పది దాటాక అన్నయ్య వచ్చాడు. భోజనం చేశాక వాణ్ణి గది లోకిపిల్చి అడిగాను అక్కయ్య నిద్రపోతున్నది.

"బావతో నువ్వు మాట్లాడిందేమిట్రా."

"లోకాభిరామాయణం, అంటే పేకాట సంగతి" నవ్వుతూఅన్నాడు,

"వాణీనాధం, నువ్వెటువంటి వాడివైనా నువ్వు నాకు అన్నయ్యవు. ఈ చెల్లెలి గౌరవ మర్యాదలు కాపాడవలసిన బాధ్యత నీకూ ఉన్నది. ఎంత దుర్మార్గుడికయినా ఒక మంచి లక్షణం ఉంటుంది. ఒక రక్తం పంచుకుని పుట్టాం, అర్థించి అడుగుతున్న అభాగ్యురాలిని. నా కాపురంలో నిప్పులపొయ్యకు. ఆ ఒక్క మంచి లక్షణాన్ని నా జీవితానికి వినియోగించు. ఈ ఒక్కటే నా కోరిక. ఈ జీవితంలో నిన్నేమీ కోరను. బావకు ఏం చెప్పావో ఒక్కసారి చెప్పమని ప్రార్థిస్తున్నాను" వాని చేతులు పట్టు కున్నాను. నా కళ్ళు చెమ్మగిల్లాయి. ఎందుకనో ధైర్యం తగ్గింది.

నా పరిస్థితి చూసి వాడు నీరైపోయాడు. నెమ్మదిగా కుర్చీలో కూర్చుని ఆ దుబ్బు జుట్టులోకి చెయ్యిపోనిచ్చి నెత్తిగోక్కున్నాడు.

"బావ సంగతి నీకింకా పూర్తిగా తెలీదా సుభా."

"తెలీదు"

"బావ బాగా సంపాదిస్తాడు, అంటే ఉద్యోగరీత్యా ఆ విషయంలో మంచి పేరుంది, సమర్థుడు, తగినట్లుగా సంపాదిస్తాడు. పెళ్ళయ్యాక ఎందు కనో పేకాట తగ్గించాడు. ఇదివరకు పెద్దచెయ్యి. ఇకపోతే ఊళ్ళోకి కొత్త పిట్ట వాలిందంటే బావకు తెలీకుండా ఉండదు. అంతటి రసికుడు. ఎప్పు డయినా బ్రాందీ, విస్కీ, బీరు...." నావైపు చూడలేక తలవంచుకుని,

"ఇవాళ కొత్తపిట్ట దగ్గరకు వెళ్ళాడేమో" అన్నాడు.

నాలో సహనం నశించిపోయింది. నా వళ్ళు నాకు తెలీలేదు. కన్నీరు రాలేదు. కాఠిన్యత్వం పూర్తిగా నా శరీరాన్ని ఆకట్టుకుంది.

నా శక్తికొద్దీ అన్నయ్య రెండుచెంపలూ ఎన్నిసార్లు వాయించానో గుర్తులేదు. పడిపోయాడు. నోటివెంట కాస్త రక్తం వచ్చింది. అంతటి ఆవేశం నాలో ఉన్నదని నాకే తెలియదు. వీధిలోకివచ్చి రిక్షాపిల్చి మా ఇంటికి వెళ్ళిపోయాను. అమ్మతోగాని, నాన్నతోగాని ఎవరితో చెప్పలేదు.

అప్పటికి రాత్రి పన్నెండయింది. వారు ఇంట్లోలేరు. అత్తయ్యను అడిగాను. భోజనం చేసి రెండో ఆట సినిమాకి వెళ్ళారన్నారు.

"సినిమాకు కాదత్తయ్యా, కొత్తపిట్ట గూటికి" అని మంచంమీద వాలిపోయాను.

రాత్రి రెండు గంటలకు వచ్చారు. నెమ్మదిగా అడిగాను.

"ఎక్కడికి వెళ్ళారు"

"సినిమాకు, నువ్వు వచ్చేలాలేం, ఈ రాత్రి మీ వాళ్ళింట్లోనే ఉంటానన్నావ్"

"లేదు. లాడ్జికి వెళ్ళొచ్చాను, తప్పా" ఈ విషయంలో ఒక రకమైన మొరటుతనం నాలో ప్రవేశించింది. జీవితంలో మరోసారి ఓడిపోయాననే కలతను కాసేపు వెనక్కినెట్టాను.

"నువ్వు లాడ్జికి వెళ్ళావా. చాలా జోక్‌గా మాట్లాడుతున్నావే సుభా" చొక్కావిప్పి హేంగర్‌కు తగిలించి మంచంమీద కూర్చున్నారు.

"అయితే మీరు సినిమాకు వెళ్ళానని చెప్పటమూ అంతేనేమో"

"పొద్దుపోయింది గాని నిద్రపో"

"అవును, కొన్నాళ్ళు నిద్రపోయాను. మధ్యలో కళ్ళు తెరిచాను. మళ్ళీ నాకు తెలీకుండానే నిద్రపోతున్నాను. ఎన్నిసార్లు కళ్ళు తెరిచినా మళ్ళీ కళ్ళు మూయించే శక్తి మీలో ఉన్నది."

"ఏమిటా వాగుడు"

"వాగుడుకాదు. మీరెక్కడికి వెళ్ళేదీ నాకు తెలుసు. ఎవరా కొత్తపిట్ట"

"సుభా నోర్ముయ్ కొట్టటానికి చెయ్యెత్తాడు. ఆ చెయ్యి గట్టిగా పట్టుకున్నాను. అంతబలం ఎట్లా వచ్చిందో నాకే తెలీదు

"హు. ఆడదాన్ని చెయ్యెత్తి కొట్టేంత అధమున్ని అనుకోలేదు. మీ కన్నా అలగా జాతివారు ఎన్నోరెట్లు నయం, ఛీ" అన్నాను.

అత్తయ్యవచ్చి నన్ను అవతల గదిలోకి తీసుకువెళ్ళారు.

ఆ మర్నాడు అన్నయ్య వచ్చాడు. వారితో అంతా చెప్పాడు. నేనూ విన్నాను. వెళ్ళబోతూ అన్నాడు.

"సుభాషిణీ, నా రక్తాన్ని నువ్వు కళ్ళజూసినా, చెల్లెలివని జాలిదల్చి ఊరుకున్నాను. ఇంక నువ్వు నా చెల్లివీకావు. నేను నీకు అన్ననూకాను. ఆ బంధుత్వం నిన్న రాత్రితోనే తెగిపోయింది."

"నిజమే. నువ్వు నాకు అన్నవుకావు. చెల్లెలి కాపురంలో నిప్పు పోసిన కిరాతకుడివి. మంచిది వెళ్ళు."

కంఠం జీరవోయింది. కన్నీరు రాలేదు. కట్టుకున్న భర్త, ఒక రక్తాన్ని పంచుకుని పుట్టిన అన్నయ్య నా జీవితంతో చెలగాటమాడి చిత్రవధ చేస్తుంటే ఇంక నాకు కన్నీరు మాత్రం ఎట్లా వస్తుంది?

అయిదోమాసం వచ్చి వతిహోమం ధోళ్ళైంది. పసుపు కుంకం చేస్తామని చెప్పటానికి అమ్మ, నాన్న వచ్చారు. ఈ వేడుకలేమీ అక్కర లేదనీ, అసలు పురిటికికూడా రానని చెప్పాను. అత్తయ్యకాదని కేకలేశారు. అమ్మ ఏడ్చింది, నాన్న చాలా బాధపడ్డారు.

చివరికి అనుకున్నాను,

"నా బాధలూ, మనోవేదనలూ నేనే పడాలి, కష్టాలు అనుభవించాలి. ఈ రీత్యా పెద్దవాళ్ళ మనస్సు కష్టపెట్టకూడదు. అమ్మాయిని

అల్లుడు నిరాదరణగా చూసినా, తిట్టినా, కొట్టినా, అమ్మాయి కడుపుతో ఉంచేచాలు. ఆ తల్లిదండ్రుల మనస్సు ఎంత పొంగిపోతుందో.

మంచిరోజు చూసి వేడుక జరిపారు. పండంటి మొగపిల్లవాణ్ణి కనమని వచ్చిన పేరంటాళ్ళంతా ఆశీర్వదించారు. మనస్సులో నవ్వు కున్నాను. ఆ పసివాడికి తండ్రిబుద్ధులే అబ్బుతాయేమో!

# 7

పండంటి పసివాణ్ణి ఎత్తుకుని మూడో నెల రాగానే తిరిగి వచ్చాను. మళ్ళీ ఉద్యోగంలో చేరాను, బారసాల, నామకరణం అన్నీ జరి పించారు, ఆ వేడుకలో ఏలోటూలేదు; కొంతమందికి మనస్సేకాని అను భవం ఉండదు, కొంతమందికి అనుభవంకావాలి గాని మనస్సక్కర్లేదు. నాలాంటివారికి మనస్సూ అనుభవమూ రెండూకావాలి, కానియోగ్యత లేదు.

బాబుపేరు సీతారామచంద్ర వరప్రసాద్ అని నామకరణం చేయిం చారు. వారికన్నతల్లి పేరు సీతమ్మ, తండ్రిగారి పేరు రామచంద్రరావు. నా కోరికమేరకు వరప్రసాద్ చేర్చారు. చివరికి వాడు వట్టి ప్రసాదయి కూర్చున్నాడు,

"బాబు బావున్నాడా ఎవరి పోలికంటారు" అన్నాను వాణ్ణి ఎత్తుకో మన్నట్లుగా చేతికిస్తూ.

"పసందయిన పడుచుభామల్ని ఎత్తి మంచంమీద పడుకోబెట్టిన ఈ చేత్తో పసివాళ్ళను ఎత్తుకోలేను సుభా. ఇంకా బాబు పోలికంటావా. నా మీద నీకు నమ్మకం లేకపోయినా, నీ మీద నాకు నమ్మకమే బాబు మన పోలిక, ఎవరి పోలికా కాదు" అన్నారు.

"నా మీద మాత్రం మీరు అంత నమ్మకంతో ఎందుకుండాలి? వా స్నేహితులూ నాకూ ఉన్నారు"

ఇంతమాట ఎందుకు అనుకోవాలసి వచ్చిందో అని మనస్సులో బాధపడ్డా కావాలనే అనేశాను.

"మీరనుకున్నంత పతివ్రతను కాను"

బాబుని ఉయ్యాల్లో పడుకోబెట్టాను. నాచెంపల్ని తాకుతూ అన్నారు.

"సుభా! అన్నపు గుండిగలో పై మెతుకులు పట్టుకుచూస్తే చాలు. ఈ జీవితంలో నీకు ఆ ధైర్యంలేదు. నీ మనస్తత్వం నాకు పూర్తిగా తెల్సు నువ్వు పౌరాణిక పతివ్రతవు కాకపోవచ్చు నీకు తెలియకుండానే అణువణువునా నీ ప్రాతివత్యం జీర్ణించిపోయింది" అన్నారు.

పసివాడికి ఏడాది వెళ్ళింది. అడుగులు వేస్తున్నాడు. అచ్చుగా వారి పోలిక. అందుకు సంతోషించినా బుద్ధులుమాత్రం వారివి రానియ్యకు భగవంతుడా అని ఆ పరాత్పరుని ప్రార్థించేదాన్ని.

వాడూ నాకన్నా వాళ్ళ బామ్మకే ఎక్కువ మాలిమి అయ్యాడు. వాడంటే ఆవిడకు పంచప్రాణాలు. వాడి చిలకపలుకులు వింటూ ఆవిడ మురిసిపోయేది. వారు మాత్రం వాడిని ఎక్కువగా దగ్గరికి పిల్చి తీసుకునే వారు కాదు, ఆ బుర్రలో పీడు దూరలేదు.

ఆరోజున ఆ సంఘటన జరిగాక అన్నయ్య ఎన్నడూ మా యింటికి రాలేదు. నేను నాన్నగారింటికి వెళ్ళినప్పుడు అన్నయ్య కనిపించినా మాటాడేవాడు కాదు నేనూ పలకరించలేదు.

ఒకరోజున అక్కయ్యను తీసుకొని అమ్మ వచ్చింది. పెళ్ళయి నేను కాపురానికి వచ్చిన యిన్నాళ్ళకుగాను అక్కయ్య మా యింటికి రావటం అదే మొదలు. ఆ రోజు ఆదివారం కావటంతో నేను ఇంట్లోనె ఉంటానుకదాని వాళ్ళు వచ్చారు.

సాయంత్రం వెళ్ళేంతవరకూ అక్కయ్య ఏమీ పిచ్చితరహాగా

రెండు రోజులే అని చెప్పటంతో అమ్మ సరేనన్నది. అక్కయ్యకూడా వుంటానన్నది. అమ్మ వెళ్ళిపోయాక అత్తయ్య అన్నది.

"మీ అక్కయ్య బంగారు బొమ్మలా ఉన్నది, ఆ వెకిలితనం ఆ భగవంతుడు ఎందుగ్గాను ప్రసాదించాడో అర్థంకాదు. పూర్వజన్మ పాపమేమో"

"పూర్వ జన్మలో ఏం చేశానంటారూ. దొంగతనమా, రంకు తనమా ఏంతనం చేశానంటారూ"

"ఎవరినో వెక్కిరించి ఉంటావు. అమాయకుల్ని బాధపెట్టి ఉంటావ్. ఏమైనా నువ్విట్లా వెకిలిగా చూడ్డం నవ్వటం మానుకోవాలి మీ మరిది అసలే కోపిష్టి అతనితో జాగ్రత్తగా మాట్లాడాలి. తెలిసిందా" అన్నారు అత్తయ్య. మాటలతో కాస్త భయపెడితే కాస కొత్తచోటు కదా అక్కయ్య మన స్తత్వంలో ఏదయినా మార్పు వస్తుందేమోనని ఆవిడ ఆశ.

"నిజం, నిజం జాగ్రత్తగానే ఉంటాను," బుంగమూతిపెట్టి అన్నది అక్కయ్య.

సాయంత్రం వారు రాగానే అక్కయ్య లేచి నిల్చుని వారికి నమస్కరించి గోడపక్కగా నిల్చుంది.

"ఓ. వదినెగారా నమస్కారం కులాసా"

"ఊ."

"అన్నగారు రావటమే లేదల్లే ఉంది. మా పెళ్ళికూడా వారు రాలేదనుకుంటాను"

"అన్నగారా, నాకు అన్నగారుశేఖరండీ, వాణీనాధం నాకు తమ్ముడు వాడు ఈ ఊళ్ళోనే ఉంటాడుగా"

వారు నవ్వుకున్నారు. నేను విచారపడ్డాను. మా అమ్మ కన్న నలుగురు సంతానంలో పిచ్చివాళ్ళు రౌడీలూ, మంచివాళ్ళు, తప్పిపోయిన

వాళ్ళూ ఉన్నారు. తల్చుకుంటే ఇది వాళ్ళ వాళ్ళ కర్మకాదు అమ్మా, నాన్నల దురదృష్టం అనిపిస్తుంది.

"అన్నగారంటే మీ భర్తగారు, నాకు వరసకి అన్నగారేకదా"

"ఓహో మా వారా. అవును మా వారు. మీకు కనిపించారా" కళ్ళింతవి చేసుకుని అడిగింది.

"లేదండి. ఊరికే పరిస్థితిఏటట్టి అడిగాను. సుభాషిణికన్న మీరే ఎంతో బావున్నారు కనిపించే అందంకన్న కనపడని దురదృష్టమే మీ జీవితాన్ని తలక్రిందులు చేసింది."

"అందరూ అదే మాట. మరి ఆయనగారికి నే నెందుకు నచ్చలేదో మీ బాబు చాలా బావున్నాడండీ. అక్కయ్యకు లేని పిల్లల్ని చెల్లెలికిస్తాడండీ ఆ భగవంతుడు, నాకూ ఒక్క పసివాడుంటే అబ్బ ఎంత బావుంటుంది" నెత్తి గోక్కుని వెకిలిగా నవ్వుతూ బాబుని ఎత్తుకుంది.

ఆ రాత్రి వారు నాతో అన్నారు. "మీ అక్కయ్య మరీ అమాయకురాలు కాదు తెలిసీ తెలియని భావాలు. నేర్పితే నేర్చుకుంటుంది కాని ఆ ఓర్పు నాలా మీ బావకి లేదు"

"ఉహూ. నేను అక్కయ్యలాంటి అమాయకురాల్ని కాదు, పిచ్చిదాన్ని చేసుకునేందుకు మీ రంత విశాల హృదయులుకారు. అక్కయ్యను ఎందుకు వెనకేసుకొస్తున్నారో నాకు తెలుసు. మీకు గాలి దొర్లింది."

వారి భావాలు నాకు తెలియకపోలేదు. వారికి జాలీ, కనికరమూ ఏ మాత్రం ఎవరిమీదా లేదు. స్వార్థమూకాదు. విలాసమయ జీవితానికి అలవాటు పడ్డారు, పూర్వకాలపు ఏ వెంకాయమ్మో అయితే దాన్ని మూడు చెరువుల నీళ్ళు తాగించి అరుపార్లు ఎండేసేవారు. నేను వారికి కొదుకుడు పడ్డంలేదు.

"మీ అక్కయ్యకు మతి లేకపోయినా అనుభవయోగ్యమైన అందం ఉన్నది. ఆ అందం ఎవరికీ కాకుండా పోతున్నది" తన భావాన్ని వెళ్ళ

గక్కేడు, వారి ప్రవర్తన. నా జీవితం తల్చుకుంటుంటే ఆశలేని నవ్వు వస్తుంది. ఒక్కొక్క ఆటంకాన్ని తొలగించుకుంటూ వస్తుంటే ఆ మరు క్షణాన్నే మరొకటి ఎదురౌతుంది. అది నా కర్మా వారి మన స్తత్వమా? నన్ను చూడగానే వారికట్లా అనిపిస్తుందా. ఏమిటో ఏ రోజూ ఏదో ఒక కొత్త ఉపద్రవం ఎదురౌతూనే ఉంది.

మర్నాడు ఉదయమే కాఫీలు కాగానే అక్కయ్యను పంపించేద్దామా అనిపించేది. నా అనుమానానికి ఆధారం లేకపోయినా వారి ప్రవర్తన అటువంటిది, కాని చూద్దామనుకున్నాను.

అక్కయ్య వచ్చేటప్పుడు తన చీరెలు. జాకెట్లూ తెచ్చుకోలేదు. అసలు ఉందామనే ఉద్దేశంతో అది రాలేదుకదా. మళ్ళీ అక్కడికి వెళ్ళి తెచ్చే వ్యవధిలేక నా చీరె, జాకెట్టూ ఇచ్చాను, కాస్త అటూ ఇటుగా వా అంత లావే ఉంటంతో నా జాకెట్టు అక్కయ్యకు సరిపోయింది,

అక్కయ్యవచ్చిన మర్నాడు సాయంత్రం నేను ఆఫీసునుంచీ మామూలుగా వచ్చేశాను. ఏవో మంత్లీ రిటరన్సు వెయ్యాలనీ, పర్సనల్ రిజష్టరులో కాగితాలు పెండెన్సీ తగ్గించాలనీ వారు ఆఫీసులోనే ఉన్నారు

రాత్రి పదిన్నరకు ఆఫీసునుంచి వచ్చారు. బాబు వంటింట్లో వాళ్ళ బామ్మదగ్గర ఉన్నాడు. నేను దొడ్లోకి వెళ్ళాను అక్కయ్య నా చీరె, జాకెట్టూ వేసుకుని గదిలో కూర్చుని వారపత్రికలో బొమ్మలు చూస్తున్నది, దానికి తెలుగుకూడా బాగా చదవటంరాదు. మూడో క్లాసుతోనే దాని చదువు గుంటపెట్టి గంట వాయించింది. వారు గదిలోకి వెళ్ళిన సంగతి అత్తయ్యకూడా చూడలేదు, వెనకవాటుగా అక్కయ్యను కౌగలించుకుని దాని రెండు బుగ్గలూ ముద్దుపెట్టుకన్నారు బలవంతాన పట్టు వదిలించుకుని రెండు చెంపలూ వాయించి ఏడుస్తూ అత్తయ్య దగ్గిరకొచ్చింది. ఇంతలో నేను దొడ్లోనుంచి వచ్చాను జరిగింది చెప్పింది. గదిలోకి వెళ్ళాను. తిన్నగా పేంటూ, చొక్కాకూడా విప్పకుండా మంచంమీద పడుకున్నారు. నాలో సహనం చాలా వరకూ నశించింది. "అంతా విన్నాను. చెంపల

మీద ఐదువేళ్ళూ తేలాయే. అవును నేను చెయ్యలేని పని అక్కయ్య చేసింది. ఇక లేవండి."

"సుభా, నీ చీరె జాకెట్టు వేసుకుంటే నువ్వే అనుకున్నాను. తప్పయింది. పొరపాటుపడ్డాను" అని లేచి కూర్చున్నారు, బాగా రెండు దవడల మీదా కొట్టిందేమో రెండు చెంపలూ ఎఱ్ఱగా కందిపోయాయి.

"అవునవును వెనకటికి ఎవరో ఎఱ్ఱచీరె కట్టుకుంటే నా పెళ్ళామే అనుకున్నానని అన్నాడట. అట్లా ఉంది. మా అక్కయ్యను అనుభవించాలనే కోరిక తీరింది. అది పూర్తిగా అమాయకురాలు కాదని మీరేగా అన్నారు, ఇప్పుడు అనుభవపూర్వకంగా చూశారు. ఇక లేవండి భోజనం చేద్దురుగాని, పళ్ళు కదల్లేదనుకుంటాను."

తల వంచుకుని మంచంమీదనుంచీ లేచారు నేను ఇవతలికి వచ్చాను.

"ఆయన నా మొగుట్టే నన్ను ముద్దుపెట్టుకోటానికి, లేకపోతే నేను పిచ్చిదాన్ననుకున్నాడేమో. చెంపలు వాయగొట్టాను, తిక్క వదిలిపోయింది. మంచంమీదికి లాక్కుంటాడేమోనని హడలిపోయాను. మా ఆయనకూ ఇట్లాంటి బుద్ధులు లేవేమో?"

దానికి కోపమేకాని అభిమానంతో కూడిన ఏడుపు రాలేదు.

అత్తయ్యకూడా ఎన్నో చివాట్లు వేశారు ఆయన నోరెత్తలేదు.

ఆ మర్నాడే అక్కయ్యను ఇంటికి తీసుకువెళ్ళి దాని బాధ్యత వహించుకున్నాను. ఈ సంఘటనతో అక్కయ్య నీతి నియమాలను పాటించడంలో వెకిలిది కాదని తేలింది.

కాలగర్భంలో మరో రెండేళ్ళు దొర్లిపోయాయి. మరో బాబు పుట్టాడు. యధాప్రకారం ఇదరం ఉద్యోగం చేసుకుంటున్నాం. ఆయన ప్రతి చర్యనూ ఇదివరకుమాదిరి నేనూ విమర్శించటం లేను. వక్రబుద్ధి కుక్కతోక లాంటిది. ఎలకతోలు తెచ్చి ఏడాది ఉతికినా నలుపు నలుపేగాని తెలుపురాదు కదా!

బావ అక్కయ్యను వదిలేసి నాలుగేళ్ళు దాటింది. కోర్టులో విడాకులు కోరుతూ పిటిషన్ దాఖలు చేశాడు నాన్న. అక్కయ్యచేత మనోవర్తికి దావా వేయించాడు. కోర్టులో ఈ దావాలు జరుగుతున్నాయి.

ఒక రోజున కేసు విచారణకు వచ్చింది. ఆ రోజున అక్కయ్యను తీసుకుని నాన్న కోర్టుకు వెళ్ళాడు. ప్లీడరుముందే అక్కయ్యకు సమాధానాలు ఎట్లా చెప్పవలసిందీ నూరిపోశాడు. ఆ ప్లీడరు కూడా మాకు కాస్త బంధువే కావటంతో ఆయన జాగ్రత్తగానే ఈ కేసు చూస్తాడు. ఆ రోజున సెలవుపెట్టి మేమిద్దరమూ వెళ్ళాం.

అక్కయ్య బోనులో నిల్చుంది. బావ తరపు ప్లీడరు అక్కయ్యను ప్రశ్నలడిగాడు.

"ఆనందరావుగారితో మీ పెళ్ళయి ఎన్నేళ్ళయింది"

"ఆయిదారేళ్ళయిందేమో. ఇదిగో పెళ్ళి శుభలేఖ" రొంటిన మడతపెట్టి దాచిన శుభలేఖ చూపించింది.

"మీ భర్తతో మీరెన్నాళ్ళు కాపురం చేశారు.

"నాలుగయిదు నెల్లు కాపురం చేశాను. నేను కాపురం చెయ్యలేదన్నారా"

"అట్లా అనలేదు. మిమ్మల్ని పుట్టింట్లో మీ భర్తగారు వదిలిపెట్టి ఎన్నాళ్ళయింది"

"అదుగదుగో ఆ మాటే వస్తున్నాను" పుట్టింట్లో వదిలిపెట్టలేదే, ఆడవాళ్ళు పుట్టింటికి వెళ్ళరటండీ. అట్లాగే నన్ను పుట్టింటికి పంపేరు. పుట్టింట్లో ఉన్నాను"

"వారు పంపితేమటుకు నాలుగేళ్ళు ఉండాలా మీ రెందుకు వెళ్ళలేదు."

"వారు రమ్మని ఉత్తరం రాయందే."

"పోనీ మీరు మిమ్మల్ని తీసుకువెళ్ళమని మీ వారికి ఉత్తరం రాశారా."

"రాయలేదు"

"ఎందుకని."

"నాకు చదువు ఎక్కువరాదు, అందుచేత రాయలేదు. అదీ తప్పే.

"మీరెంతవరకూ చదువుకున్నారు."

"మూడోక్లాసు."

"యువరానర్. ఈ రోజుల్లో ఎందరో ఆడవాళ్ళు ఎంతో పెద్ద చదువులు చదివి ఎన్నో ఉద్యోగాలు చేస్తున్నారు. మిసెస్ సునంద పూర్వ కాలపు స్త్రీ కాదు. పాతిక సంవత్సరాలు దాటని ఈమె ఈ కాలంలో మూడోక్లాసుతోనే చదువు ఆపేసిందంటే ఏదో బలవత్తరమైన కారణమే ఉండాలి. వాది నిర్ణయించినట్లుగా శ్రీమతి సునంద తెలివితక్కువది, వెకిలిది, అమాయకురాలు, ఈమెతో అయిదారు మాసాలు కాపురం చేశాకనే డాక్టరు పరీక్షలు కూడా చేయించి పుటకతో వచ్చిన ఈ తెలివితక్కువ తనానికీ, వెకిలితనానికీ వైద్యరీత్యా కూడా మానసికంగా బాగుపడే అవకాశం లేదని నిర్ధారణకు వచ్చిన తరువాతనే. ఈమె భర్తగారయిన శ్రీ ఆనంద రావుగారు ఈమెతో కాపురం చేయటం తగదనీ, మానసికంగా ఆమె అందుకు అర్హురాలు కాదనీ వైద్య శాస్త్రరీత్యా కూడా ఆ నిర్ధారణకు వచ్చాకనే ఈ విడాకుల పిటీషన్ పెట్టుకున్నారు. కోర్టువారు విచారించి ఈ దంపతులకు చట్టరీత్యా విడాకులు ఇప్పించమని కోరుతున్నాను" అన్నాడు ప్లీడరు.

జడ్జిగారు అక్కయ్యను ప్రశ్నించారు "ఏవమ్మా సునందా, నువ్వు తెలివితక్కువదానివనీ, అమాయకురాలివనీ, వెకిలిదానివని నీ భర్త అంటున్నారు. ఇందుకు నీ సమాధానం."

"ఆడది అణకువగా ఉంటేనేమో అమాయకురాలంటారు. చేసుకున్న మొగుడుకదాని ఓరగాచూస్తూ ప్రేమగా, ఎగతాళిగా మాట్లాడితేనేమో వెకిలిదంటారు, చదువు తక్కువైతేనేమో తెలివితక్కువదంటారు.

ఎట్లాగండీ ఈ మగవాళ్ళతో, మూడో క్లాసుకూడా చదువుకోని ఆడవాళ్ళు కాపరాలు చెయ్యటంలేదు" అన్నది అక్కయ్య.

జడ్జీగారితోసహా అందరూ నవ్వుకున్నారు.

"నీకు మీ భర్తంటే ఇష్టమేనా ?" జడ్జీగారి ప్రశ్న.

"పతియే ప్రత్యక్షదైవం అన్నారు పెద్దలు. రోజూ వారి పాదాలకు దణ్ణం పెట్టేదాన్ని అగగండీ"

"మీ భర్తతో కాపురం చెయ్యటం నీ కిష్టమేనా"

"ఆహా నేనూ ఆడదాన్నే. నాకూ కోరికలుంటయ్యి, కాపురమనేది భర్తతోగాక మరెవరితో చేస్తారు"

జడ్జీగారు నవ్వుకున్నారు,

"మరి మనోవర్తికి దావా వేశావేం"

"మీరు నా భర్త చెప్పింది నమ్మి విడాకులిప్పిస్తారేమోననే బెంగతో భయంతో మనోవర్తికి దావావేశాను భర్తాలేక మనోవర్తిలేక ఎట్లా బ్రతికేది ?"

"సరే"

అక్కయ్య బోను దిగింది. బావచేత బోనెక్కించి ప్రమాణం చేయించారు. అక్కయ్య ఇవతల నిల్చుంది.

అక్కయ్య వకీలు బావని ప్రశ్నించారు,

"మీ భార్య శ్రీమతి సునంద అమాయకురాలనీ, తెలివితక్కువదనీ మొకిడదనీ సంసారయోగ్యురాలు కాదని మీ వాదన అంతేనా"

"అవునండీ"

"పెళ్ళికిముందు మీరు పెళ్ళి చూపులుగా అమ్మాయిని చూశారా"

"చూశాను"

"పెళ్ళిచూపులప్పుడు అమ్మాయిని ఏమైనా ప్రశ్నలు వేశారా"

"ఆ"

"ఏం ప్రశ్నలు వేశారో చెప్పగలరా."

"ఎంతవరకూ చదువుకున్నారనీ, మీ పేరేమిటనీ అడిగినట్లు గుర్తు."

"ఆ ప్రశ్నలకు సమాధానాలు చేసినప్పుడు మీరు ఆరోపించిన అమాయకత్వమూ, వెకిలితనమూ, తెలివితక్కువతనమూ అమ్మాయి మాటల్లో మీకు కనిపించిందా"

"ఆ పరిస్థితిలో, ఆ సమయంలో నేను గమనించలేదు. అంత తక్కువ వ్యవధిలో ఆ లోపాలు తెలీలేదు"

"మీరు ఆరోపించిన లోపాలు తరువాత ఎప్పుడు తెల్సుకున్నారు?"

"కాపురానికి వచ్చాక ఆమె మాటలధోరణీ, ప్రవర్తనబట్టి తెల్సుకున్నాను."

"మీరు ఆరోపించిన లోపాలేకాక మీ భార్యలో శారీరకంగాగాని మరే లోపాలయినా కనుక్కున్నారా, మీ ఉద్దేశ్యంలో ప్రవర్తనంటే:"

"శారీరకంగా ఏ లోపమూ లేదు, మానసికమైన రుగ్మత ఏమీ లేదు. ఆమెకు వయస్సుకు తగినతెలివితేటలూ, గ్రహింపూలే . అంటే వయస్సుతోపాటు మనస్సు ఎదగలేదు. ఆ మాటలతీరూ, వ్యక్తపరిచే భావాలూ, సిగ్గూ బిడియమూ తెలీదు. ప్రవర్తనంటే భావం అదే."

"వయస్సుకు తగినట్లుగా మనస్సు. భావాలూ ఎదగలేదన్నారు, ఆ విషయంలో మీ భార్యను దిద్దుకునే ప్రయత్నం మీరేమి చేయలేదా?

"ఎన్నో విధాల చెప్పిచూశాను. లాభంలేక పోయింది. ఆమెతో కాపురం చెయ్యాలనే ఇచ్ఛా కోరికా నశించింది. మానసికంగా ఎదగని ఆమెతో పశువులా కాపురం చెయ్యలేను."

"మీ మీద ఆమెకు మనస్సులేదా. అనురాగమూ, కాపురం చెయ్యాలనే కోరికా లేదా."

"లేదని చెప్పలేను. భార్యాభర్తలకు కావలసింది స్త్రీ పురుష లైంగిక సంబంధమేకాదు మానసిక సంఘర్షణ. సంపర్కమూ, ఉన్నతమైన భావాలూ, సంసారం సుఖమయం చేసుకునే తెలివితేటలూ కావాలి.

అవేవీ లేవు. చెప్పినా గ్రహించగల శక్తిలేదు. అందుచేతనే నేను మీతో కాపురం చెయ్యలేను. అందుకనే విడాకులు ప్రసాదించమని కోర్టువారిని ప్రార్థిస్తున్నాను."

"మీ భార్యకు మీమీద కోరికా, ఇచ్ఛా ఉన్నయ్యా లేక అయిష్టతా, కోపమూ ఉన్నయ్యంటారా."

"కోపంలేదు, ఇష్టంలేదని నేను చెప్పలేను"

"సరే"

నాన బోను దిగారు. మరో మూడుమాసాల తరువాత ఏటకూ కేసు వాయిదా వేశారు. అందరం వెళ్ళిపోయాం.

అక్కయ్య కోర్టులో ఏ వెకిలితనమూ కనబడకుండా అంత నిక్కగా సమాధానం చెప్తుందని మేం అనుకోలేదు.

ఈ కేసు తొందరగా తేలేట్లు కనబడలేదు. ఎన్నో వాయిదాలు పడ్డయ్యి. నాన్న మానసికంగా కృంగిపోయారు. ఒక వైపున అక్కయ్య వ్యవహారం ఇట్లా ఉంటూ ఉండగానే ఏదో దొంగనోట్ల వ్యవహారంలో అన్నయ్యను అరెస్టుచేశారు. జైల్లో ఉన్నాడు. కొడుకు ప్రవర్తన ఈ రకంగా ఉన్నా కన్నకడుపు తీపిచేత ఎటాగయినా వాణ్ణి విడుదల చేయించమని అమ్మ నాన్నను బతిమాలింది ఏడ్చింది, అన్నం మానేసింది. చివరికి గోదావరిలో దూకబోయింది. నాన్న ఆ పరిస్థితిలో ఏం చెయ్యాలి? అప్పో సప్పో చేసి వెయ్యిరూపాయల సెక్యూరిటీమీద, తన హామీ మీదా బెయిల్ తెచ్చి అన్నయ్యను విడుదల చేయించారు నాన్న.

ఒకవైపున ఈ కేసు విచారణ జరుగుతున్నది. విడుదలవుతాడో శిక్షపడుతుందో తెలీదు. నా పరువు ప్రతిష్ఠలు గంగలో కలిశాయని నాన్న వాపోయారు.

అన్నయ్య కేసు అర్నెల్లు వాయిదా పడి విచారణ జరిగాక కేసు రుజువయింది. అన్నయ్యకు సంవత్సరం శిక్షపడింది. అమ్మ కంటికీమంటికీ

ఏకధారగా ఏడువసాగింది. నాన్న పిచ్చివాడిలా అయ్యాడు. స్కూలుకు వెళ్ళలేక సెలవుపెట్టారు. అక్కయ్య కేసు వాయిదాలు పడుతూనే ఉన్నది.

పదిరోజులు గడిచాయి. నాన్న మానసికంగా కోలుకోలేదు. ఆ మర్నాడు ఉదయంచూస్తే నాన్న పక్కమీదనే చచ్చిపడి ఉన్నారు. నిద్ర మాత్రలు ఎక్కువగా మింగినట్లు తేలింది. దిండుకింద రెండుమాత్రలు కనిపించాయి.

నాన్న జీవితం ఆ తీరుగా అంతమైంది అన్నయ్య జైలో ఉన్నాడు.

# 8

నాన్న కర్మకాండలకు కూడా ఇంట్లో డబ్బులేదు. ఉన్న ఒక్క కొడుకూ జెయిల్లో ఉన్నాడు. ఎంతో గౌరవప్రదంగా జీవించిన నాన్న బ్రతుకు ఇలా తెల్లవారింది.

అయిదువందల రూపాయల ఖర్చుతో నాన్న కర్మకాండలు పూర్తి చేయించాము. ఈ ఖర్చు మేము భరించాము. ఇందుకు వారికి కొంత కష్టంగా వున్నా ఈ కష్టదశలో బయటపడలేదు.

నాన్న చావు. అన్నయ్య జెయిలుకు వెళ్ళంటంతో అమ్మకూడా మానసికంగా కాస్త దెబ్బతిన్నది. ఉన్న ఆ కాస్త యిల్లు అక్కయ్య పెళ్ళికి అమ్మేశాక అద్దెకుంటున్న ఈ పూరిలుకూడా ఖాళీ చెయ్యవలసి వచ్చింది. ఈ పరిస్థితిలో అక్కయ్యతో వేరే ఎవరూ తోడులేకుండా మరెక్కడా ఉండలేనని ఏడుస్తూ నా చేతులు పట్టుకుని అమ్మ వాపో

యింది. నాదగరే మా యింట్లోనే వుంటానని పట్టుబట్టింది. అక్కయ్య కాళ్ళను చుట్టేసి ఏడవసాగింది. జరిగిన ఈ అఘాతానికి అమ్మ తట్టుకో లేకపోయింది.

చివరికి మా అక్కయ్య ప్రోత్సాహంతోనే అమ్మ, అక్కయ్యా మా యింటికి చేరారు. తన బంధాలను తెంచుకుని ముముక్షువులా జీవించా లనే సంకల్పం మనస్సులో ఉన్నా అక్కయ్య సమస్య అమ్మ కొరక గుది బండలా తయారయింది. "నీనుంచి నా జీవితం తెల్లవార్చుకుందామను కున్నా వీలుగాకుండా ఉందే సునందా" అని అక్కయ్యమీద విసుక్కు న్నది అమ్మ.

వీళ్ళిద్దరూ ఇక్కడికి రావటం వారికి మనస్సులో ఏమాత్రం ఇష్టం లేకపోయినా పరిస్థితిని అర్థంచేసుకుని మౌనంగా ఊరుకున్నారు.

మా పెద్దవాడికి నాలుగో ఏడు వచ్చింది, రెండోవాడికి ఏడాది వెళ్ళింది. వాళ్ళిద్దర్నీ దగ్గరకు పిల్చి వాళ్ళకు బొమ్మలువేసి పెడుతూ, నీళ్ళపోసి బట్టలువేసి, పౌడరురాసి బొట్టుపెట్టి ఏవో పిచ్చికబుర్లు చెపుతూ గోరుముద్దలుచేసి అన్నం పెడుతూ వాళ్ళను ఆడిస్తూ కాలం గడిపేది అక్కయ్య. తమ్ముడు చిన్నప్పుడే మారుపడిపోవటంతో అక్కయ్యకు పసిపిల్లలన్నా, చిన్నపిల్లలన్నా ఎంతో అపేక్ష. ఎదిగీ ఎదగని దాని మనస్సూ, భావాలూ కూడా ఆ చిన్నపిల్లలకు తగినట్లే వుండేవి.

ఒక రోజున పిల్లలందరికీ నీళ్ళుపోస్తూ "సుధా అంటే తప్పేమో కాని నాన్న పోవటం కూడా ఒకందుకు మంచిదేనే. లేకపోతే నీ పిల్ల లిద్దరూ నాకు అలవాటు ఎందుకవుతారు చెప్పు" అన్నది.

నాకూ కళ్ళనీళ్ళ పర్యంతమైంది.

"నోరుముయ్యి. అమ్మ వింటే ఎంత బాధపడుతుందో తెలుసా. ఆ మాత్రం గ్రహించివుంటే నీ కాపురమే బాగుపడేది" అన్నాను.

అమ్మమాత్రం తనకు చేతనయిన పనిచేస్తూ వంట పనిలో అత్త య్యకు సాయంగా ఉండేది, వీళ్ళిద్దరి రాకతో మా యింటి వాతావరణం

కూడా మారిపోయింది. ఇంట్లో ఉన్నప్పుడు కూడా నా కేమీ పని కనిపించేది కాదు.

పిల్లలిద్దరి సంరక్షణా అక్కయ్యే చెయ్యటంతో ఇంటి దగ్గర వున్న ఆ కాసేపూ కూడా ఏం తోచక వారుకూడా ఇంట్లో వుంటే గదిలో కూర్చుని కబుర్లు చెప్పేదాన్ని.

"మీ అమ్మ, అక్కయ్యా వచ్చాక నువ్వు కొత్త పెళ్లికూతుర్లా, పూచిన తంగేడులా వుంటున్నావేగాని ఇద్దరు పిల్లల తల్లిలా లేవు. ఎటొచ్చీ నా పని తగకపోయినా పెరిగింది" అన్నారు.

"కొత్త పెండ్లికూతురయినా, పూచిన తంగేడయినా మీరు సంతోషంగా ఉంటే నే నా పెళ్ళికూతురుతనం రాణించేది. కస్సు బుస్సుమంటూంటే నా ముఖమూ తుమ్మల్లో పొద్దూకి వస్తే వుంటుంది" అన్నాను.

"సంసార సాగరాన్ని ఈదటంలో ఆడది చుక్కాని అయితే కావచ్చుకాని మగవాడు సరుకులతో నిండిన పడవ లాంటివాడు. బరువంతా పడవదేకాని చుక్కానిది ఎంతమాత్రం కాదు" అన్నారు.

నెమ్మదిగా నాతో తర్కించటానికే పూనుకున్నట్లు తోచింది.

"ఈ రోజుల్లో భర్త తెచ్చిన చింతపండుతో చెంబులు తోముతూ కూర్చొనే ఆడదెవరూ లేరు. ఆ రోజుల్లో ఉద్యోగం పురుష లక్షణమైతే కావచ్చు. కాని ఈ రోజుల్లో అది మానవ లక్షణం".

"ఎటూగయితేనేం నువ్వూ ఉద్యోగం వెలగబెడుతున్నావులే. అదీ ఘనకార్యమే. చెట్టులేని ఊళ్లో ఆముదపు మొక్క మహావృక్షంగా మీ కుటుంబంలో నువ్వొక్క ఉద్యోగస్తురాలివి. (హయ్యర్ గ్రేడ్ టైపిస్టుకూడా పెద్ద ఉద్యోగస్తురాలె పోయింది."

ఈసడింపుగా అన్నారు, ఈ మాటలు వారెందుకంటున్నారో నాకు తెలుసు. నేను ఉద్యోగం చెయ్యకుండా వారి సంపాదనమీదనే ఆధారపడి వుండే ఆడదాన్నయితే రోజుకు వంద గుంజీలు తీయించి రోజూ బూట్లు తుడిచి పాలిష్ కొట్టమనేవారు.

"అన్నీ తెలిసి ఈ ఆముదపు చెట్టు నెందుకు పెళ్ళాడారు మహాశయా! నేను అదే అనుకుంటున్నాను. నన్ను మీరు పెళ్ళాడకుండా వుంటే ఏ. ఐ. ఎ. యస్ ఆఫీసరో వచ్చేవాడేమో, ఎవరికి తెలుసు. నన్ను పెళ్ళిచేసుకొని మీ నిజస్వరూపాన్ని దశావతారాలుగా బయట పెడుతూ నా గొంతు కోశారని నేనూ చెప్పుకొని ఏడవొచ్చుగా, బాబుగారూ! మన దెబ్బలాట కాస్త ఆపండి. ఇద్దరు పిల్లలు పుట్టాకకూడా మీ మనస్తత్వం నాకు తెలీదా" అన్నాను. నవ్వి ఊరుకున్నారు. ఆ నవ్వు వెనక ఎంత కార్పణ్యం ఉందో నాకు తెలుసు.

ఒక రోజున నేను ఆఫీసునుంచి వచ్చి స్నానం చేస్తున్నాను. జమాబంది కావటంతో వారికి కాస్త ఆఫీసు పని జాస్తి అయింది. ఆ రోజు ఆదివారమయినా ఆఫీసుకు వెళ్ళి సాయంత్రం నాలుగ్గంటలకు వచ్చాను, ఆదివారం కావటంతో ఆఫీసు క్యాంటీను లేదు, కాఫీకి వెళ్ళాలంటే కాస్త దూరం వెళ్ళాలి ఏమనుకున్నారో ఏమో అర్జంటుగా చూడవలసిన కాగితాలన్నీ ఒక పేడ్ లో కట్టుకుని ఇంటిదగ్గర పని చూసుకుందామని వచ్చారు, ఆ సమయంలో మా పెద్దవాడు నడిరోడ్డుమీద కూర్చుని నెత్తినిండా మట్టి పోసుకుంటున్నాడు. వాడు వీధిలోకి వెళ్ళిన సంగతి ఎవ్వరూ చూడలేదు. వళ్ళంతా మట్టిచేసుకున్న వాడు ఇంటికి వస్తున్న వార్ని చూడంగానే, "నాన్నా ఏంతెచ్చా తింటానికి" అంటూ ఆ మట్టి చేతులతో వారి తెల్లపాంటూ, చొక్కానిండా మట్టిపులిమి పాడుచేశాడు, ఆ స్థితిలో వారి కోపం తారస్థాయికివెళ్ళి ఒకచేత్తో ఫైలుపుచ్చుకుని మరో చేత్తో వాడి రెక్క పుచ్చుకుని ఈడ్చుకుంటూ ఇంట్లోకి వచ్చారు. నేను జడల్లుకుంటున్నాను. ఆ స్థితిలో వార్ని చూసేసరికి నేనూ నిర్విణ్ణురాలనైనాను.

"ఈ కొంప సత్రమైపోయింది. పొట్టలు పగిలేట్లు తిని దొర్లే వాళ్ళే తప్ప కుర్రవెధవ ఎక్కడికి వెళ్ళాడో చూసే దిక్కయినాలేదు. ఈ కొంప మొగుడు చచ్చినవాళ్ళకీ, మొగుడు వదిలిపెట్టిన వాళ్ళకీ స్మారక

నిలయంగా తయారయిందిగాని వసివాళ్ళుండే ఇల్లులాలేదు" అంటూ దండకం మొదలుపెట్టారు. అక్కయ్య గజగజ లాడిపోయింది. పెద్ద వాడికి నీళ్ళు పోసి బట్టలు వేసింది. రెండోవాడికి నీళ్ళు పోద్దామని పెరట్లోకి వచ్చింది అక్కయ్య. ఇంతలోనే అందరికీ కళ్ళుకప్పి వీధిలోకి వెళ్ళాడు వాడు.

"ఇకపోనీండి వాడెప్పుడు వీధిలోకి వెళ్ళాడో ఎవరం చూళ్ళేదు' ఇంత రాద్ధాంతం ఎందుకూ వాడికి ఇప్పుడే తలంటిపోస్తాను. మీరూ ఆ బట్టలు విప్పేసెయ్యండి" అన్నాను శాంతింపచేద్దామనే ఉద్దేశ్యంతో.

"ఏదా వెకిలిముండ ఎక్కడ వచ్చింది. పిల్లల్ని మాలిమి చేసుకున్నదని మురిసిపోయావే, వాళ్ళు కొవ్వెక్కి బలిసిపోయింది. లేకపోతే వాడు వీధిలోకి వెళుతుంటే ఎందుకు చూళ్ళేదూ" విసురుగా అని అక్కయ్య వైపు చూస్తూవెళ్ళారు, నాలో సహనం పూర్తిగా నశించింది. అంతంత మాటలు అక్కయ్యను అంటే చూస్తూ ఊరుకోలేకపోయాను.

"ఎందుకట్లా ఆవేశపడి మాటలు మిగులుతారు. మీ ఇంటికొచ్చిందని, మీరు పెట్టే తిండి తింటున్నదనీ ముండారండా అంటే పడేవాళ్ళు లేరు, బాగుండదు" గదిలోకివెళ్ళి అన్నాను. అక్కయ్య ఏడుస్తూ కూర్చుంది, అమ్మకు నోటమాట రాలేదు.

"నోర్ముయ్ నీ పెంకి సమాధానాలు నా దగ్గర సాగవ్ తప్పు ముందరుంచుకుని సిగ్గులేకుండా సమర్థిస్తావేం" నా వీపు మీద రెండు దెబ్బలు పడ్డయ్యి. అత్తయ్యవచ్చి నన్ను ఇవతలకి లాగారు. వారి కళ్ళు ఎర్రగా చింతనిప్పుల్లా ఉన్నయ్యి.

"పశువా ఆడదానిమీద చెయ్యి చేసుకుంటావా, ఇంక నీ బోకరింపు చాలించు నే బ్రతికుండగా ఇక దానిమీదచెయ్యి చేసుకున్నావో మర్యాదగా వుండదు'' అన్నారు అత్తయ్య.

వెంటనే మళ్ళీ బట్టలు వేసుకుని ఆఫీసు కాగితాలు తీసుకుని అప్పట కప్పుడే వెళ్ళిపోయారు. ఆ రాత్రి ఎవరం భోజనం చెయ్యలేదు. విచారమే మాతో తన ఆకలి తీర్చుకున్నది.

రెండోవాడు నా డొక్కలోదూరి పడుకున్నాడు. పెద్దవాడు నా పక్కలో చేరి,

"అమ్మా, నాన్న కొత్తాడా, ఏలవ్వాకు, నాన్న ఇంటికిరానీ తందాం" అన్నాడు. కళ్ళు తుడ్చుకుని లేనినవ్వు తెచ్చుకుని, "లేదు బాబూ నాన్న కొట్టలేదు. ఊరికే ఎగతాళికి వీపుమీద అట్లా అన్నారు అంతే. అది కొట్టడంకాదు, నాన్నని తందాం అనకూడదమ్మా తప్పు. నాన్న పెద్ద వారు కదూ" బుజ్జగిస్తూ అన్నాను. అంతా చూసిన వాడి బుర్రలోకి నేను చెప్పిన మాటలు ఎక్కలేదు.

"కాదూ నాన్న పిచ్చి, అమ్మ మంచి, నాన్నకి జిల్లాయిలు" అన్నాడు.

వాడిని సముదాయించి నిద్రపుచ్చాను. రాత్రి తెల్లవార్లూ మేలుకునే ఉన్నాను, వారు రాలేదు. ఉదయం ఆరు గంటలకు వచ్చారు. ముఖం పీక్కుపోయింది. కళ్ళు ఎర్రబడి లోతుకుపోయినయ్యి. అంతా గ్రహిం చాను. వారు తాగారు. ఏ లాడ్జిలోనో మకాం వేశారు. ఇంక ఆ మనిషిని ఏం అడిగినా ప్రయోజనం లేదని ఏమీ అడగలేదు.

జీవిత సోపానంలో పైకి వెళ్ళవలసిన వారి జీవిత గమనం ఆరోజు కారోజుకూ కిందికి జారుతున్నది.

వారం రోజులు వారు నాతో ముక్తసరిగానే మాట్లాడారు. ఒక రోజున అడిగాను.

"ఆరోజు రాత్రి ఇంటికిరాలేదు ఆఫీసులోనే ఉన్నారా"

"లేదు హోటల్లో భోజనం చేసి లాడ్జిలో పడుకున్నాను."

"ఎందుకని"

"నా మనస్సుకు అట్లా చేస్తేనే బాగుందని పించింది. తప్పా"

"మీరు తాగి లాడ్జిలో పడుకున్నారు. మీ మనస్సుకు నచ్చింది దన్నారు. తప్పో ఒప్పో మీకూ తెల్సు. మంచిచెడ్డలు ఆత్మాభిమానమూ ఆడదానికే కాదు మగవారికీ అవసరమే. నామీద కోపంవచ్చి నన్నుకొట్టి సర్వపాపాలకు నిలయమైన ఆ లాడ్జిలో ఒక రాత్రి గడిపారు. ఉదయమే ఏమీ ఎరగనట్లు తిరిగొచ్చారు. ఆ పనే నేనూ చేస్తే? మీరు నన్ను ఇంటికి రానిచ్చేవారేనా? చెప్పండి."

సిగరెట్ వెలిగించారు మరో సిగరెట్ తీసి నా పెదవుల మధ్య వుంచారు. వెలిగించబోయారు' నేనూ కంగారుపడి ఆ సిగరెట్‌ని తుంచి అవతల పారేసి ఆ వాసనకు వాంతి వచ్చినంతపనై నోరంతా మంచి నీళ్ళతో కడుక్కుని వచ్చాను. కళ్ళు చెమ్మగిల్లాయి. ఈ వింత సంఘటన నుంచీ వెంటనే తేరుకోలేకపోయాను.

"నేను బ్రతకాలని లేదా మీకు" మళ్ళీ మంచంమీద కూర్చుని అడిగాను. రాత్రి పది దాటింది. అంతా నిద్రపోతున్నారు.

"పెదవుల మధ్య సిగరెట్ ఉంచినందుకే ఇంత కంగారుపడి కళ్ళనీళ్ళు పెట్టుకున్నావే. నువ్వు లాడ్జికి వెళతావా సుభా. ఈ జన్మలో నువ్వా పని చెయ్యలేవు. లాడ్జిలోవుండే ఆ స్త్రీలు వేరు. వాళ్ళ ప్రవర్తన వేరు. నువ్వంత విశాల హృదయురాలివి కాదు సుభా. కాలేవు కూడా"

వారి చేతిలో సిగరెట్ పూర్తికావచ్చింది. కిటికీలోనుంచి పారేశారు. పక్కన మంచంమీద పడుకున్న రెండోవాడు కదలాడు. చిచ్చికొడితే వాడూ మసులుతూ పడుకున్నాడు.

"నా పవిత్రతయందు మీకు సంపూర్ణమైన విశ్వాసం ఉన్నది కృతజ్ఞురాలివి. కాని కారణాంతరాలవల్ల నేను అపవిత్రురాల్ని అవుతాను. హృదయంతో మీరు నన్ను స్వీకరిస్తారా?"

"తప్పకుండా స్వీకరిస్తాను."

విరు త్తరురాలినయాను. వాదనకు పూనుకున్నారని తెలుసు.

"అటువంటప్పుడు ఏ పతితనో పెళ్ళాడితే పోయేదిగా మీకు పేరూ వచ్చేది. మీ ఆదర్శాలూ నిలబెట్టుకునేవారు. ఎందుకూ సాహసించని నన్నెం దుకు పెళ్లాడారు."

మాట్లాడలేదు. సమాధానం చెప్పగల సమర్థులైనా చెప్పదల్చుకోలే దేమో : గోళ్ల కొరుక్కుంటూ కూర్చున్నారు.

"మీ భార్య పవిత్రురాలిగా ఉండాలని మీరు కోరుకున్నప్పుడు నా భర్త పవిత్రుడుగా ఉండాలని నేను కోరుకోటంలో తప్పుగాని, అత్యాశ గాని లేదేమో. ఇన్ని ఉదాహరణలు చెప్తున్నానంటే ఇవన్నీ మీకు తెలియ వనీ, మీకు పాఠాలుగా బోధిద్దామనీ కాదు నా మనోవేదన మీకు అర్ధ మయ్యేలా మీ మనస్సుకూ హృదయానికీ తాకేలా విన్నవించుకుంటు న్నాను. మీ భార్య త్రాగుబోతు, వ్యభిచారి అని ఒక్కసారి ఊహా మాత్రంగానైనా మీరు రెండు నిమిషాలపాటు ఊహించుకు చూడండి మీ మనస్సు ఎంత కలవరపడుతుందో. కాని. నా భర్త త్రాగుబోతు, జూదరి వ్యభిచారి అని తెల్సి కూడా నేను మనస్సులో బాధపడుతున్నానే గాని మిమ్మల్ని ద్వేషించడంలేదు. సన్మార్గంలోకి తిప్పాలనేదే నా ఆకాంక్ష. కోరిక, ఆవేదన, అది నా మనోదౌర్బల్య మనండి. ఆడది కనుక ఏమీ చెయ్యలేక ఇటా వాపోతున్నదనండి. ఎట్లా అనుకున్నా మీరు గౌరవంగా జీవించటమే నాకు కావలసింది" అన్నాను.

ఏం సమాధానం చెప్పలేక నా గుండెల్లో ముఖాన్ని దాచుకుని కన్నీరు పెట్టుకున్నారు.

మరొక మాసం గడిచింది. వారి ప్రవర్తనలో మార్పు కలిగిందని ఆశించాను. కృతకృత్యురాల్నయాననే భావించాను. మనస్సు సంతోషంతో పిల్లి మొగ్గలు వేసింది. లాటరీలో లక్ష రూపాయలు బహుమతి వచ్చినా అంత ఆనందం కలుగదేమో:

అమ్మకూ. మనందకూ చీరెలు పూర్తిగా చిరిగిపోయాయి కట్టు కునేదికాక మరొక చీరె మాత్రమే ఉండేది. అవ్వీ జీర్ణావస్థలోనేఉన్నయ్యి.

కోరు వ్యవహారాలు కూడ పరిష్కారం కాలేదు, ఈ స్థితిలో నా జీతం రాగానే ఇద్దరికి చెరి రెండు చీరెలూ. జాకెట్ గుడ్డలూ పిల్లలిద్దరికి చొక్కాలు. లాగూలు కొన్నాను, అంతా నూటపాతిక రూపాయలుపైగా అయింది. ఆ క్రితం నెల్లోనే అత్తయ్యకూ రెండు చీరెలు కొనటంతో ఈనెల్లో ఆవిడకు తీసుకోలేదు. రెండు మాసాలనుంచి అంటే అమ్మా, అక్కయ్య వచ్చినప్పట్నించీ నా జీతం నన్నే తీసుకోమంటున్నారు. ఎవరి జీతమైనా ఇద్దరం కలిపే వాడుతున్నాం.

ఇంటికి రాగానే ఈ బట్టలన్నీ వారికి చూపించాను.

"నేను రెండు టెరిలిన్ పాంట్లూ, రెండు టెరిలిన్ చొక్కాలు కుట్టించుకోవాలనుకున్నాను సుభా, నీ జీతం సగంపైగా అయిపోయింది, ఇంటి ఖర్చులక్కూడా మిగతా జీతం ఇద్దరిదీ కలిపినా చాలదు. ఇక నా కోరిక వాయిదా వేసుకోవలసిందే'' అన్నారు, ముఖంలో అయిష్టత వ్య కమయింది,

దణ్ణెంమీద అమ్మకున్న ఒక్క చీరె, అక్కయ్యకున్న ఒక్క చీరె తీసుకొచ్చి వారికి చూపించాను.

''కటుకున్న చీరెకాక చెరొక చీరె మాత్రమే వాళ్ళకున్నది. పండక్కి కొన్నట్లుగా వాళ్ళకేం కొనలేదు, రోజువారీ కట్టుడు చీరెలే కొన్నాను. వాళ్ళను గురించి మీరు బట్టలు కుట్టించుకోటం మానెయ్యకండి. వెచ్చం కొట్టువాడికి వచ్చే నెల్లో బాకీ తీరుస్తానని నేను చెప్తాను" అని సర్దిచెప్పాను.

"బట్టల సంగతికేం గాని వీళ్ళకొక శాశ్వతమైన ఉపాధి ఏదైనా ఏర్పాటు చెయ్యాలి, ఎల్లకాలం మనం పోషించనూలేం. వాళ్ళకూ గౌరవం కాదు'' అన్నారు.

''నాన్న చేసింది ఎలిమెంటరీ స్కూల్ టీచరు ఉద్యోగం, ఏ నెల కానెల ఆయన గొర్రెతోక జీతం ఇంటి ఖర్చులకే చాలేదికాదు. అన్నయ్య

సంగతి మీకూ తెలుసుకదా : వాడుపోయి జైల్లో కూర్చున్నాడు ఈ పరిస్థితిలో వాళ్ళెక్కడికి వెడతారు చెప్పండి."

"నాకా సంగతి తెలీదు నీకు నేను కావాలో మీ అమ్మ అక్కయ్యో కావాలో తేల్చుకో. నెల రోజుల్లో ఈ వ్యవహారం తేలిపోవాలి."

నా నెత్తిన పిడుగు పడ్డట్టయింది. మా ఇద్దర్నీ కూర్చినందుకు ఆ భగవంతుణ్ణి ఏమిటో అయిష్టతగా అనుకున్నాను. తెలిసీ తెలియని రెండు మూడేళ్ళ పిల్లలు మారాం చేస్తూ ఉంటారు. బూరా కొనిఇస్తే లక్కపిడత కావాలంటారు. ఆ లక్కపిడత ఇస్తే దాంట్లో అన్నం అది ఆడుకునేందుకు ఏకందిపప్పో కావాలని గొడవచేస్తారు. కంది పప్పు చారెడుపోస్తే పంచదారో, బెల్లంముక్కో కావాలని మారాం, అందుకూ వాళ్ళ కోరిక తీరిస్తే ఈలోగా ఆ బూరా పేలిపోతుంది. వెంటనే తాడుకట్టి ఈడ్చుకునే రైలో, కారో కావాలని ఏడుపు కాళ్ల రెండూ బాదుకుని మనల్ని ఏపనీ చేసుకోనివ్వకుండా కాళ్లకు అడ్డాలుపడి, కిందపడుకుని దొర్లుతూ రభస ఎట్లాగో ఈ గోల భరాయించలేక ఓ నాలుగు రూపాయలు పెట్టి "కీ" యిస్తే తిరిగే మోటారుకొనిపెడితే అది వారం రోజుల్లో పాడుచేసి ఏ చక్రానికా చక్రం ఊడదీసి పాడయిపోయిందని సణుగుడు.

ఆ రకమైన చిన్నపిల్లల మనస్తత్వంలానే ఉంది వారి మనస్తత్వమూ. పాత సమస్యలు వదిలాయనుకుంటే ఇప్పుడీ కొత్త సమస్య తీర్చరానిదే అయింది.

"అమ్మా, అక్కయ్యా ఎక్కడికి వెళ్ళతారండి నాన్న చనిపోవటం చేతా, పోషించే దిక్కు లేకపోవటంచేతా, తలదాచుకోటానికి ఇల్లయినా లేకపోవటంచేతా వాళ్ళని ఇక్కడికి తీసుకువచ్చానేగాని ఇచ్చకానికీ, నా ఆస్తి తినేవాళ్లు లేకకాదే. వాళ్ళకున్నది రెండు గోతాల పాత్రసామాను, రెండు మంచాలూ, నాలుగు పెట్టెలూ, నాలుగు బిందెలూ మినహా మరేమి లేవు, ఈ స్థితిలో వాళ్లు మాత్రం ఎక్కడికి వెళతారు. కొత్త పేచీకి ఈ

పాత సమస్యను అడ్డువేసి పరిష్కారానికి అందని పరికొత్త పేచీని సమయానుకూలంగా ప్రవేశ పెటారు.

"వాళ్ళను వేరే ఉంచినందువల్ల ఆ ఖర్చు మనకే ఎక్కువవుతుంది కదూ. ఆ పరిష్కారమేదో మీరే ఆలోచించండి. నెలరోజులు కాదు రేపే వాళ్ళను పంపేస్తాను." ప్రతిమాలుతున్నట్టే చెప్పాను.

"మీ అమ్మ సంగతి తరువాత మాద్దాం. మీ అకయ్యను కాకినాడ తీసుకువెళ్ళి మీ బావ దగ్గర దిగవిడిచి రా ఆరువేలు కట్నం తీసుకుని పుస్తె కట్టింది ఆయనా, తిండి పెట్టటం నేనూనా" గట్టిగా అరుస్తూ అన్నారు.

"మీకు పుణ్యం ఉంటుంది నెమ్మదిగా చెప్పండి. అమ్మ వింటే బాధపడుతుంది."

ఈ మాట విని అత్తయ్య వచ్చారు అమ్మ పెరట్లో కూర్చుని కుమిలిపోతున్నది. అకయ్యకూడా అమ్మదగ్గరే కూర్చుంది.

"ఎక్కడికయినా పోదాం పదవే అమ్మా ఈ అల్లుడితో చివాట్లు తింటూ ఇక్కడెందుకూ. పోనీ నేను కాకినాడ వెళ్ళనా, ఆయనా నన్ను ఏలుకుంటారేమో ఈ మధ్య కోర్టు వాయిదాక్కూడా నేను వెళ్ళక్కర్లేదంటున్నారు ప్లీడరుగారు. వార్నిచూసి చాలా రోజులైంది. చూడాలని ఉందే అమ్మా ఇహిహిహి" అని వెకిలిగా నవ్వింది అక్కయ్య.

"పోదాంపద ఇద్దరం గోదావరిలో దూకితే ఈ జన్మకు ఈ పీడ విరగడై పోతుంది అంతకన్న మార్గం లేదు." ఏడుస్తూ అన్నది అమ్మ.

"ఒరేయ్ అబ్బీ మవ్వీరకంగా పేచీలు పెట్టావంటే వాళ్ళకన్నా ముందు నేను వెళ్ళిపోతాను జాగ్రత్త" అన్నది అత్తయ్య,

"నా సొమ్ము తినటానికి ఎంత బాధ్యత ఉందో నేననే మాటలు కూడా అంత బాధ్యతతోనూ స్వీకరించాలి. అల్లుడు సొమ్ము తినొచ్చు కాని మాట పడరేం, నువ్వేం నన్ను బెదిరించక్కర్లేదు అవసరం పడితే

నువ్వూ వెళ్ళాల్సొస్తుందేమో" అని విసురుగా వెళ్ళబోయారు. వారి చెయ్యి పుచ్చుకున్నది అత్తయ్య.

"అంతవరకూ వస్తే అందుకు నా సమాధానమూ ఉన్నది. తల్లిని భార్యా పిల్లల్నీ పోషించవలసిన బాధ్యత నీకు ఉన్నదా లేదా."

"ఉన్నది కాని బాధ్యత ఆర్థిక పరిస్థితినిబట్టి ఉంటుంది?"

"అట్లాగే దాని సంపాదనతో వాళ్ళిద్దర్నీ పోషిస్తున్నది. అదేం వాళ్ళకు తవ్వి తలకెత్తటంలేదు. రవ్వంత విషయాన్ని రచ్చకీడ్చి నీ మనస్సు పాడుచేసుకుని మా మనస్సు పాడుచెయ్యకు" అని వెళ్ళి అమ్మను ఊరడించింది అత్తయ్య.

"సరే కానివ్వండి మీరంతాకలిసి నామీద కత్తికటారు. ఆ కత్తితో ఎవరిపీక తెగుతుందో ఎవరు చెప్పగలరు."

ఒక ఆదివారంనాడు ప్లీడరుగారింటికి వెళ్ళాను. ఆయనా కాస్త దూరపు బంధువు. అక్కయ్య కేసు చూస్తున్నది ఆయనే. పేరు కేశవ రావు ఆయనతో అక్కయ్య విషయం చర్చించాను.

"మా పరిస్థితి అంతా మీకూ తెలుసు. అక్కయ్యను బావదగ్గరకు కాకినాడ పంపవచ్చా."

"లేదమ్మా. రాజీపడి కేసు పరిష్కారం చేసుకుంటే తప్ప ఈ స్థితిలో పంపటానికి వీల్లేదు. అప్పుడే కేసు స్వభావం ఇంకోరకంగా మారుతుంది, ముందు మధ్యవర్తిద్వారా సంప్రదింపులు జరపండి. అతని నడకనుబట్టి మనమూ ఆలోచిద్దాం" అన్నాడాయన,

ఇంటికొచ్చి ఈ విషయం వారితో చెప్పాను. వచ్చే ఆదివారం ఇద్దరం కాకినాడ వెళదామని చెప్పేను. నాకేం సంబంధం రావన్నారు. మూడురోజులు నచ్చచెప్పిన మీదట ఒప్పుకున్నారు.

ఆ తరువాత ఆదివారం ఇద్దరం కాకినాడ వెళ్ళాం. మేం వెళ్ళే సరికి బావ ఇంట్లోనే ఉన్నాడు. మమ్మల్ని చూసి ఆశ్చర్యపోయారు. ఆయన

ఉంటున్నది రెండుగదుల భాగం, ఒక చిన్న డాబా ఇల్లు. మిగతా ఇల్లంతా అద్దెకిచ్చేశారు. తండ్రి వాళ్ళ స్వగ్రామం వెళ్ళారు.

''రండి రండి దారితప్పి వచ్చినట్లున్నారే. మీ రాకవల్ల వేనుండే ఈ స్వంత ఇల్లు పావనం కాకపోయినా నన్నేదో పావనం చెయ్యటానికే వచ్చారు, కూర్చోండి కాఫీ తెప్పిస్తాము" పనిమనిషికి ప్లాస్కు ఇచ్చి పంపేరు.

"ఆడదిక్కులేని ఇల్లు. ముగ్గురం హోటల్లోనే భోజనం చేద్దాం. ఊ, ఇక చెప్పండి. ఈ ఊరు ఇద్దరికీ బదిలీ అయిందా, కలెక్టరాఫీసుకు వేశారా ?

''లేదు బావగారూ, అక్కయ్య విషయమే మాట్లాడదామని వచ్చాం'' అన్నారు. వారేమీ అంటిముట్టని అగ్రహారీకుల్లా కూర్చున్నారు.

"విషయానికేముంది. కోర్టె తేల్చాలి"

భార్యాభర్తల విషయంలో కోర్టెందుకు చెప్పండి. నాన్నగారు పోయారుకదా, అన్నయ్య సంగతి అందరికీ తెల్సిందే. అక్కయ్యను ఏలుకోమని ప్రార్థించటానికి వచ్చాను. దాని బ్రతుకు బండలు చెయ్యకండి, అది మీ మీదనే ఆశపెట్టుకుంది. వ్యవహారరీత్యా మనోవర్తికి దావావేసినా కోర్టులో దాని అభిప్రాయం విన్నారు కదా. రాజీపడదామనే వచ్చాము. మీరు అంగీకరించాలి పిల్లనిచ్చుకున్న తండ్రిలా ప్రాధేయ పడుతూ అడిగాను, అప్రయత్నంగానే కళ్ళు చెమ్మగిల్లాయి. వారు పేపరు చదువుకుంటూ కూర్చున్నారు.

"చూడండి సుభాషిణీ. నా అభిప్రాయాలు కూడా కోర్టులోనే చెప్పాను, ఎ.శ్నీ చెప్పటం చర్విత చర్వణమే అవుతుంది, మా తమ్ముడు గారు ఎంతో అదృష్టవంతులు, సునంద తెలివితేటలు కూడా సుభాషిణికే ఇచ్చాడు ఆ బ్రహ్మదేవుడు, ఏమంటారు" అన్నాడు బావ, వారు పేపరు ప్రపంచంలోనుంచె మా ప్రపంచంలోకి చూశారు.

"నన్నా పిలిచింది."

"పిలవలేదు. మీరు చాలా అదృష్టవంతులని చెప్తున్నాను."

"అవునవును నా అదృష్టం మండినట్లే ఉంది."

మళ్ళీ పేపరులో ముఖం దూర్చారు. అక్కయ్య వ్యవహారంలో వారికి జోక్యం కలుగచేసుకోటానికి ఇష్టంలేదని గ్రహించాడు బావ.

"రాజీ మార్గం లేదంటారా" మళ్ళీ అడిగాను.

ఆ పిచి దానితో, వెకిలిదానితో కాపురం చెయ్యలేను సుభాషిణీ. నేను కోర్టు తీర్పునే కోరుకున్నానుగాని రాజీని కాదు."

"కోర్టు ఏదో ఒక తీర్పు ఇస్తుందికాని, న్యాయాన్ని ప్రసాదించ లేదు. అందుకనే మిమ్మల్ని వేడుకుందామని వచ్చాను. అక్కయ్య మీరను కున్నంత తెలివితక్కువది కాదు, నిప్పులాంటిది."

"కావచ్చు. కాని సునందమీద నాకు మనస్సు పోవటంలేదు. ప్రతి వారూ తమ భార్య తెలివికలదీ, ప్రేమానురాగాలూ, ఆదరణా, అణుకువా గల ఆదర్శ గృహిణిగా ఉండాలని కోరుకుంటారు గాని పిచ్చిదానిలా ఉండాలని కోరకోరు. నన్ను క్షమించు సుభాషిణీ."

వ్యధిత మనస్కుడై అన్నాడు బావ. మరొక అరగంటసేపు కూర్చొని ఎన్నో రకాలుగా నచ్చచెప్పటానికి ప్రయత్నించాను, కాని బావ ససేమిరా అన్నాడు. పుట్టెడు నిరాశా, నిస్పృహా నెత్తినవేసుకుని వచ్చేను. నాకు ఎస్కార్టుగా వచ్చినట్లే ఉందిగాని వారికి చీమ కుట్టినట్లుగా కూడా లేదు.

మరొక పది రోజులు గడచాక అడిగారు. "ఏం సుభా మీ అమ్మ, అక్కయ్య సంగతి ఏం చేశావ్. ఏం ఆలోచించావ్. నేను కావాలో వాళ్ళు కావాలో ఆలోచించుకో మరి."

ఈ విషయం మళ్ళీ హెచ్చరిస్తారని నాకు తెలుసు. దానికే ఒక మార్గం అన్వేషించాను.

'అంతేనంటారా,''

"అంతే."

"నాకు మీరూ కావాలి, వాళ్ళూ కావాలి."

"అట్లా కుదరదు. నీ దగ్గర ఉండేది ఎవరో ఒకరే "

"అయితే నాకు మీరే కావాలి."

"వెరీగుడ్. వాళ్ళను ఎక్కడికయినా పంపెయ్యి."

"నాకూ మీరొక అవకాశం ఇవ్వాలి."

"ఓ యస్, అట్లాగే నీకొక్కావలసిన అవకాశం నీకే ఇస్తాను కోరుకో" సిగరెట్ వెలిగించి దర్జాగా పొగ వదిలారు.

"మీకు నేను కావాలా, నా జీతం కావాలా,"

"రెండూ కావాలి."

"అట్లా కాదు స్వామీ ఏదో ఒకటే కోరుకోండి. ప్లీజ్ నాక్కావలసిన అవకాశం నాకే ఇచ్చానన్నారు" గడ్డం నిమురుకోసాగారు. నా కళ్ళల్లోకి సూటిగా చూస్తూ.

"నువ్వే కావాలి" అన్నారు.

"అయితే వాళ్ళిద్దరూ నా జీతంతో బ్రతుకుతారు. మీరొక్క పైసా వాళ్ళ కోసం ఖర్చు పెట్టనక్కర్లేదు" నవ్వుతూ చూశాను.

నెత్తి గోక్కుంటూ "సరే, ప్రస్తుతానికి మళ్ళీ నువ్వే గెలిచావు సుఖా" అన్నారు, నా ఆనందానికి ఆ సమయంలో హద్దులులేవు.

రోజులు గడిచినకొద్దీ వారికి కోపం జాస్తి అవుతున్నది. ఎట్లాగయినాసరే అమ్మనూ, అక్కయ్యనూ వెళ్ళగొట్టాలనేదే వారి కోరిక. వీరి పద్ధతి ఇట్లాఉంటే పిల్లలిద్దరూ అక్కయ్యకు పూర్తిగా మాలిమి అయారు. చిన్నవాడు నిద్రపోయేవరకూ అక్కయ్య దగ్గిర పడుకున్నా

నిద్రపోయాక నాదగ్గిరపడుకోబెట్టుకునేదాన్ని. పెద్దవాడు అచ్చంగా అకయ్య దగ్గిరే పడుకునేవాడు. ఒక బాధ్యతలేని వ్యక్తిగా ఉంటంతో వాళ్ళతో తమా చిన్నపిల్లలా మసిలేది. వాళ్ళను ఏ విషయంలోనూ కేకలేసేది కాదు.

"ఓ సంవత్సరంపాటు కాపురం చేసి దాని కడుపునా ఓ కాయ కాసి నట్లయితే దాని జీవితం ఇట్లా ఉండేది కాదేమో" అని వాపోయేది అమ్మ.

పెద్దవాడు వారి వళ్ళో ఎప్పుడయినా కూచుని కబుర్లు చెప్పేవాడు వారసలు పిల్లల్ని ఎక్కువగా దగ్గరకు పిలిచేవారే కాదు. వారు ఎప్పు డయినా నాతో సంతోషంగా మాట్లాడుతూ ఉంటే ఆ సమయంలో మెల్లిగా తండ్రి దగ్గిరికి చేరేవారు.

అంతకు వారం రోజుల క్రితమే కొత్త ఆర్. డి. ఓ.గారు చార్జీ తీసుకున్నారు. ఆయన కాస్త చండశాసనుడు. తప్పు కనబడితే వదిలిపెట్టే వాడు కాదు. చాలా ఖచ్చితమైన వ్యక్తిత్వం కలవాడు, ఆయనంటే అంద రికీ దడగానే ఉండేది. ఆయన్ను గురించీ ఆఫీసు సంగతుల్ని గురించీ ఏవో సరదాగా కబుర్లు చెప్పుకుంటున్నాం, పెద్దవాడు నెమ్మదిగా వారి దగ్గరకు చేరేడు

మా ఇద్దరినీ చూస్తుంటే ఆ నాలుగేళ్ళ వాడికే వాడి లేత మన స్సులో ఏవో ఆలోచనలు దొర్లాయికామాలు ఒక ప్రశ్న వేశాడు. "నాన్నా మరేమో అమ్మకి నాన్నవి నువ్వున్నావు. మరి పెద్దమ్మకి నాన్న ఎవరూ?" అన్నాడు.

"పెద్దమ్మకీ, అమ్మకీ ఒకరే నాన్న అంటే నీకు తాతయ్య."

ఈ సమాధానం వాడికి నచ్చలేదు, తల అడ్డంగా తిప్పి "అమ్మకి నాన్నవు నువ్వు పెద్దమ్మకి ఎవరు? అంటున్నాను" అని మళ్ళీఅన్నాడు.

నాకూ ఇప్పుడు అర్థమైంది.

"వాడికి భర్త అనేముక్క రాలేదండీ, వాడి ఊహ అదే. అంటే

15)

అమ్మకి భర్తవు నువ్వు, పెద్దమ్మకు భర్త ఎవరు అవి అడుగుతున్నాడు అవునా బాబూ" అన్నాను, అవునన్నట్లువాడు తల ఊపాడు.

"పెద్దమ్మ భర్త నీకు పెద్దనాన్న అవుతారు. మొన్న నేను కాకినాడ వెళ్ళిరాలా, ఆ కాకినాడలో ఉన్నారు. అక్కడ పెద్ద నాన్నగారికి ఉద్యోగం" అన్నాను. వాడికి నమ్మకం కుదిరింది,

"పెద్దమ్మ, పెద్దనాన్న బాగుంది బలే బలే" అంటూ దిగివెళ్ళి అక్కయ్య దగ్గరకు చేరాడు.

"చూశావా సుభా, పిల్లలిద్దరికీ మీ అక్కయ్యవద్ద ఎంత చనువు ఏర్పడిందో. తమను వెళ్ళిపోమంటామేమోనని మీ అమ్మ ప్రోత్సాహంతో మీ అక్కయ్య ఈ నాటకం ఆడుతోంది."

వారిలో జుగుప్స, అసహ్యమూ ప్రస్ఫుటంగా కనిపించాయి.

"నాటకం ఆడే తెలివితేటలే అక్కయ్యకు ఉంటే భర్తను ఎప్పుడో దక్కించుకునేది. మనింట్లో ఉండి ఇన్ని చివాట్లు తినేది కాదు."

ఈర్ష్యగా నావైపు చూశారు, క్షణంసేపు ఆలోచించి,

"నాటకం ఆడే తెలివితేటలు నీకున్నయ్యి కనుకనే నీభర్తను నువ్వు దక్కించుకున్నావన్న మాట. నువ్వు నాటకం ఆడగలవని ఇద్దరు పిల్లలు పుట్టినా నాకూ ఇంతవరకూ తెలీసు సుమా" అన్నారు.

నేను మాట్లాడే ప్రతీ మాటకూ ఇంత విపరీతార్థాలు ఎందుకు తీస్తారో అర్థంకాలేదు. అది నా ముఖార వింద మేమోనని ఎంతో బాధ పడ్డాను.

"నాటకం ఆడటం కాని, ఆడించటం కాని మా వంశంలోనే లేదు, కాని మీ పూర్వ జన్మపు సుకృతంకొద్దీ జీవితంలో ఎటువంటి నాటకా లయినా ఆడగల ఆడించగల సమర్థులే మాకు తారసపడుతున్నారు, ఆ నాట

కాలలో వేషాలువెయ్యటం చేతకాకపోయినా ఎట్లా చూడాలోకూడా మాకు తెలీటంలేదు. ప్రేక్షకులుగాకూడా మేం పనికి రాలేదు."

నవ్వి ఊరుకున్నారు. నేనూ మాట్లాడలేదు. నాన్న చనిపోయి తొమ్మిది మాసాలయింది. అన్నయ్య విడుదలయివచ్చే రోజులుకూడా దగ్గరపడుతున్నయ్యి. మనమ్ము బావు ఇక పుట్టేడు దిగులుతోవున్న అమ్మ అన్నవరంవెళ్ళి సత్యనారాయణస్వామి దర్శనంచేసి, సింహాచలంకూడా వెళ్ళి వస్తానన్నది. చేతికి ఒక్క జత బంగారుగాజులుంటే నేను వద్దన్న కొద్దీ ఆ గాజులు అమ్మింది. రెండువందల యాభై రూపాయలు వచ్చింది. అత్తయ్యనుకూడా పంపిద్దామంటే మేం ఆఫీసుకు వెళ్ళినప్పుడు ఈ పిల్లలిద్దర్నీ చూస్తూ అక్కయ్య ఉండలేదేమోనని ఆవిడ్ని పంపించలేదు. మా వీధిలోనే ఇద్దరు ముగ్గురు ఆడవాళ్ళు వెళుతుంటే వాళ్ళతో అమ్మను పంపించాము. అక్కయ్య ఇంట్లోనే ఉన్నది.

అమ్మవెళ్ళిన మూడోరోజున దగ్గరలోవున్న గుళ్ళో ఏదో మంచి హారికథ చెప్తున్నారంటే రాత్రి పదిగంటలకు భోజనాలయాక అత్తయ్య హారికథ వింటానికి వెళ్ళారు. అక్కయ్య మధ్యగదిలో పడుకున్నది. అత్తయ్యవచ్చి తలుపుకొడితే తీద్దామని ముందుగదికీ, వీరి గుమ్మానికీ కూడా గడియవేసి ఎవరి పక్కలమీద వాళ్ళు పడుకుని నిద్రపోయాం. పిల్లలిద్దరూ ఎప్పుడో నిద్రపోయారు. నాకూ బాగా నిద్రపట్టింది. నిద్రపోయాను.

ఒక రాత్రివేళ సన్నగా "సుభా. సుభా" అన్న పిలుపు వినబడింది. కలతనిద్ర మెలకువ వచ్చి చూశాను. మంచంమీద వారు లేరు. ఒక్క ఉదుటున లేచి పక్క గదిలోకి వెళ్ళాను. అక్కయ్యను వారు బలాత్కారం చెయ్యబోతున్నారు. పెనుగులాడుతున్నది అక్కయ్య. మరొక్క నిమిషంలో అక్కయ్య పతనమయ్యే స్థితిలో ఉన్నది. నాకు ఆ సమ

యంలో ఆ కేక వినబడకపోతే వారి కోరిక తీరేది. ఆ దృశ్యం చూపే సరికి మనిషికి మించిన కోపం వచ్చింది. రౌద్రమూర్తినయాను. అక్కయ్య మీదినుంచి వార్ని ఒక్కనెట్టు నెట్టాను క్రింద పడ్డారు. విభ్రాంతితో లేచి నిల్చున్నారు. నా కింకా కోపం ఆగలేదు. వారి రెండు చెంపలూ వాయించాను. వళ్ళు మండిపోతున్నది. భర్తనే విచక్షణాజ్ఞానం నశించి పోయింది. ఎవరో దుర్మార్గుడు, కామాంధుడు అక్కయ్యను బలాత్కరిస్తున్నాడు, అవతలకు నెటి చెంపలు వాయించాను. ఆ పరిస్థితిలో అంతకన్నా నాకే ఆలోచనా రాలేదు. ఏమీ తెలీలేదు. భర్తను కొడుతున్నాననే స్పృహ నాకులేదు. పరమ దుర్మార్గుడుగా నా మనస్సులో నిలిచిపోయారు.

“సుభా” అని నన్ను ఒక్క నెట్టు నెట్టారు. మంచం కోడుమీద పడ్డాను. తలకు దెబ్బ తగిలింది, రక్తం వచ్చింది, అప్పటికిగాని నాలో మామూలు చైతన్యం కలగలేదు, అంతా రెండు నిమిషాల్లో జరిగి పోయింది. అక్కయ్య చీరె కుచ్చెళ్ళు సర్దుకుంటూ వంటింట్లోకి వెళ్ళి పోయింది. వంటింటో నుంచి ఏడుపు వినిపిస్తున్నది. దవడ పుచ్చుకుని వారు గదిలోకి వెళ్ళిపోయారు,

నాకు తల దిమ్మెక్కిపోయింది. రక్తంకారకుండా చేతో అదిమి పెట్టాను. వారి గదిలోకి వెళ్ళలేక అక్కడే నేలమీద పడుకున్నాను,

మరో అరగంటలో తలుపు కొట్టిన చప్పుడయింది హరికథ అయి అత్తయ్య వచ్చినట్లుంది, మెల్లిగా లేచివెళ్ళి తలుపు తీశాను, నన్ను చూసి నీరయిపోయింది అత్తయ్య, ఇంట్లోకిరాగానే అత్తయ్య కాళ్ళు చుట్టేసి బావురుమని ఏడ్చింది అక్కయ్య, ఆవిడా కంగారుపడిపోతూ ‘ఏం జరిగింది’ అన్నది, అంతా చెప్పాను, చివాల్న గదిలోకివెళ్ళి,

“పాపాత్ముడా సిగ్గులేదురా, పశువా, ఛీ, నీ ముఖం చూస్తే పంచ మహాపాతకాలూ చుట్టుకుంటాయి. ఆ అమాయకురాలి జీవితంలో నిప్పులు

పోద్దామనుకున్నావురా?అమ్మాయి నువ్వనుకున్నంత అమాయకురాలుకాదురా మంచి చెడ్డలు తెల్సిన గంగిగోవు లాంటిది" అంటూ ఎన్నో చివాట్లు వేశారు. వారేం మాట్లాడనేలేదు.

ఆ మర్నాడు ఉదయమే ఎక్కడికో వెళ్ళి పదిగంటలకు తిరిగివచ్చి జిప్ బాగ్‌లో కాసిని బట్టలు సర్దుకుని ఊరికి వెళ్ళి నాలు గయిదు రోజుల్లో వస్తానన్నారు. ఏ ఊరికనిగాని ఎందుకనిగాని వారు చెప్పలేదు. నిర్విణ్ణురాలై నిల్చుండి పోయాను.

"ఆఫీసుకవా, శలవు పెట్టారా"

"శలవు పెట్టాను. కాకినాడ వెళ్ళాలి".

ఎందుకని అడగలేదు. ఎందుకో నాకూ తెలీదు. రాత్రి ఎంత గట్టిగా కొట్టానో వారి చెంపలు చూస్తుంటే తెల్సింది. వారి ప్రవర్తన లోకం దృష్టిలో అసహజమైనా భరించగలిగినదని వారి అభిప్రాయం. కాని భార్య చేత చెంపదెబ్బలు తిన్నానే అనే కుమిలింపు, క్రోధావేశాలూ వారి ముఖంలో అద్దంలో చూసినట్లే కనిపించింది. మరేం మాట్లాడకుండా వెళ్ళిపోయారు.

నేను మామూలుగా ఆఫీసుకు వెళ్ళాను. అటెండెన్స్ రిజిష్టరులో సంతకం పెట్టి సీట్లోకివచ్చి కూర్చున్నాను. ఇంకా కాగితాలు సర్దుకోలేదు. యు. డి. సి. రామారావుగారు వచ్చి. ఒక్కసారి ఇట్లారామ్మా' అన్నారు వరండాలోనుంచి నావైపు చూసి. వరండాలోకి వెళ్ళాను. ఒక చివర నిల్చున్నాం. అక్కడ ఎవరూ లేరు.

"శ్రావణకుమార్ నాలుగురోజులు శలవు పెట్టాడెందుకూ?"

"కాకినాడ వెళ్ళాలిట. వెళ్ళారు. ఏంపనో నాకు తెలీదు."

"మీతో ఏదన్నా ఘర్షణ వచ్చిందా."

నిజంచెప్పాలో తప్పించి చెప్పాలో నాకు అర్థంకాలేదు. వెళ్ళేముందు రామారావుగారితో సంప్రదించారని ఊహించాము. అసలు విషయంచెప్పి కాపురంగుట్టు బైటపెట్టి ఆయన సలహాను అర్థించటమా లేక ఏదో సర్ది చెప్పి వారు కాకినాడ ఎందుకు వెళ్ళిందీ తెల్పుకోటమా అని ఆలోచించాను.

"సంసారం అన్నతరువాత సంఘర్షణలూ, సంప్రదింపులూ తప్పవు. మా అమ్మా, అక్కయ్యా, మాదగ్గిరే ఉంటున్నసంగతి మీకు తెలీందికాదు. వారిద్దరినీ పంపించెయ్యమంటారు. అదే వారి బాధ. మా భార్యా భర్తల మధ్య మనస్పర్థలకూ అదే కారణం" అన్నాను.

రామారావుగారుకూడ ఏదో చెపితే నమ్మేరకం కాదు. అదీకాక వారిద్దరూ స్నేహితులుకూడా.

"వాడీ ఊరునుంచి కాకినాడ బదిలీ చేయించుకోవాలనే ప్రయత్నం మీద వెళ్లాడు ఈ ఆఫీసులో వాడి సర్వీసూ దాదాపు ఎనిమిదేళ్ళయింది. అందుచేత వాడి కోరిక నెరవేరవచ్చు. అదీ సంగతి, వెళ్ళి మీవని చూసుకోండి" ఎక్కువగా మాటాడడం బాగుండదని ఆయన వెళ్ళిపోయారు.

భారంగా అడుగులు వేసుకుంటూ నా సీట్లోకివచ్చి కూర్చున్నాను.

మనస్సులో ఆలోచనలు పరిపరి విధాల పరిభ్రమిస్తున్నాయి. ఈ వాతావరణంనుంచి తప్పుకోవాలనే వారు కాకినాడకు ప్రయత్నిస్తున్నారు. వారు కాకినాడలో వుంటే నేను ఉద్యోగం చేస్తూ వారందరినీ చూస్తూ ఇక్కడే వుండాలా? వారివల్ల ఎన్నితప్పులున్నా ఎంత అవమానకరమైన పని చేసినా ఎదురుగుండా వుంటే ఎంతో నచ్చచెప్పి కొన్ని రోజుల్లోనైనా వారిమనస్సు మార్చగలిగాననే తృప్తి వుండేదాన్ని. వారు కాకినాడ వెళితే ఆ ఆశ లేదు. వారు పూర్తిగా మారిపోతారు ఎదురు చెప్పేవారుండరు. వచ్చేజీతం ఒక్కరికేచాలదు. అన్నిరకాల వ్యసనాలూ పూర్తిగా అలవాటవుతాయి. ఆలోచిస్తే భవిష్యత్తుకు పునాది కనబడలేదు.

వారంరోజులు గడిచాయి. ఆర్డర్లు తీసుకునేవచ్చారు. వాళ్ళి కలెక్ట రాఫీసుకు వేశారు. రాజామండ్రి కావలసిన ఇంకొక యు. డి. సీ అక్కడే ఉండడంతో తొందరగా పనయింది.

''మీ సుఖ సంతోషాలకూ, అత్యాచారాలకూ నేను అడ్డుగా వుంటే నన్ను చంపివేస్తే శాశ్వతంగా మీకు అడ్డు తొలిగిపోతుంది. మీరు కాకినాడ వెళ్ళటం ఎందుకు చెప్పండి" కంటకడితో మనస్సు చికిలబట్టుకుని వచ్చే వెక్కును ఆపుకుంటూ అడిగాను. నావైపు విశితంగా చూశారు.

''భార్య చేతులలో చెంపదెబ్బలు తిన్నవాణ్ణి చావలేక బ్రతుకు తున్నాను. భర్త జూదరి, త్రాగుబోతు, పరస్త్రీ లోలుడు కావచ్చు. అతను చేసే యీ పనులన్నీ ఘనకార్యాలని నేను వాదించను, మానవ దౌర్బల్య మూ, మానసిక దౌర్బల్యమూ రెండు నాలో వున్నాయి, ఈ సంఘంలో నాలాంటిభర్తలు ఎందరోఉన్నారు. వాళ్ళతోపాటు నేమా పాపాత్ముణ్ణే. కాని వాళ్లెవ్వరూ నామాదిరి భార్యచేతిలో దెబ్బలు తినలేదు. ఆ ఘనత నాకే దక్కింది. పుట్టిన ప్రతివాడికీ గౌరవ ప్రదంగానే జీవితం వెళ్ళదీసుకోవాలని ఉంటుంది. కాని మన దాంపత్య జీవితంలో భర్తగా నాకు గౌరవ ప్రదమైన స్థానం లేదు. అందుకే కావాలనే కాకినాడ బదిలీ చేయించుకున్నాను. ఇంతకుమించి నేను చెప్పేదేం లేదు సుభాషిణీ"అన్నారు.

నా పాదాలకింద భూమి కంపించింది. శరీరమంతా వణికిపోయింది. మాచ్చెమటలు పోశాయి. వారితప్పును వారు ఒప్పుకున్నా ఏ భార్యా చెయ్యలేని నాతప్పిదానికి వారు ఖిన్నులై పోయారు. ఎంతో అవమానంగా భావించారు. "మీ మీద నేనుచెయ్యిచేసుకోవటంతప్పేకాదు, ఈ కారణంగా ఏ భార్యా పొడిగట్టుకోని పాపాన్ని నేను శాశ్వతంగా నెత్తినవేసుకొన్నాను. నా అపరాధాన్ని మన్నించమని వేడుకోను. నాచేతులమీద వాతలువెయ్యండి నేనే వాతలు వేసుకుంటాను,మీరు ట్రాన్స్ఫరార్డరు రద్దు చేయించుకోండి.

మీరులేని ఈఇంట్లో నేను ఉండలేను. ఎక్కువకాలం జీవించలేను కూడా" అని ప్రతిమాలుకున్నాను. ఏడుస్తూ కాళ్ళమీద పడ్డాను. కాని వారేమీ మాట్లాడలేదు.

రెండు రోజుల్లో రిలీవయి వెళ్ళిపోతున్నారు. రామారావుగారిని సలహా అడిగాను.

"గవర్నమెంటు వుద్యోగాల్లో వీలయినంతవరకూ భార్యాభర్త లిద్దరూ ఒక వూళ్ళోనే వుండి ఉద్యోగాలు చేసుకోటానికి వీలుగా బదిలీలు చెయ్యాలనే గవర్నమెంటు ఆర్డరు ఒకటి వున్నది. మీ ఆయన వెళ్ళి జాయినయ్యాక కలెక్టరుకు ఒక రిప్రజెంటేషన్ పెట్టండి. మిమ్మల్నీ కాకినాడ బదిలీ చెయ్యొచ్చు. అంతకన్నా మార్గంలేదు" అన్నారాయన.

నాకూ పోయిన ప్రాణం సగం లేచివచ్చింది. వారు చార్జీ ఇచ్చి రిలీవయారు. ఆఫీస్ స్టాఫంతా పెద్ద టీపార్టీ ఇచ్చారు. కొంతమంది డిన్నరు ఇచ్చారు. నన్నూ పిలిచారు. మనస్సుకూ, హృదయానికీ శాంతి లేకపోయినా ఈ భార్యాభర్తలు చదువుకుని ఉద్యోగాలు చేసుకుంటున్నా ఎప్పుడూ కీచులాడుకుంటారేమో అని ఎవరూ అనుకునే ఆస్కారం లేకుండా పిల్చిన నాలుగు డిన్నర్లకూ సంతోషమనే పౌడరు రాసుకుని ఉత్సాహమనే ముస్తాబు చేసుకుని వెళ్ళాను. ఇట్లా ఈ నాలుగు డిన్నర్లకూ నేను రావటం వారికి యిబ్బందిగానే ఉన్నా ఆ గంటసేపూ జోకులు వేస్తూ నాతో కూడా నవ్వుతూ మాట్లాడేవారు. ఇట్లాంటివి ఇంకా పది డిన్నర్లు ఉంటే బావుండుననిపించేది. మనిషికి కావలసింది సంతోషం, ఆత్మ సంతృప్తి. ఈ రెండూ మనకు దూరమైపోతున్నయ్యనే భావం కలిగే సరికి ఇదివరకు అనుభవించిన సుఖమయ జీవితమంతా దుస్వప్నంగా మారిపోతుంది. డిన్నరు పూర్తయి ఇంటికి వచ్చాక ఆ ముఖంలో ఏదో తీరని వ్యథ రివ్వున ఎగిరివచ్చి గూడు కట్టుకుంటుంది.

వెళ్ళే రోజున పెట్టె, బెడ్డింగూ అన్నీ సర్దుకుని వాకిట్లోకి రిక్షా వచ్చాక "వెళుతున్నాను. పిన్నీ" అని అత్తయ్యతో అన్నారు. పెద్దవాడు ఎదురొస్తే నవ్వు ముఖంతో తల ఎగరేసి రిక్షా ఎక్కారు. వెళుతున్నానని నాతో మాటమాత్రమైనా చెప్పలేదు. రిక్షా వెళ్ళిపోయింది.

రిక్షా మలుపు తిరిగేవరకూ కళ్ళార్పకుండా చూసి "అమ్మా నాన్నకు కాకినాడ బదిలీ అయిందటగా, నాన్న చెప్పలేదు. బామ్మ ఇందాక అన్నది. మరి మనం కూడా అక్కడికి వెళ్ళొద్దూ" అన్నాడు పెద్దవాడు. పుట్టెడు దిగులు నెత్తిన వేసుకున్నా "వెళదాం బాబూ ఇల్లు తీసుకుని మనల్ని తీసుకువెళతారు నాన్నగారు" అన్నాను.

కాకినాడలో ఎక్కడుంటారని అడిగితే "నా బతుక్కితోడు గది కూడా కావాలంటావా, ఎక్కడుంటానో నాకే తెలీదు. నీ కెట్లా చెప్పేది" అన్నారు.

ఆ రాత్రి తెల్లవార్లూ నా కళ్ళనుంచి వచ్చిన కన్నీరంతా దిండు తనలో దాచుకున్నది. అక్కయ్యను బావ వదిలిపెట్టి వెళ్ళిన దృశ్యంకన్నా నాన్న చనిపోయిన ఆనాటి పరిస్థితికన్నా, అన్నయ్య జైలుకు వెళ్ళిన రోజుకన్నా ఈనాడు వారు వెళ్ళిన ఈ సంఘటన నా మనస్సులో చెరగని ముద్ర వేసింది. బదిలీ అనేది ప్రతి గవర్నమెంటు ఉద్యోగికీ ఉండేది, కానీ ఈ బదిలీ అట్లాంటిదికాదు. ఆ మరునాడు ఉదయం రెండు అరి చేతులమీదా ఎవరూ చూడకుండా రెండు వాతలు నేనే వేసుకున్నాను.

# 10

పది రోజులు దాటినా వారి దగ్గర్నుంచి ఉత్తరం రాలేదు. ఈలోగా నేనొక ఉత్తరం రాసినా అందుకూ సమాధానంరాలేదు. నా మనో

వేదన చూసి "అన్నయ్య జైలునుంచి ఎప్పుడు తిరిగొస్తాడే" అన్నది అమ్మ. ఆ తేదీ తెల్సుకనుక లెక్క వేసి ఇంకా రెండుమాసాల పద్దెనిమిది రోజులుందని చెప్పేను. ఇంకా అంత వ్యవధి ఉన్నదా అన్నట్లుగా చూసింది అమ్మ.

"అన్నయ్య రాగానే వాడి కాళ్ళు పుచ్చుకుని బ్రతిమాలుకుంటాను ఎక్కడన్నా వంటలు చేసన్నా బ్రతుకుతాను. బ్రతుకు మీద ఆశవుండికాదు, ఈ నికృష్టజీవితం ఈ జన్మలోనే వదిలిపోతే ఈ పాపం వచ్చే జన్మ కూడా అనుభవించకుండాపోతుంది. మొగఎక్కడ లేకుండా అక్కయ్యను నెత్తిన పెట్టుకుని ఎక్కడ కూర్చునేది. తాళికట్టిన భర్తకు దాని అందచందాలతో పాటు తెలివితేటలు కూడా కావాలి. కాని దాని అందాన్ని చూసి భ్రమపడేవారికి దానితో అనుభవమే కావాలిగాని తెలివితేటలు అక్కరలేదు. ఇటువంటి ఆడపిల్లను నేను సంరక్షించలేను. వాడు కనక ఉంటే వాడి రౌడీతనమే దాన్ని కాపలా కాస్తుందేమో? ఫలాని రౌడీ వాణినాధం అక్కగారంటే దానికీ కాస్త గౌరవంగా, అంగరక్షగా ఉంటుందేమో"· అంటూ కంట తడిపెట్టింది అమ్మ.

అక్క విషయంలో అమ్మ ఇంత బాధాకరంగా మాట్లాడుతున్నదంటే పరోక్షంగా అమ్మ వార్ని దుయ్యబడుతున్నదనే వాస్తవాన్ని నా మనస్సు కాదనలేకపోయింది. కోర్టు పరిష్కారం ఎట్లా ఉంటుందోనన్న ఆందోళనకన్నా అక్కయ్యను కాపాడ్డమే అమ్మకొక పెద్ద సమస్యయింది.

"అన్నయ్య విడుదలై వచ్చాక బుద్ధిగా ఎక్కడైనా ఉద్యోగం చేస్తూ మీ ఇద్దరితో ఎక్కడైనా ఇల్లు తీసుకుని ఉంటాడనే ఆశగాని, నమ్మకంగాని నాకు లేవమ్మా. దొంగకూ, మోసగానికీ చాలా తేడా ఉంది. దొంగకు మనస్సు మారవచ్చునేమోగాని మోసగానికి మనస్సు మారదు" అన్నాను.

''నీ మాట అసత్యం కావాలనే నా కోరిక. నేనింత ఇక్కడ వుంత లేను. మేం విడిగా వుంటే మా బ్రతుకులు ఎట్లావున్నా నీ కాపురమన్నా బాగుపడుతుంది.''

అమ్మ మనస్సు విలవిలాడింది. ఆ మర్నాడు పోస్టులో ఒక ఉత్తరం వచ్చింది. వారి వద్దనుంచి కవరు వచ్చిందేమోనని చూశాను. దస్తూరి వారిదికాదు. పైగా అడ్రసు వారి పేరుతో ఉన్నది. ఆదుర్దాగా కవరు చించి ఉతరం చదివాను.

అది వారి మేనత్త కూతురు రాధ రాసిన ఉత్తరం. అమ్మాయి బి. ఏ. పాసైంది. ఏదైనా ప్రైవేట్ కంపెనీల్లో ఉద్యోగ ప్రయత్నానికి వస్తున్నాననీ ఇలు జరగటం చాలా కష్టంగా ఉందని, తప్పకుండా ఏదయినా ఉద్యోగం ఇప్పించి పుణ్యం కట్టుకోమనీ ఆ ఉత్తరం సారాంశం.

ఇటీవల రాధనెప్పుడూ నేను చూడలేదు. మా పెళ్ళిలో చూశాను. అప్పుడు స్కూల్ ఫైనలు చదువుతూ ఉండేది, సన్నగా, పొడుగ్గా చామన చాయరంగులో వుండేది. మంచితెలివి కలది. చిన్నప్పుడే తండ్రిపోయాడు. వాళ్ళు ఇద్దరు ఆడపిల్లలు. ఇద్దరు మగపిల్లలు రాధ అన్నయ్య భీమవరంలో బి. ఇడి, టీచరు అతనికి ఇద్దరు పిల్లలు. భార్య, తండ్రి పోయాక తల్లినీ, ఇదరాడపిల్లల్నీ, తమ్ముణ్ణీ భీమవరంలో తనదగ్గరే వుంచుకుని సంరక్షిస్తూ పిల్లలకు చదువు చెప్పించాడు. ఆ స్థితిలో వున్న ఆ కుటుంబానికి భగ వంతుడు తీరని ద్రోహమే చేశాడు. సంవత్సరం క్రితం రాధ అన్నయ్య గుండెజబ్బుతో కన్నుమూశాడు రాధ వదినె, ఇద్దరు పిల్లలూ పుట్టింటికి చేరారు. ఆ కుటుంబానికి అర ఎకరం పొలం మినహా వుండటానికి ఇల్లు కూడా లేదు. ఇప్పుడు తల్లినీ, యిద్దరు మగపిల్లల్నీ, చెల్లెల్నీ రాధ ఉద్యోగం చేసి పోషించాలన్నమాట. ఆ కుటుంబంసంగతి నాకు అంత వరకే తెల్సు.

ఆనాటి రాధ మనస్సూ, వయస్సూ ఎంతో పెరిగివుండొచ్చు. చాలా తెలివైనది కనుకనే స్కాలర్‌షిప్‌లతో బి. ఏ, పాసయిందని ఒక

సారి ఎప్పుడో వారే చెప్పారు. ఆ రాధ ఇన్నేళ్ళకుగాను ఈ పరిస్థితి మా ఇంటికి వస్తానని ఉత్తరం రాసింది, రాధ భీమవరంనుంచి వస్తున్నది. వారికి కాకినాడ బదిలీ అయిందని తెలీదు.

అత్తయ్యకు ఈ విషయం చెప్పగానే ఎంతో సంతోషించింది.

"రాధ చాలా తెలివైనపిల్ల సుభా. ఎట్లాగోట్ల నాలుగు కబుర్లు చెప్పి ఉద్యోగం అది సంపాదించుకుంటుంది. దాని మాటలు చిన్నప్పట్నుంచీ తెల్సు. చాకులా ఉంటాయి, దాని కబుర్లు వింటుంటే ఎంతటి బాధనైనా మర్చిపోతాం'' అన్నది అత్తయ్య.

ఉత్తరం వచ్చిన మూడోరోజున రాధ వచ్చింది. రిక్షా దిగి పెట్టె ఇంట్లో పెడుతూనే....

"ఏం సుభాషిణక్కయ్యా, గుర్తుందా. నేను రాధని, మీ పెళ్ళిలో చూశాను, అవునూ ఇద్దరు పిల్లలకే అంత పాడయిపోయావేం. ఏదీ మా బావేడీ, మా అక్కయ్యను ఇంత కొల్చుకు తింటున్నావేమోయ్ మగరాయుడా అని ముక్కుచ్చుకుని అడుగుతాను" అన్నది, మా పిల్లల్ని చూసి "ఏరోయ్ పెద్దాడా నువ్వు మీ బాబు పోలికే, కానీ బావమాదిరి తలలుతీసి మొలలు కట్టించే వాడివి మాత్రంకాకు. అబ్బ చిన్నవాడు అచ్చు మా అక్కయ్య పోలికే వాడి బుర్రగట్టిది. ఎన్నో ఆలోచనలు. బుర్రకు మేధ ఉన్నా మనిషి మాత్రం మేధకుడు, వాడి చూపులోనే తెలుస్తున్నది, ఏం అత్తయ్యా కులాసా, అమ్మ మిమ్మల్ని అడిగానని చెప్పమన్నది" అన్నది,

కాళ్ళు కడుక్కోనేందుకు నీళ్ళిచ్చి, చల్లటి మంచినీళ్ళిచ్చాను. రాధ నాకన్నా గుప్పెడు పొడుగున్నది. సన్నం మాత్రం అంతే.

"ఎంత చటమైనా నేను ఆడపిల్లనుగాని మగరాయుణ్ణికాదు అక్కయ్యా, పెరట్లోకి వెళ్ళి కాళ్ళు కడుక్కుంటాను. మంచినీళ్ళు మాత్రం ఇక్కడే తాగేస్తాను" అన్నది. రాధ మాటలకు నవ్వొచ్చింది.

కాళ్ళు కడుక్కొని కుర్చీలో కూర్చుంది. వాళ్ళ కుటుంబ పరిస్థితులు కాసేపు సమీక్షించాము

“అవునుగానీ, బావ గవర్నమెంటు గుమాస్తాకామాలు. అందుకనే ఆదివారంనాడుకూడా ఆఫీసుకు వెళ్ళాడు. అవును, అక్కయ్యా నన్ను కూడా వాళ్ళాఫీసులోనే పెట్టిస్తవనుకుంటాను” అన్నది కిలకిల నవ్వుతూ, ఆ మాటలూ ఆ తెల్లవి పలువరుసా చూసి అత్తయ్య అన్నట్లే మానసిక వ్యధని కాస్త అవతలకునెట్టాము. మా ఉద్యోగ పరిస్థితి చెప్పేను. ముక్కుమీద కుడిచేతి చూపుడు వేలితో కొట్టుకుంటూ “కొండంత ఆశతో వచ్చాను బావ ఉద్యోగం ఇప్పిస్తాడని, ఆశ అందలం ఎక్కించినా అవకాశాలు శూన్యంలోకే లాక్కు వెళుతున్నాయ్యి. అయితే తిరుగు రైల్లో వెళ్ళిపోతాను” అన్నది.

“మీ బావ లేకపోతే మేము. తా లేమా రాధా. అదృష్టం బావుంటే నీ మాటలు చూసే ఎవరయినా ఉద్యోగం ఇస్తారు. అదీ లేకపోతే బావే కాదు మీ అన్నయ్య బ్రతికివున్నా నీకు ఉద్యోగం దొరకదు. తరువాత చూద్దాం కాని స్నానం చెయ్యి, భోజనం చేద్దువుకాని” అన్నాను.

భోజనం చేస్తూ అమ్మ అక్కయ్యను గురించి అడిగింది. చెప్పాను ఎత్తాకర్తిగా వాళ్ళకూ అన్నీ తెల్సు, నేను దాచినందువల్ల ప్రయోజనమూ లేదు. అక్కయ్యను పలకరించింది రాధ.

“మీ పేరు రాధకదూ”

“భలేవారే, రాధ మీ పేరు, నా పేరు సునంద”

“ఓహో, నాదే పొరబాటు. మీ శ్రీవారి పేరు”

అక్కయ్య సిగ్గుపడి తలవంచుకున్నది.

“కోర్టులో దావా వడేసిన భర్త పేరు చెప్పటానికి సిగ్గేమిటి, అట్లా అయితే ఈ కేసు మీ పక్షంకాదు” అంతా తనకే తెల్సినట్లుగా అన్నది రాధ. అక్కయ్య మనస్సు మరో కోణంనుంచి తెల్సుకోటానికే. ఈ ప్రశ్నలన్నీ రాధ వేస్తున్నదనుకున్నాను.

"శ్రీవారి పేరు ఆనందరావుగారు"

"వారేం చేస్తున్నారు? ఎక్కడున్నారు?"

"అదే-వారేదో ఆఫీసులో ఉద్యోగం. కాకినాడలో ఉన్నారు."

"భర్త ఉద్యోగం సంగతికూడా తెలీకపోతే నువ్వేం భార్యవు. అక్కయ్యా, ఆలోచించే చెప్పు."

అక్కయ్య ఆలోచిస్తున్నది.

"ఆ గుర్తొచ్చింది, ఇన్కం, ఇన్కం ఇన్కం టాక్సు ఆఫీసులో గుమాస్తా."

"గుమాస్తానా, క్లార్కన్నదే మఖాషిణి" అక్కయ్య కాస్త నవ్వింది.

"ఇంగ్లీషులో క్లార్కంటారు. తెలుగులో గుమాస్తా అంటారు."

"హిందీలో."

అక్కయ్య పక పకా నవ్వింది.

"నాకు హిందీరాదు'' అన్నది.

"మీ శ్రీవారంటే మీకు ప్రేమ ఉందా"

"ఎందుకులేదు. ఉన్నన్నాళ్ళూ ప్రేమగానే ఉన్నాను."

"ఎంత ప్రేమ, కిలోనా, మణుగా."

"ప్రేమనేది వస్తువుకాదండీ తూచి చెప్పటానికి. అయినా మీకు పెళ్ళికాలేదుకదూ. భార్యా భర్తల ప్రేమ పెళ్ళయితేనే కాని తెలీదు."

నోటికి చెంగు అడ్డు పెట్టుకుని అన్నది అక్కయ్య.

"ఇటీవల కాకినాడ వెళ్ళాను. ఆనందరావుగారు కనిపించారు, నేను [illegible] తనవుగా మాట్లాడేసరికి నన్ను పెళ్ళాడుతానని నా వెంట పడ్డారు. [illegible] నాకు తెలీనే తెలీదు. ఇంకా నయం పెళ్ళాడేశామకాదు కొంప

అక్కయ్య ముఖం వివర్ణమై పోయింది. తిన్నురాలై రాధ ముఖం వైపు చూడసాగింది. నాకూ నవ్వొస్తున్నది, రాధ తింకంగా కూర్చుని మాట్లాడకుండా మజ్జిగన్నం తింటున్నది. రాధ ఓరగా అక్కయ్య వైపు చూసింది,

"రాధగారూ, కోర్టులో కేసుండగా వారు మళ్ళీ పెళ్ళి చేసుకో వచ్చా, నా కాపరం మీరే తీస్తారా రాధా" అక్కయ్య కళ్ళు చెమర్చాయి

"మగవాళ్ళ కోరికలు ఆడవాళ్ళ కోరికల్లా నెలల పర్యంతం ద్దాగవు అక్కయ్యా, సరే విషయం తెల్సింది కనుక నే నాయన్ని పెళ్ళి చేసుకోను సరేనా,"

రాధ భోజనంచేసి ఇవతలికి వచ్చేసింది, అక్కయ్య ముఖంలో ఏవో ఆలోచనలు ముసిరాయి,

మర్నాడు రాధకూడా నాతోపాటు భోజనంచేసి మా ఆఫీసుకు వచ్చింది.

దారో అడిగాను,

"అక్కయ్యను అట్లా బెదరకొట్టేవేం రాధా?"

రాధ నా వైపు విశితంచూసి.

''మనందరు నేను బెదరకొట్టలేదు. ఆ అమ్మాయి అమాయకు రాలు. వెకిలిది. తెలివితక్కువది అనే పదాలు మీరే వాడి మీరే బెదర కొట్టారు'' అన్నది.

నేను మాట్లాడలేక పోయాను, ఇద్దరం ఆఫీసుకువెళ్ళాం, నాపక్కనే ఉన్న మరో కుర్చీలో కూర్చున్నది రాధ. అందరి కళ్ళు ఆమె మీదనే ఉన్నాయి. ఆ రోజుల్లా ప్రతివారూ ఏదో నెపంతో నా సీటు దగ్గరకువచ్చి రాధను చూసేవారే.

రామారావుగారువచ్చి "వాడిదగ్గర్నుంచి ఉత్తరం వచ్చిందా" అనడి గారు,

"లేదు" అన్నాను.

రాధవైపుచూసి "వీరెవరు" అన్నారు. చెప్పాను. రామారావు గారు వెళ్ళాక రాధ, అన్నది.

"బావ వద్దనుంచి ఉత్తరం రాలేదా."

"లేదు. తరువాత మాట్లాడుకుందాం ఇది ఆఫీసు" నెమ్మదిగా అన్నాను.

సాయంత్రం ఇంటికి వెళుతూ జరిగిన విషయమంతా రాధతో చెప్పాను. వారిని గురించిన సంగతులు చెప్పకుండా ఎంత దాచిపెట్టినా రాధ ఊరుకోదు. అత్తయ్యనైనా అడిగి తెల్సుకుంటుంది. కాకపోయినా మనస్సులో గూడుకట్టుకున్న వ్యధ రాధతో చెపితే కాస్త మనస్సు తేలిక పడినట్లు ఉంటమేగాక నాకు తోచని సలహాకూడా ఏమైనా చెపుతుందేమో నని ఆశించాను. ఎప్పుడో పెళ్ళిలో చూసిన రాధ నాకు పరమ అపురూపం కాకపోయినా అమ్మాయి తెలివి తేటలు నాకు బాగా తెల్సు. నేను చెప్పిందంతా విని రాధ అన్నది.

"ఉద్యోగంకోసం వచ్చిందాన్ని మీ ఇంటి వ్యవహారాల్లో జోక్యం కలుగచేసుకోటం తప్పేనేమో."

"తప్పులూ బాధలూ మా కుటుంబంలో జరగవలసినవి జరిగి పోతూనే ఉన్నయ్యి. నువ్వేమీ పరాయిదానివి కాదు. ఆచరణీయమైన నీ సలహా ఏదయినా పాటిస్తాము. మాతోపాటు నాలుగు మెతుకులు తిని ఇక్కడే ఉండు, నీ ఉద్యోగ ప్రయత్నమేదో నువ్వు చేసుకో" అన్నాను.

పదిరోజులు గడిచాయి. రాధ తన ఉద్యోగ ప్రయత్నాలు తనే చూసుకుంటున్నది. అప్లికేషనులు మాత్రమే నేను టైప్ చేస్తున్నాను. ఉదయమే వెళ్ళేది. మధ్యాహ్నం వచ్చేది, మళ్ళీ సాయంత్రం మూడు గంటలకు వెళ్ళేది, ఒక్కొక్కప్పుడు వచ్చేసరికి రాత్రి తొమ్మిదయేది.

ఒకరోజున రాధ అన్నది.

"ఉద్యోగం విషయంలో నువ్వు చాలా అదృష్టవంతురాలివి. సర్వీస్ కమీషన్‌వాళ్లు నిన్ను పిల్చి బొట్టుపెట్టి ఉద్యోగం ఇచ్చారు. నాకు చెప్పుల జత అరిగినా ఉద్యోగం దొరకలేదు. కాని ఎన్నో విషయాలు తెల్సుకున్నాను. నీలా ఉద్యోగం దొరకటమనేది మేనరికం లాంటిది. నా ఉద్యోగ ప్రయత్నాలు అమ్మాయికి పరాయి సంబంధం వెతికినట్లె వుంది. మనస్సును ఆకట్టుకో గలిగితే ఈ రోజుల్లో మొగుడన్నా దొరికేట్లున్నాడు కాని ఉద్యోగం దొరికేటట్లులేదు. రోగికి మందులూ ఇంజకన్ల మాదిరి నిరుద్యోగికి మంత్రుల సిఫార్సులూ కావాలి."

నా పరిస్థితికి రాధ నన్ను మెచ్చుకుంటుంటే ఆ అమ్మాయి కన్న నా పరిస్థితే మెరుగనిపించింది. అదృష్టమనేది బంగారం లాంటిదయినా ఆ ముద్దను కరిగించి వచ్చిన నగలు చేయించుకుంటేనే ఆ బంగారపు విలువ, శోభ అందరికీ వెల్లడయేది. నా తోటిది నగలు చేయించుకున్నా ఆ రాళ్ళ నగలు నీరు దిగిపోవటంచేత అన్నీ మట్టిముద్దల్లా వెలా తెలా పోతున్నయ్యి. కాని ఎప్పటికయినా ఆ బంగారు నగలను చెడకొట్టించి మంచివిగా తయారు చేయించుకోవచ్చు. కాని రాధకు అసలు బంగారమే లేదు.

"నువ్వన్నది నిజమే రాధా. ఉద్యోగాన్వేషణలో నీ అనుభవా లేమిటో."

రాధ నవ్వి చెప్పింది.

"ఒక ఆఫీసుకు వెళ్ళేదాన్ని. ఆ ప్రొప్రైటరో, మేనేజరో కమిన్ మేడమ్, టేక్ యువర్ సీట్ అని ఆహ్వానించి కూర్చో పెట్టేవాళ్ళు. కూర్చుని మెల్లిగా ఉద్యోగం విషయం చెప్పేదాన్ని. ఓహో, సారీ, నో వేకెన్సీ ప్లీజ్, యు కెన్ గో అన్నేవారు. మరొకచోట మా ఆఫీసులో ఆడ పిల్లల్ని వేసుకోటం లేదమ్మా. ఇంకొకచోట అనేవారు- మీరు చాలా

స్మార్ట్‌గానే వున్నారు. కాని బి. కాం. అయితే బావుండేది. మీరు బి. ఏ. కదా సారీ అనేవాళ్ళు మరొక ప్రబుద్ధుడు ఉయ్ వాంట్ ఓన్లీ బి. యస్సీస్ ప్లీజ్ అనేవాడు. వరే ఏదో ఒక ఉద్యోగం పెళ్ళి సంబంధం లాగా ఎప్పుడో దొరక్క మానదు. మీ విషయంలో నే నొక ఆలోచనకు వచ్చాను."

"ఏమిటది?"

"మీ అక్కయ్యను కాస్త ఎడ్యుకేట్ చెయ్యాలి. ఎంతసేపూ అక్కయ్య అమాయకత్వాన్ని, బావ క్రౌర్య తత్వాన్ని ఆడిపోసుకుంటు న్నారేగాని తగిన చికిత్స చెయ్యటంలేదు. ఇంటిదగ్గిరే అక్కయ్యకు చదువుచెప్పి కొంత రాపాడితే లోకజ్ఞానం కలుగుతుందేమో,

"నా సంసార తాపత్రయంలో పెడత్రోవను పడుతున్న వారిని తీర్చిదిద్దుదామనే ఇంతకాలం వెళ్ళబుచ్చాను కాని, ఈ పరిస్థితికి ఒక కార ణమై కూర్చున్న అక్కయ్య జీవితంలో సౌఖ్యం కలుగజేసుకుందామనే జిజ్ఞాస నాకు ఇన్నాళ్ళనుంచీ లేకపోయింది.

"నీ సలహా అమలు జరుపుతాను రాధా. కాస్త చదువు ధోరణిలో పెడితే అక్కయ్యలో కొంత మార్పేమయినా కలుగుతుందేమో."

ఆ మర్నాటినుంచే నాలుగో క్లాసు పుస్తకాలు తెచ్చి అక్కయ్యకు పాఠాలు మొదలు పెట్టాను, తనకు వీలయినప్పుడు రాధకూడా అక్కకు చదువు చెప్పేది.

వాడు వెళ్ళి నెలదాటింది. ఆ రోజే ఆఫీసు అడ్రసుకు నా పేర ఉత్తరం వచ్చింది. చదివాను,

కాకినాడ

లక్ష్మి సౌభాగ్యవతి సుభాషిణికి ఆశీర్వదించి వ్రాయునది.

నా కన్నా చిన్నదానివి కనుక ఆశీర్వచనములు అందచేయటం విధాయకం కనుకా "ఆశీర్వదించి వ్రాయునది" అన్నాను లేకపోతే నమస్కా

రింప తగిన దానివి, మన జీవితాలకు తోడు మన కిద్దరు పిల్లలు, వాళ్ళు ఏ పాపం చేశారోగాని మన కడుపున పుట్టారు. మన ఖర్మకు మించిన ఖర్మ వాళ్ళది

నాలో మానవత్వమూ, మానవ ధర్మాలూ లేవని నువ్వన్నప్పటికీ నీలో ఆదర్శ గృహిణికి ఉండవలసిన ప్రేమానురాగాలూ, అణుకువలేవని నేను అన్నప్పటికీ మనిద్దరం జీవించే ఉన్నాం. భార్యా భర్తలమయినా ఒకరి అభిప్రాయాల్ని మరొకరం మన్నించుకోలేక దూరదూరంగా ఉన్నా ఉద్యోగానికి తిలోదకాలిచ్చే స్థాయికి మనం చేరుకోలేదు కనుక ఉద్యోగ రీత్యా మనం గౌరవ ప్రదంగానే జీవిస్తున్నాం. జీవించాలి కూడా.

ఏకాకిగా జీవితాన్ని గడుపుదామనే నిశ్చయంతో ఇక్కడికి వచ్చినా అలాంటిదే ఒక కాకి తన గూటిలో నాకు ఆశ్రయం ఇచ్చింది. ఆడ కాకులు అక్కడ. మగ కాకులు ఇక్కడ.

అందరూ క్షేమమనే మా భావం,

నువ్వు కాకినాడ ట్రాన్స్‌ఫరుకు పెట్టుకున్న అప్లికేషన్ చేరింది. అవును మువ్వు సాధించేందుకు నేను అక్కడ లేనుకదా. నీ కోరికమేరకు నువ్వుకూడా ఇక్కడికేవస్తే నా జీవితం ఆ లోకానికే వెళ్ళవలసి వస్తుందేమో! అదే నీ కోరికయితే నీకూ ఈ ఊరు బదిలీ అయ్యే ప్రయత్నం నేనూ చేస్తాను. ఆలోచించి జాబు వ్రాస్తావుకదూ?

సెలవు.
భవదీయుడు,
శ్రావణకుమార్.

ఆ ఉత్తరం చదువుతుంటే నా జీవితం సగం పైగా తగ్గిపోయినంతగా బాధపడ్డాను. మనస్సంతా ఆ ఉత్తరమే ఆక్రమించటంతో ఆ రోజున టైపుచేసిన కాగితాల్లో తప్పులుకూడా చాలా ఎక్కువే పడ్డాయి. ఇటీవల అన్ని తప్పులు ఎప్పుడూ రాలేదు. కాల ప్రవాహంలో మను

ష్యలు కొట్టుకుపోతున్నట్లే మనఃక్లేశమనే ఈ ప్రవాహంలో నా జీవితం మరింత వేగంగా కొట్టుకొని పోవాలేమో ననుకున్నాను.

ఇంటికి వెళ్ళాక మీ అబ్బాయి దగ్గర్నుంచి ఉత్తరం వచ్చిందని చెప్పి ఆ ఉత్తరాన్ని అత్తయ్యకు ఇచ్చాను. "నీకు రాసిన ఉత్తరం నేను చదవటమేమిటే" అని అన్నా పరిస్థితి తెల్పిన ఆవిడ ఆ ఉత్తరాన్ని పూర్తిగా చదివింది.

"వాడి మనస్సు ఇంతగా మారిపోతుందనుకోలేదు. నువ్వొక్క- సారి కాకినాడ వెళ్ళిరా. వాడు ఆనందరావు ఇంట్లోనే ఉంటున్నాడట్లే వుంది." అన్నది అత్తయ్య.

రాధ వచ్చాక ఆ ఉత్తరం చదవమని ఇచ్చాను. ఆ ఉత్తరాన్ని రెండుసార్లు చదివింది రాధ.

"బావ నీ మీద చాలా ద్వేషభావంతో ఉన్నాడు. ఇలాంటి ఉత్తరం వచ్చాక వెళ్ళకపోతే తప్పంతా నీదేఅవుతుంది. వెళ్ళిరా అక్కయ్యా" అన్నది రాధ.

# 11

[illegible]వారం సెలవుపెట్టి ఆదివారం ఉదయమే కాకినాడ వెళ్ళాను.

రిక్షాలో బావగారింటికి వెళుతుంటే దారిలో [illegible] కనిపించారు. మనిషిలో బాగా మార్పు కనిపించింది. పిల్కాలాల్చీ, తెల్లపై [illegible] మరింత అందాన్నిచ్చే కళ్ళజోడు చాలా అందంగా కనిపించారు.

వార్ని చూపిరిక్షాలోంచి దిగుతుంటే, నన్నుచూసి విస్తు పోయారు.

"సుభా, ఎమిటిల్లా వచ్చావ్ అంతా కులాసా" నేనేందుకు వచ్చానా అన్నట్లుగా నావైపు ఇబ్బందిగా చూస్తూ అన్నారు.

"ఇంటికి వెళదాం, పదండి"

ఇంటికి వెళ్ళేసరికి బావ పేపరు చదువుతూ పడుకున్నారు. నన్ను చూడగానే పేపరు అవతల పడేసి, "అనుకూల దాంపత్యమంటే మీదమ్మా సుభాషిణి. నెలయిందో లేదో భర్తను చూట్టానికి ఆదర్శ గృహిణివి కనుక నువ్వేవచ్చేశావ్ పిల్లలిద్దరూ కులాసానా".

ఆప్యాయంగా పలకరించినట్లే ఉన్నాయి బావ ముఖ కవళికలు, వారు కూర్చుంటే నేనూ కూర్చుందా మనుకున్నా కాని వారు కూర్చోలేదు.

"ఎందుకొచ్చావు సుభా, నేను ఈ మాత్రం వుంటం కూడా ఇష్టం లేదా నీకు"

సిగరెట్ పెట్టెతీసి సిగరెట్ తీసుకుని వెలిగించేరు. ఎప్పుడూ కాల్చే సిగిరెట్ కాదు. ఇప్పుడు గోల్డుఫ్లేక్ కాలుస్తున్నారు. వారికి ఏ రకమైన కంటి జబ్బూలేదు. ఆ కళ్ళద్దాలున్న వార్ని చూస్తుంటే జమీందారులా ఉన్నారు. ఒక్క నెలలోనే ఇంత మార్పు, జీతమంతా ఆయనే ఖరు పెట్టుకుంటున్నారు. ఇంటిదగ్గర ఇంతవుండికీ నా జీతం చాలక నేను సతమతమై పోతున్నాను.

"ఇష్టంలేదని మీరనుకుంటున్నారు, నా మీద ఇంత కార్పణ్యం ఎందుకు పెంచుకుంటున్నారో నాకు తెలీకపోయినా మీ మీద నాకు ఏ కోపమూలేదు. జరిగిందేదో జరిగిపోయింది. తప్పంతా నాదే, మీరు కోరుకునే సుఖాలకు నేను ఏ అడ్డూ చెప్పను, నా కోరిక ఒక్కటే, కనీసం ఆ ఒక్క కోరిక తీర్చమని మిమ్మల్ని వేడుకుందామని వచ్చాను." ప్రాధేయపడుతూ అడిగాను.

"ఏమిటా కోరిక"

"వెంట వెంటనే ఉత్తరం రాయండి. వీలయినప్పుడల్లా వచ్చి పిల్లల్నిచూచి వెళ్ళండి. పెద్దవాడు మీ కోసం దిగులు పడ్డాడు."

"అట్లాగే నాకు పనుంది వెళ్ళాలి. క్యారియర్‌తో భోజనం పంపిస్తాను. భోజనంచేసి మధ్యాహ్నం బస్సులో వెళ్ళిపో" అని వెళ్ళిపోయారు.

వారి ప్రవర్తనకు మనస్సు తల్లడిల్లి పోయింది. ఎంత కఠిన మనస్కుడైనా ప్రత్యేకం ఊరినుంచి వచ్చిన భార్యతో పది నిమిషాలుకూడా మాట్లాడానికి ఇష్టపడని భర్త వీరొక్కరేనేమో. పైగా అక్కయ్యలేని ఆ ఇంట్లో కోర్టులో విడాకుల దావా జరుగుతున్న ఆ తరుణంలో. బావ ఒక్కడే ఉన్న ఆ సమయంలో, వారట్లా వెళ్ళిపోయారంటే ఆ మనిషి స్వభావాన్ని ఎట్లా అర్థం చేసుకోవాలో ఆలోచించలేక పోయాను.

"బాత్ రూంలో నీళ్ళున్నయ్యి స్నానం చెయ్యి సుభాషిణీ.ఈలోగా నేను వెళ్ళి పాస్కుతో కాఫీ తెస్తాను" అని బావకూడా వెళ్ళిపోయాడు. నా లోని ఆందోళన కాస్త తగ్గింది.

"బాత్ రూంలోకివెళ్ళి స్నానంచేసి వస్తుంటే పక్కింటి ఆవిడ పలకరించింది. క్రితంసారి నేనూ, వారూ వచ్చినప్పుడు ఆవిడ్ని చూశాను అప్పుడు మాట్లాడే సావకాశం లేకపోయింది.

"మీరు శ్రావణ కుమార్‌గారి భార్యా"

"అవునండీ."

"రాజమండ్రిలో ఉద్యోగమా".

అవునన్నట్లుగా తల ఊపాను.

ఆవిడ పెద్దది. ఏభై యేళ్ళుంటయ్యేమో. బావగారింట్లో అద్దెకుంటున్నారు.

"బట్టలు కట్టుకుని ఓ సారి మా ఇంటికి రామ్మా" అని ఇంట్లోకి వెళ్ళిపోయింది. బట్టలు కట్టుకుని ఆవిడ పిల్చిందని వెళ్ళిపోతుంటే బావ ఫ్లాసుక్‌తో కాఫీ తీసుకుని వచ్చాడు. దగ్గర్లోనే హోటలున్నట్లుంది.

ఇద్దరం కాఫీ త్రాగాం.

"ప్రతివాది నా సంరక్షణలో ఉన్నా వాది ఇంట్లో ఆ ం స్వీకరిస్తున్నాను. మీ తమ్ముడుగారు ఇక్కడే ఉంటున్నారుకదూ బావతో అన్నాను.

"ఆహా, ప్రస్తుతం మా ఇద్దరి జీవితాలూ ఒక రీతిగానే ఉన్నయ్యి. జాతక ప్రకారం" ముభావంగా అన్నాడు బావ.

"మా విషయాలు మీతో ఏం చెప్పారు." అడక్కూడదను కుంటూనే ఆశ చావక కుతూహలంకొద్దీ అడిగాను

"మీ కుటుంబంతో నా కున్న కోర్టు వ్యవహారాలరీత్యా నువ్వడిగిన ఏ ప్రశ్నకయినా నేను సరైన సమాధానం చెప్పకూడదు. నా పరిస్థితీ వైవాహిక జీవితమూ వేరు, మీ దాంపత్య జీవితంయందు నాకు పరిపూర్ణమైన గౌరవం ఉన్నది. భార్య తెలివితక్కువచేత నా జీవితం మరో మలుపు తిరిగింది. అందుకు నేను విచారపడినా ప్రయోజనం శూన్యం. కాని నువ్వు తెలివికల దానివైనా కుమార్ ఈ తీరుగా చెడిపోతున్నాడంటే అది అతని తెలివితక్కువ తనంకాదు నీ దురదృష్టం."

తన కుడి అరిచేతిలోని రేఖల్ని చూసుకుంటూ కూర్చున్నాడు బావ. నాకు దూరంగావుంటే వారింకా చెడిపోతారని నాకు తెల్సు. బావ చెప్పిందాన్నిబట్టి నా ఊహ సరైనదే అయింది. నా మనస్సులో ఒక రకమైన నైరాశ్యమూ, వ్యధతా చోటు చేసుకున్నాయి మనిషితత్వం తెల్సినా చెడిపోతున్నారంటే విని చేసేది లేకపోయినా ఎంతో బాధ కలుగుతుంది.

"ఇక్కడ వారెట్లా ఉంటున్నారు బావా."

"బాగా లంచాలు మరిగాడు. విలాస పురుషుడు. బాటిల్స్ బాగా ఖాళీ అవుతున్నాయి. ఇంతకన్నా మరేం కావాలి. సౌమ్యా అన్నీ తెల్సి

ఆచరిస్తున్న వాడివే. కాని నాకు ప్రత్యేకించి ఏ బాధ్యతలూ లేవు. అతను తనకున్న అన్ని బాధ్యతల్నీ విస్మరించి ప్రవర్తిస్తుంటే నేనూ బాధపడుతూనే ఉన్నాను."

ఇంక అక్కడ కూర్చోబుద్ధి పుటలేదు. పక్క భాగంలోకి వెళ్ళాను.

"వచ్చావామ్మా, ఈ పూట నువ్విక్కడే భోజనం చెయ్యాలి. తల్లిలాంటిదాన్ని. కాదనకు" చేతులు పుచ్చుకుని బ్రతిమాలుతున్నట్లుగా అన్నది.

"సరేనండీ" అన్నాను.

అక్కయ్య సంగతీ, కోర్టు వ్యవహారాల విషయం, అమ్మ ఆరోగ్యం సంగతీ, అన్నయ్య జైలుశిక్ష సంగతీ అన్నీ అడిగిందావిడ. అన్నీ చెప్పాను.

"మీ బావ పాడైపోతున్నారంటే మేం అట్టే బాధపడటంలేదు. ఆ జీవితం ఇక బాగుపడదు. అలాంటి వ్యసనాలకే అలవాటు పడింది కాని మీ ఆయన మీ బావమూలంగా చెడిపోయాడు. అందుకనే ఇంత బాధపడుతూ చెప్పుతున్నాను. నీ భర్తను నువ్వు కాపాడుకో తల్లీ. చెయ్యి దాటిపోయాక ఎంత బాధపడా లాభంలేదు" అన్నదావిడ.

క్యారేజీ పంపిస్తానన్నవారు పంపలేదు సరికదా ఆ పగలల్లా ఇంటికి రానేలేదు. బావ ఎక్కడికో వెళ్ళిపోయాడు. ఆ మధ్యాహ్నం పక్కింటి వాళ్ళింట్లోనే భోజనం చేశాను.

రాత్రి ఎనిమిది గంటలకు వారొచ్చారు. "అరే. నీ సంగతే మర్చిపోయాను సుమా. వెరీ సారీ, ఇట్టా పద హోటల్‌కువెళ్ళి భోజనంచేసి వద్దాం. అన్నట్లు మధ్యాహ్నం ఎక్కడ భోం చేశావ్. మీ బావ ఎక్కడికి వెళ్ళాడో".

ఆ మాటల్ని వింటుంటే నాకు తల పగులకొట్టుకుని చావాలని పించింది. పొద్దున్న నగానట్చిన భార్యకూడా, స్మరణకు రానంత దావ

కార్యం ఏమిటో నాకు తెలీలేదు. వార్ని చూస్తుంటే నా హృదయం ముక్కలైపోయింది. "భార్యవచ్చిన సంగతికూడా మర్చిపోయానంటు న్నారు అది నా ముఖారవిందమా లేక నన్ను ఇంకా ఏడిపించాలనే అట్లా అంటున్నారా".

ఆ ముఖంలో నిర్లక్ష్యం. అసూయ కనిపించాయి.

"ఈ ఊళ్ళో నాకు అనేక పనులు, మనస్సు పరిపెట్టుకోటానికి అనేక విషయాల్లో తలదూర్చాను, అవన్నీ వింటే నువ్వు నన్ను ఇంకా అసహ్యించుకుంటావు మళా, పద హోటల్‌కు వెళ్దాం" తను ముందే వాకిట్లోకి వెళ్ళి నిల్చున్నారు. వెలుపలికివెళ్ళి పిలిచాను. లోపలికి వచ్చారు.

"తాళం ఎక్కడుందో చూడండి బావ లేరుకదా"

"సారీ, నేనివాళ అన్నీ మర్చిపోతున్నాను" అంటూ తాళంవేశారు. ఇద్దరం బయలుదేరాం. ఒక పెద్ద హోటల్‌కు తీసుకు వెళ్ళారు. ఎయిర్ కండిషన్ హాల్లోకి వెళ్ళాం. భోజనం టిక్కెట్లు తీసుకున్నారు, దాదాపు పాతిక మందికి పైగా భోజనం చేస్తున్నారు.

వారి పక్కన నేను కూర్చున్నాను, అటుపక్క సీటు ఖాళీ అయింది. టేబుల్ క్లీన్ చేశాక ఇంకెవరోవచ్చి కూర్చున్నారు. అతను వారి స్నేహితుడేమో ఇద్దరూ గుడ్‌నైట్ చెప్పుకున్న తరువాత అతనన్నాడు,

"హు ఈజ్ దట్ న్యూ బర్డు". అని నావైపుచూసి పళ్ళికిలించాడు,

అతని దృష్టిలో నేనొక కొత్త పిట్టని. విసటో చెయ్యిపెట్టి కళ్ళు మూసుకుని పెద్దం చేత్తో కణతలు నొక్కుకుంటూ కూర్చున్నాను. కళ్ళు తిరిగిపోతున్నయ్యి.

"షి ఈజ్ మై వైఫ్ ప్లీజ్" నెమ్మదిగా అన్నారు,

"వెరీ సారీ బ్రదర్."

గ్లాసుడు మంచినీళ్ళు తాగి వాష్ బేసిన్‌లో చెయ్యి కడిగేసుకున్నాను. ఇవతలకువచ్చి కుర్చీలో కూర్చున్నాను. అతనన్న మాటకు అతనిమీద నాకే మాత్రం కోపంరాలేదు. వారిమీద జాలి కలిగింది. వారు పూర్తిగా పరస్త్రీ లోలురై పోయారన్నమాట. వారి పక్కన భార్య ఉన్నా చెల్లెలు ఉన్నా మరొక బంధువు ఉన్నా ఇతరుల దృష్టిలో ఆ వ్యక్తి వారి తాలూకు ఉంపుడు కత్తె. అంటే తాళికట్టిన భార్యకూడా వారి పక్కన ఉంటే వారు తీసుకొచ్చిన విలాసవతి అయిపోతుంది. ఈ సంఘటనతో నా మనస్సు పూర్తిగా దెబ్బతిన్నది. అంధకారంతో నిండిపోయింది. వారిక బాగుపడరు. నా జీవితంలో వెలుగు ప్రసరించదు.

వారు భోజనంచేసివచ్చి "అదేమిటి సుభా, అన్నం తినకుండా వచ్చేశావేం" అన్నారు.

"ఆకల్లేదు. ఇక పదండి పోదాం"

రిక్షాలో ఇంటికొచ్చాం. బావరాలేదు, నేను వచ్చానని ఏ స్నేహితుడింటికయినా వెళ్ళాడో, లేక తన చెల్లెలింటికి వెళ్ళిపోయాడో తెలీదు. తాళంతీసి ఇంట్లోకి వెళ్ళగానే నాకు కళ్ళు తిరిగాయి. మంచంమీద పడుకున్నాను. కడుపులోకాదు మనస్సులో వికారం పెడుతున్నది.

మంచంమీద నా పక్కన కూర్చున్నారు.

"సోడా తాగుతావా సుభా."

"వద్దండీ, కాస్త వళ్ళు తూలింది అంతే."

"కళ్ళు మూసుకుని పడుకో" సిల్కు లాల్చీ, పైజమావిప్పి లుంగీ కట్టుకుని ఈజీ చైర్లో పడుకుని సిగరెట్ వెలిగించారు.

"ఇటా మంచంమీద కూర్చోండి." కుర్చీలోనుంచి లేచి మంచం మీద కూర్చున్నారు.

"మీ పక్కన భార్య ఉన్నా మీ స్నేహితుల దృష్టిలో నేను లేచి వచ్చినదాన్నేకదూ" కళ్ళల్లో నీళ్ళు తొణికిసలాడాయి.

"తెలివివాళ్ళు అట్లాగే అనుకుంటారు, బాధపడకు. వ్యక్తిగతంగా నా గౌరవం ఎంత దిగజారి పోయిందో కళ్ళారా చూశావుగా సుభా! మంచి చెడ్డలూ విచక్షణా జ్ఞానమూ నాకు లేకపోలేదు. నేను వ్యభిచారిని, త్రాగుబోతుని. లంచగొండిని నేను చేసేది ప్రతిదీ తప్పని నాకు తెల్సు. కాని ఏదీ మానుకోలేక పోతున్నాను. అది నా మనో దౌర్బల్యమో, జాతక ప్రభావమో. నిర్లక్ష్య స్వభావమో ఏదయినా కానీ ఏదీ నేను మానుకోలేను" అన్నారు,

"భార్యా బిడ్డల్ని మర్చిపోయారా" పరుషవాక్యాలు అనదల్చుకో లేదు.

"లేదు, ఉన్నారని నాకు తెల్సు"

"మాకోసం కాకపోయినా మీ ఆరోగ్యం కోసమైనా ఈ వ్యసనా లను మానుకోలేరూ."

"నా లాంటివాళ్ళు లేకపోతే ఈ డాక్టర్లెందుకు సుభా"

"ఏమిటీ వైద్యం చేయించుకుంటున్నారా. ఆరోగ్యం బాంగుడ లేదా" మంచంమీద లేచి కూర్చున్నాను.

"వ్యసనాలున్నవాళ్ళు వాళ్ళ ఆరోగ్య విషయం తప్పకుండా శ్రద్ధ తీసుకుంటారు."

"ఈ రకంగా మీరు ప్రవర్తించి నా మనస్సునీ, హృదయాన్నే కాదు నా జీవితాన్ని పొడిచి పొడిచి చంపుతున్నారు. ఈ రంపకోత నేను భరించలేను. మిమ్మల్ని కొట్టిన ఈ చేతులు చూడండి. నేనే వాతలు పెట్టు కున్నాను. పుండు మానినా మచ్చపోలేదు" నన్ను క్షమించండి ప్రభూ క్షమించండి" అని భోరున ఏడుస్తూ వారి కాళ్ళమీద పడ్డాను. మంచం కోటికేసి తల బాదుకున్నాను. బ్రతిమాలుకున్నాను, ఇంతచేసినా వారు మాట్లాడలేదు. ఆ హృదయం కరుడుగట్టిపోయింది. ఈ శోక సంతప్త హృదయానికి ఒక్క శాంతి వచనంకూడా లేదు.

"ఏడవకు సుధా, లే. నీ ఏడుపుకు ప్రయోజనంలేదు. నా మన స్సుకు మాన్పరాదు. పుట్రెకు పుట్టిన ఈ ఖద్ది పుడకలతో కాని పోదు. రేపే వెళ్ళిపో."

"స్వామీ నా కెందుకీశిక్ష" అని ఆ రాత్రి తెల్లవార్లూ వార్ని ప్రాదేయపడి బ్రతిమాలుతూ ఏడుస్తూనే వున్నాను. నా ఏడుపుగాని, కుమిలింపుగాని, అర్థించి అడిగే మాటలుగాని వారి మనస్సుకు పట్టవేలేదు.

మర్నాడు ఉదయమే పుట్టెడు దుఃఖాన్ని మూటగట్టుకుని రాజ మండ్రి వచ్చేశాను.

అమ్మా అత్తయ్యా ఆదుర్దాగా అడిగారు. ఎంత ఆదుర్దాగా ఎన్ని కోరికలతో వెళ్ళానో అంతకు పదిరెట్లుగా అన్ని కోరికల్ని చంపుకుని తిరిగి వచ్చాను.

రాధ కొన్ని ప్రశ్నలు వేసింది. సమాధానాలు చెప్పాను.

"అన్నదమ్ములిద్దరూ ఒక తాటిమీదనే నడుస్తున్నారా?"

"ఆ. ఇద్దరికీ భార్యల అవసరంలేదు. ఒకర్ని మించినవారు మరొకరు"

"నువ్వుకూడా కాకినాడ బదిలీ చేయించుకుంటానని చెప్పావా."

"చెప్పాను. అప్పుడు వారు అమలాపురం వెళ్ళిపోతానన్నారు. అసలు భార్యతో కాపురం చెయ్యటమే వారికి ఇష్టంలేదు. నేనున్న ఊళ్లో వారు ఉండర్లుట."

"ఈ ఖర్చులకు డబ్బు"

"జీవితమంతా ఖర్చుచేస్తున్నారు. బాగా సంపాదిస్తున్నారని ఆనంద రావు చెప్పాడు"

"దీనికి ఒకటే మార్గం. నీ కాపురం బాగుపడాలంటే ముందు మీ అక్కయ్య కాపురం బాగుపడాలి. అది జరగాలంటే మనందకు మనం

బాగా చదువుచెప్పి మనిషిగా తయారు చెయ్యాలి. ఒకటి రెండేళ్ళు ఈ బాధలన్నీ పడాల్సిందే."

మనస్సు రాయిచేసుకుని రోజులు గడుపుతున్నాను. ఒకరోజు ఉదయం జైలునుంచి విడుదలై అన్నయ్య వచ్చాడు. చాలా భయంకరంగా ఉన్నాడు. సంస్కారంలేని జుట్టు బాగా పెరిగిన గడ్డం, కళ్ళు పీక్కుపోయి ఎర్రగా జ్యోతుల్లా ఉన్నాయి క్రౌర్యంగాచూసేచూపు. పిల్లలిద్దరూ చూసి భయంవేసి నన్ను కౌగలించుకుని కళ్ళు మూసుకున్నారు. రాగానే అమ్మను పలకరించి కళ్ళనీళ్ళు పెట్టుకున్నాడు. అయిదు నిమిషాలు ఎవరం మాట్లాడలేక పోయాం. వాణ్ణి చూస్తుంటే వాడి పరిస్థితికి జాలీ, సాను భూతీ కలిగినా వాడి మన స్తత్వానికీ, గడిపే జీవితానికీ అమ్మ కుమిలి కుమిలి ఏడ్చింది. అక్కయ్య గ్రమాన్పడిచూస్తూ కూర్చుంది. వాడిని ఎట్లా పలకరించాలో అత్తయ్యకు అర్థంకాక అవతలకు వెళ్ళిపోయింది.

ఒక పక్కన కుర్చీలో కూర్చున్నాడు. పిల్లలిద్దరూ నా వళ్ళో కూర్చున్నారు మావయ్యగా వాడిని పరిచయంచేసి చెపుదామని మనస్సులో ఉన్న మాటలు పెగిలి రాలేదు.

ఇన్నాళ్ళూ జరిగిన సంగతులన్నీ అమ్మ అన్నయ్యతో చెప్పింది. అమ్మ చెప్పిందంతా విన్నాడు.

"ఈ పరిస్థితిలో నువ్వు ఎప్పుడు వస్తావోనని వెయ్యికళ్ళతో ఎదురు చూస్తున్నాను. మా ఇద్దర్నీ ఇకనుంచి పోషించవలసిన బాధ్యత నీది. మా నుంచి సుభాకూడా ఎన్నో బాధలు పడుతున్నది. మనం విడిగా ఉందాంరా వాణీ నాథం"–ఒక నిర్ణయానికి వచ్చినట్లుగా చెప్పింది అమ్మ.

అవనత వదనుడై కూర్చున్న అన్నయ్య ఎర్రగా ఉన్న ఆ కళ్ళు తుడుచుకుని ఒక్క నిట్టూర్పు విడిచి అన్నాడు.

"అమ్మా, నే చెప్పేది బాగా విను, నాకా చదువులేదు. సంఘంలో మంచి పేరులేదు, నేను మోసగాడిని. జూదరిని, చెప్పరాని వ్యసనాలున్న

వాడిని. నన్ను చూసినవాళ్ళు కోపంతో, క్రోధంతో అసహ్యించుకుని తిడుతూ వెళ్ళిపోతారేగాని నాతో అయిదు నిముషాలుమాట్లాడ్డానికి ఎవరూ సాహసించరు. గౌరవ మర్యాదలు కలవారెవరూ నాతో మాట్లాడరు. నా జీవితమూ ప్రపంచమూ, నా సంపాదనా వేరు. ఒక సామాన్యునికన్నా ఎక్కువే సంపాదిస్తాను. కాని నా మీద ఎంతో నిఘా, ఎప్పుడు మళ్ళీ జైలుకు వెళతానో నాకే తెలీదు. ఇటువంటివాణ్ణి కన్నతల్లిగా నువ్వు నన్ను కొడుకని చెప్పుకున్నందువల్ల నీ కున్న గౌరవమర్యాదలు పూర్తిగా పోతాయమ్మా- పూర్తిగా మంటకలిసి పోతయ్యి. ఎప్పుడు ఎక్కడ ఉంటానో తెలీదు. ఇంటికి వస్తానో రానో, రాగలనో లేదోకూడా తెలీదు. గౌరవంగా బతుకుతున్న మీరు నా పోషణలో ఉంటే మీకు దిన దిన గండం గానే ఉంటుంది. అంతే కాదమ్మా అక్కయ్య నా ఆదరణలో వుంటం మంచిది కాదమ్మా. ఇంతకన్నా ఎక్కువ చెప్పగలిగినా చెప్పకూడదు."

అమ్మ మనస్సులో గూడుకట్టుకున్న ఆశలు చెల్లాచెదరై పోయాయి, అక్కయ్య అవతలకు వెళ్ళిపోయింది. ఇన్ని భావాల్ని వెలి బుచ్చాక వాడి ముఖం చూస్తుంటే గొంతు పిసికి మెళ్ళో ఉన్నవి లాక్కు పోతాడేమోనన్నంత భయం కలిగింది.

తీక్షణమైన వాడి చూపుల్లో కోపమూ, క్రోధమూ ఈ సంఘంమీద దెబ్బ తీయాలనే పట్టుదలా. క్రౌర్యమూ ప్రస్ఫుటంగా చూశాను. వాడు బాగుపడి గౌరవంగా జీవించగలడనే నమ్మకం పూర్తిగా పోయింది.

"ఇదంతా నీ ప్రోద్బలమేనా సుభా" వాడి చెయ్యి మీసాలమీదికి వెళ్ళింది. గజదొంగలా, రౌడీలా, హంతకుడిలా నా వైపు చూశాడు. నా మీద అంతగా ఎందుకు కక్ష కట్టాడో నాకు తెలీదు. నాన్న బ్రతికున్న రోజుల్లో ఆనాటి సంఘటన వాడి మనస్సులో శాశ్వతంగా నిల్చిపోయి నట్లుంది. నా మీద వాడికింత కార్పణ్యం ఏర్పడ్డానికి అదే కారణ మేమో.

"నా ప్రోద్బలంకాదు. అమ్మ కోరిక" పిల్లలవైపు చూస్తూ తల వంచుకుని అన్నాను. అన్నయ్యకు నా మీద ఉన్న కోపం ఇంత కక్షగా మారిందని నాకు తెలీదు.

"సుభా నువ్వు చదువుకుని గౌరవంగా ఉద్యోగం చేసుకుంటున్నావ్. బాగా అర్థం చేసుకో. నాన్న పోయాక అమ్మనూ, అక్కయ్యనూ పోషించవలసిన బాధ్యత నాది. కాని ఈ సంవత్సరమంతా వాళ్ళను నువ్వే పోషించి కూతురుగా నీ బాధ్యతా నిలబెట్టుకున్నావ్. అందుకు నిన్ను అభినందిస్తున్నాను. వాళ్ళను పోషించవలసిన బాధ్యత నాదయినా పరిస్థితి పూర్తిగా చెప్పాను కనుక వాళ్ళను నా సంరక్షణలో వుంచే ప్రసక్తిలేదు. వాళ్ళిద్దరూ యిక్కడే వుంటారు. వాళ్ళకు గౌరవ ప్రదమైన చోటు ఇదే. నా సంపాదనా క్రమమైనదో అక్రమమైనదో, దొంగ సొమ్మో దొర సొమ్మో నీకు అనవసరం. ప్రతి నెలా వాళ్ళిద్దరి పోషణకుగాను వంద రూపాయలు పంపుతాను. పంపటమేకాదు. నేనే వచ్చి ఆ డబ్బిచ్చి వెళ్ళిపోతాను సరే వస్తాను. నేను చాలాసేపు ఇక్కడ కూర్చోటం నీకూ మంచిది కాదేమో. వెళ్ళొస్తానమ్మా" అని వెళ్ళిపోయాడు.

నిశ్చేష్టురాలై నోట మాట రాక నిలబడి పోయింది అమ్మ. పిల్లలిద్దరూ నా పక్కనుంచి లేచి కూర్చున్నారు. "ఆ బూచాడు వెళ్ళాడా అమ్మా" అని భయంతో అడిగాడు పెద్దవాడు.

నా జీవితం ఇంత దారుణంగా ఉన్నదేమా అని బాధపడుతూ రెండో వాణ్ణి సముదాయిస్తూ కూర్చున్నాను.

# 12

రాధకు ఉద్యోగం దొరికింది. ఒక మందుల కంపెనీలో అసిస్టెంట్‌గా చేరింది. అమ్మాయి మాటల చాతుర్యం, చొరవచూసి ఉద్యోగం ఇచ్చారు. జీతం నెలకు నూట ఏభై రూపాయలు.

ఆ రోజున అన్నయ్య జైలునుంచి ఇంటికి వచ్చినప్పుడు రాధ ఇంట్లో లేదు.

మొదటి నెల జీతం రాగానే మా ఇంటికి దగ్గరలోనే ఒక చిన్న భాగం అద్దెకు తీసుకుని తల్లినీ, చెల్లెల్నీ తమ్ముళ్లిద్దర్నీ రాజమండ్రి తీసుకు వచ్చింది. రాధా వాళ్ళుకూడా దగ్గర్లోనే ఉండటం నాకూ సంతోషంగానే ఉన్నది. నా ట్రాన్స్‌ఫరు పిటీషన్‌మీద కాకినాడ బదిలీ చెయ్యటానికి వీల్లేదని ఆర్డర్లు వచ్చాయి. ఆ ప్రయత్నంకూడా వారే చేశారనే విషయం తరువాత తెల్సింది.

అక్కయ్య అయిదో క్లాసు పుస్తకాలు పూర్తిచేసింది. దాని మాటల ధోరణీ, వెకిలితనమూ కాస్త తగ్గినట్లే కనపించాయి. కాని పూర్తిగా పోలేదు. రాధ ఉపదేశాలుకూడా అక్కయ్య మనస్తత్వానికి టానిక్‌లా పనిచేశాయి. వారి వద్దనుంచీ ఉత్తరాలులేవు. బాగా డబ్బు సంపాదిస్తున్నారనీ పార్టీలను పిలుస్తున్నారనీ ఆఫీసులో రామారావుగారు చెప్పేవారు.

చెప్పినట్లుగానే అన్నయ్య నెల మొదటివారంలో ఏ రాత్రి పూటో ఉదయమో వచ్చి వంద రూపాయలూ ఇచ్చి వెళ్ళిపోయేవాడు.

ఇట్లా నాలుగుమాసాలు గడిచాయి. కష్టాలకయినా కార్పణ్యాలకయినా కొంత సమయమూ సందర్భమూ ఉంటాయి. జీవితానికి కనుచూపు మేరలో ఈ కష్టాల సంకెళ్లు విడిపోయేటట్లు లేవు.

ఒక రోజున విసుగె త్తి అమ్మతో పోట్లాడాను. ఆ రోజు అది వారం ఏమిటో గుబులు దొర్లింది రాధకూడా మా ఇంట్లోనే ఆ సమయంలో ఉన్నది. మాట్లాడకుండా అన్నీ వింటూ కూర్చుంది. అత్తయ్య గృహ్యో పురాణానికి వెళ్ళింది. ఈ సంసార పరిస్థితి చూసి ఆవిడ మరీ బాధతో కుమిలిపోతూ వీలు చిక్కినప్పుడల్లా గుళ్ళోకి వెళ్ళి కూర్చునేది. అక్కయ్యకు పాఠాలు చెప్పుతున్నది రాధ.

"నీ కడుపున మేం నలుగురం ఏ సుముహూర్తాన పడ్డామో కాని అందరి జాతకాలూ అధోగతిలోకే లాక్కుపోయాయి. నీ కడుపు చలవ అంతటిది. బిడ్డల అదృష్ట మరద షాలకు కారణం కొంత తల్లి దండ్రుల కర్మనుబట్టి కూడా ఉంటుందేమో. నీ సంతానంలో ఎవరి జాతకాలూ బాగున్నదక్షపోవడమ్మా ఆలోచిస్తే ఆశ్చర్యంగానే ఉంటుంది" అన్నాను.

అమ్మకు కాస్త కోపం వచ్చింది. కేవలం కోపమేకాదు. కరుడు కట్టుకుపోయిన ఆవేదన ఇదివరకు ఏ మాటన్నా అమ్మ ముఖాన వీళ్ళ కుంత ఉండేది. ఆ కళ్ళల్లో ఎప్పుడూ కన్నీరు కాపురం చేసేది. ఆరోజున జైలునుంచి అన్నయ్య వచ్చి వెళ్లాక ఆ కళ్ళను కాటేసి కన్నీరు వెళ్ళిపోయింది. ఆ చూపులో ఆత్మీయత లేదు. ఈ జీవితాలు ఇంక బాగుపడవనే దృఢ విశ్వాసం అమ్మ మనసులో ఇల్లు కట్టుకుని కాపురం చేస్తున్నది.

"అవునమ్మా నా మనస్సులోని బాధ అదే కాకపోయినా ఏ భావాలు లేకయినా కాపురం చేసి బిడ్డల్ని కనటమే తెలుసుకున్నాని వాళ్ళ కర్మను కనటం తెలిసి. మీ ముగ్గురికన్న ఆ తప్పిపోయిన తమ్ముడే అదృష్ట వంతుడేమో. అంచేతనే ఆ భగవంతుడు ఈ నష్టజాతకుల కూటమినుంచి వాణ్ణి తప్పించాడు"

"పుట్టగానే వడ్లగింజవేస్తే ఈపాటికి నేమ్మ ఇంకో అమ్మ కడుపున పుట్టి అష్టైశ్వర్యాలతో తులతూగుతూ ఉండేదాన్ని. మాతోపాటు మా దురదృష్టాన్ని కూడా నువ్వే పెంచావమ్మా" అన్నది అక్కయ్య.

అంత బాధలోనూ అమ్మకు నవ్వొచ్చింది. "నీకూ కాస్త తెలివి తేటలు అబ్బుతున్నయ్యే. ఈ తెలివితేటలు మరింత వృద్ధయి నీ కాపురానికి నువ్వు వెడితే నేను ఏ దిగులూ లేకుండా కళ్లు మూస్తానే సునందా. అన్నయ్య బాగుపడాలంటే వాడు మరో జన్మ ఎత్తాల్సిందే. సుభాషిణి కాపురం బాగుపడాలంటే ఆయన బుర్రలోవున్న పురుగు తొలిగిపోవాలి. అవునుగానీ, సుభా అతనెట్లాగూ ఉత్తరం రాయడు నువ్వయినా ఒక ఉత్తరం రాయకూడదుటే' కేకలేసినట్లుగా అన్నది అమ్మ. ఈ మాటలతో నాకెందుకనో కోపం వచ్చింది. తప్పంతా నాదే నన్నట్లుగా మాటాడుతుందన్ని నేనూ తప్పుగానే అంచనా వేశాను.

"ఉత్తరాలతో కాపురాలు బాగుపడతాయిటే అమ్మా. పెళ్ళికాని చిన్నవాళ్ళకు ప్రేమలేఖలు సంధాన కర్తలయి పెళ్లి పీటలమీదికి లాక్కుపోతయ్యేమోగాని, దూరమయిన కాపురాల్ని ఉత్తరాలు దగ్గరకు చేర్చలేవు. పైగా అర్థిస్తూ ఉత్తరాలు రాసినకొద్దీ ఈ మగవాళ్ల మనస్తత్వం రబ్బరు బెలూనులా మరికాస్త పైకి పోతుంది."

అంతవరకూ ఏం మాటాడకుండా వింటూ కూర్చున్న రాధ తల అడ్డంగాతిప్పుతూ నావైపు చూసి "ఆ రబ్బరు బెలూనుకు ఒక సూదిమొన తాకితే పేలిపోయి అదే కిందపడుతుంది, అందుకు ఉత్తరం కూడా ఒక సాధనమే సుభాషిణీ' అన్నది.

"అయితే ఆ ఉత్తరమేదో నువ్వే రాసివ్వు నేను సంతకం చేస్తాను" కాస్త విసుగ్గా అన్నాను.

ఆ మర్నాడే ఒక ఉత్తరంరాసి తెచ్చింది రాధ. చదివి సంతకం పెట్టి పోస్టులో వెయ్యమన్నది ఉత్తరం చదివాను.

రాజమండ్రి

శ్రీ శ్రీవారికి,

శ్రీవారినుంచి చిత్తగించవలెను వరుకూ ఈ ఉత్తరం చదువుతారు కదూ

అంతా కులాసా, కాకపోయినా కులాసాగా వున్నట్లు నటిస్తున్నాము. నటన, నడవడి ప్రతివారికీ రెండు భుజాల లాంటివి. ఈ రెండూ లేకపోతే అసలు చేతులే వుండవుకదా.

సుఖాన్ని ప్రతి మనస్సు, శరీరమూ ఎల్లప్పుడూ కోరుతూనే ఉంటాయి కాని ఆ సుఖానికే అనేక రకాలయిన గీటురాళ్లు. అంటే ఎవరి ఉద్దేశమే వారికి గీటురాయి. ఆ గీటురాయి ఆధారంగానే ఈ ఉత్తరం రాస్తున్నాను.

సత్ప్రవర్తన, సచ్ఛీలమూ, ధర్మమూ అనేవి స్త్రీ పురుష లిరువురికీ కావలసినవి. వీటిని దృష్టిలో ఉంచుకునే వాటి మనుగడను కాపాడుకుంటూ మానవుడు సంచరిస్తేనే అతని మనుగడ కీర్తి ప్రతిష్ఠలతో విరాజిల్లుతుంది.

మన పెళ్లికిముందు నామీద మీరూ, మీమీద నేనూ ఎన్నో ఆశలూ అభిప్రాయాలూ పెంచుకున్నాం. భార్యా భర్తలు పడుగుపేకల్లా అల్లుకుపోతేనే ఆ సంసారం రాణించేది.

మితిమీరిన మనస్తాపంతో ఇక్కడ భార్యాపిల్లలు అలమటిస్తుంటే అంతకన్నా పదిరెట్లు మిన్నగా మీరు తాత్కాలిక సుఖలాలసత్వంలో మునిగిపోయారు. సుఖ దుఃఖాలు కాపురంలో కలతలు లేకుండా అనుభవిస్తుంటే చూసేవాళ్లూ, వినేవాళ్లు కూడా ఆదరాభిమానాలతో అర్థం చేసుకుంటారు. కాని మన పరిస్థితి అందుకు విరుద్ధంగానే ఉన్నది. "కలసి వుంటే కలదు సుఖం" అనే సామెత అనుభవయోగ్యమే కాని అర్థరహితం కాదు. మంచయినా చెడయినా మనస్సుకూ, శరీరానికీ పూర్తిగా వడితేనే కాని ఎవరికయినా సరే కనువిప్పు కలుగదు.

మీరు పుష్కలంగా డబ్బు సంపాదించండి. రోజుకొక కొత్త పిట్టను పట్టండి. సీసాలు ఖాళీ చెయ్యండి శరీరంలో జవసత్వాలున్నంత వరకూ ఈ అనుభవాలనుంచి మీరు బయటపడలేరు ఆ రోజు వస్తే

ందరూ మిమ్మల్నే బయటపడేస్తారు. అంతవరకూ భగవంతుడు కూడా కళ్లు మూసుకునే ఉంటాడు.

"నన్ను మీరు అసహ్యించుకున్న కొద్దీ పరోక్షంగా మీరు నాకు చేరువయే రోజులు దగ్గరపడుతున్నయ్యన్న మాట.

మీరు నన్ను ఆదరించకపోయినా నా ఆదరణ మీకు ఎల్లప్పుడూ ఉంటూనే ఉంటుంది తాత్కాలికపు అనుభవాలు శాశ్వత బంధాన్ని ఎప్పుడు విడదీయలేవు. కాకపోతే ఆ మలుపు తిరిగేవరకూ వేచి ఉండాలి. ఆ నిరీక్షణలో నేను కృతకృత్యురాలి నవుతాననే నమ్మకం నాకున్నది.

మీ హృదయమనే కోవెలలో మూల విరాట్టు లేదు. తిరిగిపోయిన ఉత్సవ విగ్రహాలు ఎన్నో! నా హృదయమనే కోవెలలో సర్వాంగసుందరంగా అలంకరించబడిన మూల విరాట్టు ఒకటే. ఒకే ఒక స్వామి. నా మనస్సునే నిత్యమూ ఆ స్వామికి నైవేద్యం పెడుతున్నాను.

చిత్తగించవలెను.

మీ

ఉత్తరం చదివి సంతకం పెట్టాను. ఆ రోజునే పోస్టు చేశాను,

రెండు మాసాలు గడిచినా జాబులేదు. పిల్లలిద్దరూ తండ్రికోసం దిగులుపడి పోయ్యారు. అక్కయ్య చదువు ధోరణిలో పడింది, పష్టుఫారం పుస్తకాలు చదువుతున్నది. రోజూ ఒక గంట రాధ పాఠాలు చెప్పేది. నేనూ రాత్రి చదువు చెప్పేదాన్ని. పెద్దవాణ్ణి బళ్లో వేశాను. వాడూ శ్రద్ధగా చదువుతున్నాడు. పేద్ద పుస్తకం పట్టాడు

అక్కయ్య విషయంలో నేనూ, రాధా మరొకసారి ప్లీడరుగార్ని సంప్రదించాం. ఇల్లాంటి కేసుల్లో దంపతుల్ని విడదీయలేక కొంతమంది న్యాయమూర్తులు కేసులు వాయిదా వేస్తూ ఉంటారని, రాజీకి మరోసారి ప్రయత్నించమనీ సలహా ఇచ్చాడు. ఈ విషయాలన్నిటిలోనూ రాధ చాలా శ్రద్ధ చూపుతున్నది.

ఒక రోజున రాధ కాకినాడ వెళ్లొస్తాననీ, వారి అడ్రసు ఇవ్వమనీ అడిగింది. నేను ఆశ్చర్యపోయాను. వంటరిగా ఆడపిల్ల వారి దగ్గరకు వెళ్ల టానికి నాకు మనస్కరించలేదు. కాని పట్టుదల పట్టడంతో సరేననక తప్పలేదు.

మర్నాడు కాకినాడవెళ్లి ఆ మర్నాడు తిరిగొచ్చింది రాధ. ఎంతో సంతోషంగా వున్న అమ్మాయిని చూసేసరికి వాతావరణం సుముఖంగానే ఉన్నదనుకున్నాను. ఆ సంగతులన్నీ రాధ ఈ విధంగా చెప్పింది.

రాధ వెళ్లేసరికి వారిద్దరూ భోజనానికి వెళ్లే ప్రయత్నంలో ఉన్నారు. అమ్మాయిని చూడగానే వారు ఒక్కసారి ముఖం చిట్లించి "ఓ రాధ, ఇట్లా వచ్చారేం, ఈ ఊళ్లో ఉద్యోగం కుదిరిందా" అన్నారు. విషయాలన్నీ చెప్పిందిట రాధ.

"ఇవాళ నా కోసం మీ రిద్దరూ సెలవు పెట్టాలి" అన్నది. ఒక్క క్షణం ఆలోచించి.

"రాత్రికి మాట్లాడుకోవచ్చు. ఇవాళ చాలా పనుంది. మీరు ఆఫీసుకు వెళ్లిరండి. హోటల్లో భోజనం చేసొచ్చి హాయిగా ఏ నవలయినా చదువుకుంటూ కూర్చుంటాను సాయంత్రం మాటాడుకుందాం. సరేనా"

ఇద్దరూ వెళ్లిపోయారు. హోటల్లో భోజనం చేసివచ్చి కాసేపు విశ్రాంతి తీసుకుని ఏదో పుస్తకం చదువుతూ కూర్చుంది రాధ. పక్క యింటావిడ వచ్చి రాధను పలకరించింది.

"నువ్వెవరమ్మాయి వమ్మా" రాధ కాస్త లౌక్యంగా మాటాడా లనుకుంది.

"మా దీక్షితులు కాదండీ. కుటుంబం గౌరవనీయమైనదే"

"వీళ్ళు వళ్లో పడ్డారేం. పెళ్లి కావలసిన దానివికదా !"

"పెళ్లయిన వాళ్లు వీళ్ల వలలో పడొచ్చంటారా"

ఆవిడా నవ్వుతూ "భలేదానివే. వీళ్ళతో నేస్తంచేసి ఎందుకు చెడి పోతావని నీ మంచికే చెప్తున్నాను."

నాకేం తెలీదు. ఉద్యోగ ప్రయత్నంలో నాకు సాయం చేస్తానంటే వచ్చి కూర్చున్నా. రాత్రికి మాట్లాడతానన్నారు."

ఆవిడ బాధపడుతూ "మాటలే కాదమ్మా. చేతలు కూడా చేస్తారు. వాళ్ళ మాటలు నమ్మి పాడయిపోకమ్మా. ఇద్దరూ పెళ్లాల్ని వదిలేసి ఆచ్చోసిన ఆంబోతుల్లా తిరుగుతున్నారు."

"అట్లాగా అంత ప్రమాదమే సంభవిస్తే ఈ రాత్రికి మీ ఇంట్లో పడుకుంటాను. కాస్త చోటిస్తారా."

"తప్పకుండా" ఆవిడ వెళ్ళిపోయింది.

సాయంత్రం ఆరు గంటలకు ఇద్దరూ వచ్చారు. స్నానాలు చేసి ఇద్దరూ తాపీగా కూర్చున్నారు.

"ఆ ఇక చెప్పు. నువ్వు రాయబారిగా వచ్చావా రాధా ?"

"కాదు. నిన్ను చూసి పోదామని వచ్చాను. నా ప్రశ్నలకు నీ అభి ప్రాయాలు చెప్తావా బావా"

"ఓ. యస్, ఆడపిల్ల అడిగితే చెప్పకపోతే బావుంటుందా. అందు లోనూ మేనత్త కూతురివి."

"పెళ్ళెందుకు చేసుకున్నావు బావా"

"గృహస్థుణ్ణి కావాలి కనుక."

"పెళ్ళికి ప్రాధాన్యం అదొక్కటేనా"

"కాదు భార్యతో కాపురంచేసి బిడ్డల్ని కని వంశాన్ని నిలబెట్టు కోవాలి. నేనూ భార్యతో కాపురం చేశాను. నాకు ఇద్దరు కొడుకులు"

"నాలుగేళ్ళు కాపురంచేసి ఇద్దరు బిడ్డలు పుట్టగానే వంశం నిలబడిం దని తృప్తిపడి ఇక ఆ భార్యా పిల్లల్ని వదిలెయ్యడం కూడా గృహస్థుడి లక్షణమా."

"కొన్ని పరిస్థితులలో ధర్మాన్ని వదిలిపెట్టాలి. సౌఖ్యాల్ని చవి చూడాలి."

"అక్కయ్యా పిల్లల్ని ఎందుకు వదిలి పెట్టావు బావా."

"పరిస్థితుల ప్రభావం, ప్రాబల్యం."

"ఆ పరిస్థితులు అక్కయ్య కల్పించిందా లేక నువ్వు కల్పించిన పరిస్థితుల్ని అక్కయ్య హర్షించలేదా?"

"రెండూ జరిగాయి" క్షణం ఆలోచించి.

"ఆ ఉత్తరం నువ్వు రాస్తే సుభా సంతకం పెట్టిందికదూ" అన్నారు మళ్ళీ.

"అవును బావా."

"భర్తకు ఉత్తరం రాయటం కూడా నామోషీగా ఎంచి ఎవరో రాసిన ఉత్తరం క్రింద సంతకం పెట్టే భార్య మనస్సులో ఆ భర్తకు ఏ మాత్రం విలువ ఉందో ఆలోచించు రాధా"

"ఈ సందర్భంలో అక్కయ్యదేం తప్పులేదు. నేనే ఉత్తరం రాస్తానన్నాను. సరేకాని బావ నన్ను నువ్వు బలాత్కరిస్తావనుకో, ఆనంద రావుగారూ మీరు చూస్తూ ఊరుకుంటారా" బావ నుద్దేశించి అన్నది రాధ.

"లేమి, [illegible] ఎక్కడీస్తాను".

"అదేమిటండీ నా మీద అంత సానుభూతి మీ కెందుకూ,"

"ఇలాంటి పరిస్థితిలో మీరెవరు, నేనెవరు అనే ప్రశ్నే లేదు. నిజాయితీపరురాలైన ఒక స్త్రీని ఒకడు బలాత్కరిస్తున్నాడంటే ఎంతటి స్త్రీలోలుడయినా ఎవ్వరూ చూస్తూ ఊరుకోరు. ఇద్దర్లో మంచీ, మానవత్వం ప్రధానంగావి మరొక ప్రశ్న ఉదయించటానికి సావకాశం లేదు."

"ఆనందరావుగారూ! సునంద, అంటే మీ భార్య ప్రవర్తన మీద మీ ఉద్దేశ్యం."

"సునంద అమాయకురాలే కాని ఆమె మీద ఇప్పటికీ నాకే అను మానమూ లేదు, అంతటి నీచమైన ఉద్దేశాలు సునందకు లేవు."

"అలాంటి అమాయకురాలయిన సునందను బావ బలాత్కరించ బోయాడు. సునంద అరిచింది. సుభాషిణి బావలెంపలు వాయించి బుద్ధి చెప్పింది. ఇది భార్య భర్తను కొట్టడంకాదు. ఇందాక మీరన్నట్లుగా మంచీ, మానవత్వం కల అక్కయ్య, క్షమాగుణురాలై తన భర్తకు బుద్ధి చెప్పింది. ఆరు మాసాలకు పైగా మీ రిద్దరూ కలిసి ఉంటున్నారు. ఒకరి తత్వం మరొకరికి తెల్సు. ఇది తప్పంటారా ఆనందరావుగారూ" అన్నది రాధ.

వారికి ముచ్చెమటలు పోసి ముఖం వివర్ణమైపోయింది. కోపం తాండవించింది.

"రాధా, నోర్ముయ్, గెటవుట్: యూ బ్లడీ స్కౌండ్రల్" అని రాధను కొట్టబోయారు.

విశ్చేష్టుడైన ఆనందరావు వారి చెయ్యి పుచ్చుకుని:

"వెళ్ళవలసింది నువ్వుకాని, రాధకాదు. నా భార్యను బలాత్కరించబోయి చెంప దెబ్బలు తిని మళ్ళీ నా ఇంటిలోనే మకాం పెట్టేవన్న మాట. భేష్ చాలా బావుంది."

ఆనందరావు పళ్ళు కొరికేడు. తల వంచి వీధిలోకి వెళ్ళిపోయారు వారు.

ఆ రాత్రి పక్కవారింట్లో ఉండి ఉదయమే వచ్చేద్దామనే ఉద్దేశంతోనే ఉన్నది రాధ.

"ఆనందరావుగారూ"

"ఊఁ." ఆయన మనస్సులో ఏవో ఆలోచనలు రొదచేస్తున్నాయి.

"సునంద ఫస్టు ఫారం చదువుతోంది!"

"అట్లాగా."

"అవును. నేనూ, సుభాషిణీ ఆమెకు చదువు చెప్తున్నాం. సునంద మనస్తత్వంలో బాగా మార్పు వచ్చింది. ఎప్పుడూ మిమ్మల్ని గురించే ఆలోచన."

ఒక్కసారి దిగ్గునలేచి "ఈ కబుర్లన్నీ నాకు అనవసరం. ఇక నువ్వు వెళ్ళొచ్చునమ్మా" అన్నాడు బావ.

"అట్లాగేనండీ."

పక్క వాళ్ళింటికి వచ్చేసింది రాధ. ఆ రాత్రి వాళ్ళింట్లో ఉండి ఉదయానే బయల్దేరి వచ్చేసింది. ఆ రాత్రి వారు ఇంటికి రాలేదు.

ఈ విషయాలన్నీ ఎంతో సంతోషంతో రాధ చెప్తూంటే నా మనస్సు మరోవైపు ఆలోచనలకు మళ్ళింది.

'రాధా, ఈ రహస్యాన్ని నేను వెల్లడి చేసి వారిని అల్లరి పెడుతున్నాననే కోపంతో వారి మనస్సులో నీమీద మరింత కార్పణ్యం ఏర్పడుతుందేమో"

"లేదు నీమీద కోపమూ, నిరాదరణా యధాప్రకారంగానే ఉంది. ఇప్పుడు ఆ తోడలుళ్ళ మధ్య కలతలు కలిగే వాతావరణమే ఏర్పడింది" అన్నది రాధ.

ఈ విధంగా మరో మూడు నెలు గడిచాయి. వారు అక్కడ ఉండటంలేదు. మరో చోట గది తీసుకుని ఉంటున్నారు.

రోజులు దొర్లిపోతున్నయ్యి. ఒక రోజున పిడుగులాంటి వార్త వచ్చింది. లంచం పుచ్చుకున్నారనే నేరంకింద వార్ని సస్పెండ్ చేశారు. కోర్టులో నేర విచారణకు ముందు సస్పెన్ ఆర్డర్లు జారీచేశారు.

రెండు రోజులు నేను భోజనం చెయ్యలేదు. పిల్లలిద్దర్నీ చెరొక పక్కనా పడుకోబెట్టుకుని రాత్రింబగళ్ళు ఆలోచిస్తూ పడుకునేదాన్ని. వారం రోజులు ఆఫీసుకువెళ్ళలేను. రామారావు, నా పరిస్థితి తెల్సిన మరి నలుగురయిదుగురు ఆఫీసులో వాళ్ళూ వచ్చి నన్ను ఊరడించి వెళ్ళారు.

ఈ పరిస్థితిలోనైనా వారు వస్తారనే వెయ్యి కళ్ళతో ఎదురు చూశాను వారు రాలేదు. ఉత్తరమూ రాయలేదు.

ఒ కాకినాడ వెళ్ళి వస్తానని రాధతో అన్నాను.

''భార్యాభర్తల్ని మాతంచెయ్యాలని నా అభిమతం కాదు సుభాషిణీ, ఈ పరిస్థితిలో నువ్వు వెళ్ళటం మంచిది కాదు. బావకు పతనావస్థ ప్రారంభమైంది. నీ మంచితనాన్ని గుర్తించే సమయం చేరువలోనే ఉన్నది. ఇప్పుడు నువ్వు వెళితే నిన్ను బావ గౌరవించడు. అతని దృష్టిలో నువ్వు నష్ట జాతకురాలివిగానే చిత్రించబడతావు. కాని కష్ట సుఖాల్లో భాగం పంచుకునే భార్యగా కనబడవు. బావ ఇక్కడికి వస్తాడో రాడో వేచి చూడ్డమే మంచిది'' అన్నది రాధ.

ఆలోచిస్తే నాకూ అదే మంచిదనిపించింది.

ఈ పరిస్థితిలో నేను సగం చచ్చి ఆఫీసుకు వెళ్ళివస్తున్నాను, ఎవరన్నా ఈ ప్రస్తావన తెస్తారేమోనని ఆందోళన. చిన్నతనంగా, అవమానకరంగా ఉండే సంఘటలు జీవితంలో జరిగినప్పుడు ఆ వివరాలన్నీ తెల్సినా మళ్ళీ ఆ విషయాల్నే అసలు వాళ్ళని కూడా అడిగి వివరాలన్నీ రాబట్టుకుని వారి ఉచిత సలహాలను కూడా రంగరించి నూరిపోస్తారు. ఈ అనుభవాలన్నీ ఒకదానివెంట ఒకటి నా జీవితంలో సందర్భమవుతూ ఉంటే గుండె రాయిచేసుకుని ఆ పిల్లల్ని చూసుకుంటూ రోజులు గడుపుతున్నాను.

మరొక మూడు మాసాలు గడిచినా వారు రాలేదు, ఉత్తరం రాయలేదు. కోర్టులో కేసు జరుగుతున్నది.

ఇదిట్లా ఉండగా అక్కయ్య, బావల విడాకుల పిటిషన్ కోర్టులో కొట్టివేశారు, అక్కయ్య మనోవర్తి దావా పిటిషన్ కూడా కొట్టివేశారు.

ఆ రోజున అందరం ఎంతో సంతోషించాము. ప్లీడరుగారి నడిగితే అక్కయ్యను బావ దగ్గరకు పంపే ప్రయత్నాలు చెయ్యమన్నారు. ఈ పరిస్థితిలో కాకినాడ వెళ్ళి బావతో సంప్రదించటానికి కూడా మనస్కరించలేదు.

ఒకసారి డబ్బివ్వటానికి అన్నయ్యవస్తే అన్నయ్యతో ఈ ప్రస్తావన తెచ్చాము,

"నా పరిస్థితి ముందే చెప్పాను సుభా. నేను కలుగచేసుకుంటే కూడే కాపురాలు కూడా చెడిపోతయ్యి. మర్యాదస్తులెవరూ నా సాయం కోరరు. ఆ వ్యవహారాలేవో నువ్వే చూడు బావతో సంప్రదింపుకు సిద్ధపడాలంటే అప్పుడా సందర్భాన్ని నేను వినియోగించుకుంటాను" అని వెళ్ళిపోయాడు.

రాధ అక్కయ్యచేత బావకు ఒక ఉత్తరం రాయించింది. వారం రోజులు పోయాక బావ ఆ ఉత్తరానికి సమాధానం రాశాడు. దాని సారాంశం-కోర్టు వాటికి చెవులేకాని కళ్ళు లేవన్నది పాత సామెత. ఇప్పుడు మనస్సు కూడా లేనట్లు రుజువైంది-అని.

ఆ ఉత్తరాన్ని ఎంతో పదిలంగా తన పెట్టెలో దాచుకుంది అక్కయ్య. పెళ్ళయాక భర్త రాసిన ఉత్తరం అదొక్కటే.

# 13

వారో ఆరు మాసాలు విచారణ జరిగింది. స్నేహితులవద్ద బావ వద్ద దాదాపుగా వెయ్యి రూపాయలు అప్పుచేశారు కేసునుంచి బయటపడంగానే తిరుస్తానని అందరికి వాగ్దానాలు చేశారు. లంచం పుచ్చుకున్నట్లు నేరం ఋజువైందని కోర్టు తీర్పు ఇచ్చింది. ప్రభుత్వ చర్యగా వారిని ఉద్యోగంనుండి బర్తరఫ్ చేశారు.

నా ఆశా సౌధాలు అన్నీ కూలిపోయాయి, కలెక్టరు ఆఫీసులో ఉద్యోగంచేసి లంచాలు పుచ్చుకుని డిస్మిస్ అయిన శ్రావణకుమార్ భార్యగా చాలా మందికి తెలిసిపోయాను.

ఉద్యోగి సమస్యలు వేరు ఆ సమస్యలకు సానుభూతి ఉంటుంది నిరుద్యోగి సమస్యలు నైరాశ్యంతో కూడినటువంటివి. వాటికి సానుభూతి చాలా తక్కువ. సమస్యల పరిష్కారానికి తోడ్పడేకన్నా అట్లా బాధపడక ఎక్కడయినా ఉద్యోగం చెయ్యరాదా అని కొంచెం తేలిక భావంతో మాట్లాడుతారు. ఉద్యోగం చేసుకుంటూ పదిమందిలో పేరు తెచ్చుకుంటూ గౌరవ ప్రదంగా జీవిస్తున్నాడని అందరూ అనుకున్న ఒక ఉద్యోగి భర్తరఫు అయ్యాడని తెలియగానే ఆ వ్యక్తియందు ఇదివరకు ఉన్న మంచి అభిప్రాయలన్నీ మంచులా కరిగి మట్టిలో ఇంకిపోతాయి.

ఈ పరిస్థితిలో వారు ప్రాణత్యాగమైనా చేసుకుంటారేమోనని తల్లడిల్లి పోయాను. కాకినాడ వెళ్ళి వారిని తీసుకు వస్తానంటే రాధ వద్దన్నది. ఆఫీసులో అందరూ నన్ను కాకినాడ వెళ్ళమని ప్రోత్సహించారు. అతను అవమానంతో కృంగిపోయి ఉంటాడనీ ఈ పరిస్థితిలో ఉదాసీనంగా ఉండటం మంచిది కాదనీ నన్ను హెచ్చరించారు. నిరుద్యోగి అయినా ఉద్యోగం చేస్తున్నా డిస్మిసయినా మనస్తత్వం మారుతుందిగాని పవిత్ర బంధం మారిపోదు. భార్యాభర్తల మధ్య అనురాగం తప్పుతున్నా ఆత్మీయత కరువైనా బాంధవ్యం సమసిపోదు.

ఎన్నో ఆలోచించి మధనపడి కాకినాడ వెళ్ళాను. వారు ఎక్కడ ఉంటున్నదీ తెలీక బస్సు దిగంగానే బావ ఇంటికి వెళ్ళాను బావ ఉన్నాడు, కుశల ప్రశ్నలయ్యాక అన్నాడు.

"కుమార్‌ని గురించి చాలా దారుణంగానే చెప్పుకుంటున్నారు సుహాసిణి, కనబడ్డచోటల్లా అప్పుచేశాడు, నాకూ మూడొందలు యివ్వాలి. నా డబ్బు ఇవ్వలేదని చెప్పటంకాదు. ఇక ఈ జీవితంలో కుమార్ బాగు పడడు. సరే అతని గదికి వెళదాం పద."

ఇద్దరం బయదేరి వారున్న గదికి వెళ్ళాం. మేం వెళ్ళేసరికి నులక మంచంమీద పడుకుని సిగరెట్ కాలుస్తూ ఏమిటో ఆలోచిస్తున్నారు, మమ్మల్ని చూడంగానే లేచి కూర్చుని

"రా సుభా, ఎప్పుడొచ్చావ్" అన్నారు చెప్పాను: "అంతా విన్నాను. జరిగిందేదో జరిగిపోయింది. అదంతా ఒక పీడకలగా భావించి మర్చిపోండి. మనింటికి వెళ్ళిపోదాం రండి" అన్నాను.

నిర్లిప్తతగా నిట్టూర్చి గోళ్ళు కొరుక్కుంటూ కూర్చున్నారు

"నేను వెళ్ళొస్తాను. కుమార్. వస్తానమ్మా సుభా, ఆఫీసుకు టైమైంది" అని బావ వెళ్ళిపోయాడు. "నీకూ ఆఫీసుకు టైమయిందేమో వెళ్ళు సుభా. నాకు ఆఫీసు కని వదలిపోయింది. ఆఫీసు, ఉద్యోగం అంతా నమ్మక ద్రోహాలు, సౌశీంద్రల్స్" అన్నారు.

జరిగిపోయిన హోదాకూ, సౌకర్యాలకూ ఈ జీవితం సమాధి లాంటిది. ఆ జ్ఞాపకాలూ, అనుభూతీ ఈ పరిస్థితిలో కాలిపోయిన కాగితాల నుసిలా మాడిపోయాయి. విరిగిన మనస్సును అతకటానికి ప్రయత్నించికృత కృత్యులైనా అనుభవయోగ్యం కావేమో.

"జీవితంలో అన్నీ అనుభవించి ఈ స్థితికివచ్చిన మిమ్మల్ని చూసి నేను చాలా బాధపడుతున్నాను. మీ ప్రేమనూ అనురాగాన్నీ అనుభవించని నేను మిమ్మల్ని అర్థించి అడుగుతున్నాను. మీరు వచ్చేసెయ్యండి మనింటికి వెళ్ళిపోదాం."

కాసేపు ఆలోచించి అన్నారు.

"నన్ను కూడా నీ పోషణలోకి రమ్మన్నావా సుభా."

"నేను మిమ్మల్ని పోషిస్తానవే ఓదార్పు మాటతో అడగటం లేదు. విడిపోయిన మన కాపురం తిరిగి ఒకటి కావాలనే నా ఆకాంక్ష. మీ గతాన్ని మీరు విస్మరించలేకపోయినా నేను మర్చిపోతాను. జీవితంలో నూతనాధ్యాయాన్ని సృష్టించుకుందాం అదే నా కోరిక."

"వద్దు సుభా వద్దు. నీ అనురాగాన్నీ నీ ఆదరాన్నీ అనుభవించే యోగ్యత నాకులేదు. అందుకు అనువైన అన్ని అవకాశాల్ని నేను ఎప్పుడో జారవిడుచుకున్నాను. నేను వచ్చి వున్నందువల్ల పాత మన

పాపాలకు కొత్తవి చేర్చినట్లే అవుతుందిగాని ఆ మంచు తెర విడిపోదు. నేను నిన్నొక్కదాన్నే మోసం చేశాను సుభా. కాని ఈ సంఘంలోని మనుష్యులు నన్ను పూర్తిగా మోసం చేశారు. నువ్వు నా మీద కక్ష తీర్చు కుంటే నే నీ స్థితికి వచ్చేవాడినే కాదేమో, నీ మంచితనం నన్ను భ్రష్టుణ్ణి చేసింది."

ఆ ముఖంలో అనేక భావాలు చూశాను. "మీ బాధ నాకు తెల్సు. గతాన్ని తవ్వుకోవద్దు అన్నీ మర్చిపోండి" ప్రాధేయ పూర్వకంగా అడిగాను.

"గతాన్ని మర్చిపోవటానికి ప్రయత్నించినా, ఈ సంఘంలోవి పెద్ద మనుష్యులు మనముందే ఆ గతాన్ని తవ్వి కుప్పగా పోస్తారు. ఆ విధంగా మన దారికి అవరోధం కలిగిస్తారు. తవ్విపోసిన ఆ కుప్పను చూస్తూ మనం ముందుకు సాగిపొలేం" అన్నాడు.

వారి అభిప్రాయం ఏమిటో చెప్పలేదు. మాట్లాడకుండా కూర్చున్నాను. అయిదు నిమిషాలు గడిచాక "వీలు చూసుకుని వస్తాను సుభా నువ్వు వెళ్ళు. ఎట్లాగూ మనింటికి రాక తప్పదు. ఆ వచ్చేది ఎప్పుడో చెప్పలేను."

"ఏదైనా ప్రయివేటు కంపెనీలో ఉద్యోగం దొరకదంటారా. నా మాట వినండి. మీకు ఉద్యోగం దొరక్కపోదు."

"వుద్యోగం ఈ కేసు నా మీద ఎవరు ఎట్లా మోపారో నాకు తెల్సు సుభా, వాళ్ళ పనిపట్టటమే నా ఉద్యోగం" కసిగా అన్నాడు.

"కార్పణ్యం మనిషిలోని మానవత్వాన్ని చంపుతుంది మానవత్వం లేని మనిషి తండ్రి అయినా, భర్త అయినా, ఎవరయినా వారు రాక్షసులే కాని మనుష్యులుకారు. వాళ్లు త్రాచుపాములను మించిన విషం కలవారు. అలాంటి జీవితాన్ని మీరు కోరుకోవద్దుస్వామీ కోరుకోవద్దు. నేను భరించలేను" వారి పాదాలమీద తలవాల్చి ప్రాధేయపడ్డాను. వారి మనస్సు మారలేదు.

"సుభా, నువ్వు ఏడ్చి బాధ పడినందువల్ల ప్రయోజనంలేదు. వెళ్ళిరా. ఒకటేమాట. నేను ఎప్పుడు వచ్చినా నువ్వు హర్షించి నాకు నీ సేవను ప్రసాదిస్తావుకదూ?"

నా వేపు తిరిగి చూడలేక కళ్ళు మూసుకుని తలవంచుకున్నారు.

"నా మనస్సూ, నా హృదయమూ మీరు ఏ స్థితిలో ఉన్నా మిమ్మల్నే కోరుకుంటాయి" అశ్రునయనాలతో అన్నాను.

"చివరకు మిగిలేది నీ ప్రేమానురాగాలు ఒక్కటే, కాని ఈ జీవితంలో అలాంటి గౌరవాన్నయినా నిలుపుకోగలననే నమ్మకం నాకు లేదు సుభా, కాని ప్రయత్నిస్తాను. ఇక నువ్వు వెళ్ళిరా" బరువుగా నిట్టూర్చారు.

వారి మనస్సులో అగ్ని గుండం ప్రజ్వరిల్లుతూ మండుతున్నది. ఎవరిమీదనో కక్ష. కార్పణ్యం ఆ అగ్నికి ఆజ్యమే అయాయి, అందుకు తగిన పట్టుదలను సమిధలుగా ఒక్క పక్క కుప్పపోశారు. ఆ అగ్ని గుండాన్నిచూస్తూ నిల్చోడమేగాని దానిని ఆర్పగల సామర్థ్యం నాకు లేదు.

ఆ రోజునే నేనూ తిరిగి రాజమండ్రి వచ్చేశాను.

ఒక నెల గడిచింది. ఆ రోజు పదిగంటలకు నేను ఆఫీసుకు వెళ్ళబోతుంటే వారొచ్చేరు. మనిషి కాస్త తగ్గారు. ఆ ముఖంలో ఏదో ఒక దృఢ సంకల్పం వున్నట్లు బాగా కనబడింది. చిన్నవాడు నా చెంగు పుచ్చుకుని "అమ్మా, బూచబ్బాయ్" అని నా వెనకచేరాడు. పెద్దవాడు "అమ్మా నాన్నేనా" అన్నాడు. "అవును బాబూ నాన్నగారే. అప్పుడే మర్చిపోయావురా" అన్నాను. కాకినాడ, రాజమండ్రిల మధ్య ఆ తండ్రి ఈ పిల్లలకు కనిపించి సంవత్సరం దాటింది.

"నువ్వు ఆఫీసుకు వెళ్ళు సుభా, ఇంక ఎక్కడికి వెళ్ళను. టైమైంది వెళ్ళిరా" అన్నారు. నేను వెళ్ళిపోయాను. ఇంటికి వచ్చాక తెల్సింది చిన్నవాడు వారెంతసేపు పిల్చినా వెళ్ళలేదు. పెద్దవాడు మాత్రం వారి దగ్గరకు వెళ్ళాడు అని.

దేవుడులేని నా గుడికి నా దేవుడు తిరిగివచ్చారు. వారు వచ్చినప్పట్నించీ అక్కయ్య వంటింట్లోనే ఉంటున్నది. వీలయినంతవరకూ వారికి కనబడకుండానే తప్పుకుని తిరుగుతున్నది.

ఒక రోజున అన్నారు.

"వదినా, నా కిప్పుడు కావలసింది స్త్రీ కాదు. డబ్బు. ఆ డబ్బు కావాలంటే ఏదన్నా ఉద్యోగం సంపాదించాలి. నన్నుచూసి భయపడి తప్పుకు తిరగక్కర్లేదు."

ఆ మాటకి విస్తుపోయినా, కాస్త తేరుకున్నది అక్కయ్య. చిన్నవాడిని వారి వళ్ళో భయం లేకుండా కూర్చోపెట్టడానికి పదిహేను రోజులు పట్టింది.

రోజూ ఉదయం ఏడు దాటేవగానే కాలకృత్యాలు నెరవేర్చుకుని ఎనిమిదిగంటలకల్లా వెళ్ళిపోయేవారు. మధ్యాహ్నం పన్నెండు గంటలకు భోజనంచేసి కాసేపు విశ్రాంతి తీసుకుని మళ్ళీ వెళ్ళిపోయి రాత్రి ఎనిమిది గంటలకు వచ్చేవారు.

అసలు కేసు ఏమిటనిగాని. లంచాలు ఎందుకు తీసుకున్నారనిగాని పట్టించింది ఎవరనిగాని ఏ వివరాలూ నేను వార్ని అడగలేదు. అడిగినందువల్ల ప్రయోజనంలేకపోయినా వారి భావాల్లో మనసులో నే నేదో కించపరుస్తున్నానేమోననే ఉద్దేశ్యం వారితో కలుగుతుందేమోనని ఆ ప్రస్తావనే తీసుకురాలేదు.

ఒక రోజున వారి మన స్తత్త్వాన్ని మరో రీతిగా తెల్సుకుందామని అడిగాను.

"ఏదయినా ఉద్యోగ ప్రయత్నాలు చేస్తున్నారా?"

"లేదు" ముభావంగా అని ఊరుకున్నారు.

ఈ సమాధానంవల్ల, నేనే మళ్ళీ ప్రశ్నించే అవకాశం లేకపోయింది.

"నీ సంపాదన తినే హక్కు నాకు లేకపోతే ఏదయినా ఉద్యోగం చూసుకుంటాను" అన్నారు మళ్లీ.

"మీకు హక్కు లేదనిగాని మరే ఉద్దేశంతోగాని నేను అడగటం లేదు. పగలల్లా ఎక్కడికో వెళుతుంటేను అడిగాను. ఇక అడగను" అన్నాను.

పరిస్థితులు మారినా మనస్సు మారినా మాటలు మాత్రం మారలేదు.

పదిహేను రోజులు గడిచాక ఒక రోజున కాస్త సంతోషంతో చెప్పారు.

"సుభా. ఒక మెషినరీ కంపెనీలో లెక్కలు రాయటానికి చేరాలనుకున్నాను. నెలకు వంద రూపాయలు జీతం ఇస్తామన్నారు. చేరమన్నావా?"

నెలకు రెండు వందల యాభై సంపాదించుకునేవారు. జీవితం తలక్రిందులై ఈ జీతానికి వప్పుకున్నారంటే పరిస్థితుల ప్రభావం మనిషిని ఎంత తలక్రిందులు చేస్తయ్యో ఊహించుకున్నాను.

"చేరండి. జీతం తక్కువయినా ఏదో ఒక వ్యాపకంలో పడితే మీకు కాస్త మనశ్శాంతయినా ఉంటుంది" అన్నాను.

"నా మనశ్శాంతికేంగాని. నీకు మనశ్శాంతి ఉండదేమో"

"ఎందుకని?"

"నీ జీతంకన్నా నాజీతం తక్కువకదా."

"మీరు ఎక్కువ సంపాదించినప్పుడు నేను విరగబడిపోయిన సంఘటన లేమయినా ఉన్నయ్యా" నవ్వుతూ అన్నాను.

"భార్యకన్నా భర్త జీతం ఎక్కువవటం లోక రివాజే. తనకన్న తక్కువ సంపాదనపరుడైతేనే ఆ భార్య బాధపడేది."

"ఆ అధిక్యత నా మనస్సులో ఎప్పుడూ ఉండదు. నేనేమయినా అనుకుంటానేమోనని మీరు బాధపడకుండా ఉంటే చాలు."

ఏం మాట్లాడకుండా సిగరెట్ వెలిగించారు. రెండు రోజులు గడి చాక ఆ మెషినరీ షాపులో చేరారు. జరిగిపోయిన సంఘటనలన్నీ ఒక పీడకలగా భావించాను.

ఒక నెల గడిచింది, జీతం తెచ్చుకున్నారు.

"సుభా"

"ఏమండీ"

"వంద రూపాయలు జీతం వచ్చింది. నా ఖర్చులకు కొంత తీసు కుని మిగతాది నీకిస్తాను."

"అక్కర్లేదు. మీ జీతం మీరే వాడుకోండి. ఇంటికింద ఒక్క పైసా కూడా ఖర్చు పెట్టక్కర్లేదు."

"కాదు సుభా. నే చెప్పేది వినమని శాసించటంలేదు. నెలకు ఓ యాభై రూపాయలిస్తాను మిగతా ఏభై రూపాయలూ నా ఖర్చులకు తీసు కుంటాను. భార్యా బిడ్డల్ని పోషించలేకపోయినా, నన్ను నేనైనా పోషిం చుకుంటున్నాననే సంతృప్తి ఉంటుంది. అదైనా నాకు మిగలనివ్వు" అన్నారు.

"మీ ఇష్టం" అన్నాను.

ఏభై రూపాయలు ఇచ్చారు. రోజులు గడుస్తున్నాయి. అక్కయ్య సెకండ్ ఫారం పుస్తకాలు చదువుతోంది. తెలివితేటల్లోనూ కాస్త మార్పు వచ్చింది. మరో రెండేళ్ళు కష్టపడి దాన్ని మెట్రిక్ పరీక్షకు చదివించా లని నా పట్టుదల. అదే చదువుకుంటానన్నది. వార్ని చూస్తే తప్పుకు తిరిగినా మునుపటి బెరుకూ, భయమూ లేవు. రాధ రోజూవచ్చి వెళుతున్నా వారితో ఏవో మామూలు బాతాఖానీ కబుర్లే చెప్పేది కాని వారి వ్యవహారా లేమి అడిగేది కాదు. అలా అడగవద్దని నేనే చెప్పాను. మళ్ళీ వార్ని మామూలు మనిషిని చెయ్యాలనేదే నా తాపత్రయం.

ఒక నెల మొదటి వారంలో వంద రూపాయలు ఇవ్వటానికి అన్నయ్య వచ్చినపుడు వారి కంటబడ్డాడు. అంతకు క్రితం మూడుసార్లు వెళ్ళినా ఆ సమయంలో వారులేరు. అన్నయ్య ఈ విధంగా అమ్మ. అక్కయ్యల పోషణకు నెలకు వంద రూపాయలు ఇస్తున్నాడని వారికి చెప్పాను. విని ఊరుకున్నారు. ఈసారి ఇద్దరూ మాట్లాడుకునే సావకాశం కలిగింది.

"ఏమోయ్ వాణీనాథం. కులాసా. వ్యాపారం బాగా సాగుతోందా" అని పలకరించారు వారు.

అన్నయ్య ఐదు నిముషాలకన్న ఎక్కువసేపు కూర్చోలేదు. వాడు చేసే పనేమిటో తెల్సుకోవాలని వారెంతో ప్రయత్నించారు. కాని అన్నయ్య బయటపడలేదు

"ఒకవేళ నేనూ మీతో చేరాలనుకుంటే చేర్చుకుంటారా" అని అడిగారు.

"దానికి కొన్ని క్వాలిఫికేషన్లు కావాలి" అని వెళ్ళిపోయాడు అన్నయ్య. నైరాశ్యం మానవుణ్ణి కృంగదీసినా జీవించడానికి మరో పంథాను నిర్ణయించుకోవటంలో తప్పటడుగులు వేస్తుంది.

నా జీతం నూట ఏభై ఆరు రూపాయలతో, అన్నయ్య అంద చేసే వంద రూపాయలతో ఇంతమందిమి బ్రతుకుతున్నాం. అన్నయ్య జైలులో ఉన్న సంవత్సర కాలంలో నా జీతం ఇల్లు గడవడానికి చాల్లేదు. కాకినాడ వెళ్ళాక వారు పైసా పంపలేదు. ఆ పరిస్థితుల్లో ఆరు వందలు అప్పుచేశాను. అందులో మూడు వందలు మాత్రమే తీర్చగలిగాను. మా మామగారు సంపాయించి ఇచ్చిన ఆస్తి ఆ చిన్న పెంకుటిల్లు ఒక్కటే. అదీ చాలా చిన్న ఇల్లు కావటంతో ఒక్క గది మినహా ఎక్కువ భాగం అద్దెకిచ్చేందుకు వీల్లేదు. మా పెళ్ళి కాకముందు తల్లీ కొడుకే కావటంతో ఒక్క గది మాత్రం అద్దెకిచ్చేవారు. మా వివాహమయ్యాక ఆ గది

కూడా ఖాళీ చేయించి మేమే తీసుకున్నాం. నాన్నగారు పోవటంతో అమ్మ, అక్కయ్య ఇక్కడే ఉంటంచేత ఇంక అద్దెకిచ్చే ప్రస్తావనే లేక పోయింది. ఈ ఉన్న పెంకుటిల్లు తండ్రి పోవటంతో వారసుడు కనుక వారికే వచ్చింది. ఈ ఇల్లు మినహా మరే ఆస్తిలేదు. తిన్నా తినక పోయినా ఈ బాధలన్నీ అనుభవిస్తున్నా చిన్న ఇల్లయినా స్వగృహం ఉండడంతో ఒంటద్దె పోరు లేకుండా బ్రతుకుతున్నాం.

పెద్దవాణ్ణి నెలకు పది రూపాయలు జీతంకట్టి కాన్వెంటులో చేర్పించాను. వాడు చదివేది ఒకటో క్లాసు. వారు ప్రభుత్వ సర్వీస్‌నుండి డిస్మిస్ అయినా ఆ చెడ్డ రోజులుపోయి మంచిగా జీవిస్తారని ఆశించాను.

ఆశ మానవుణ్ణి బ్రతికిస్తుంది. జరిగిపోయిన కష్టాల్ని మరపింప చేస్తుంది. కష్టాలు అనుభవించినకొద్దీ హృదయమూ మనస్సూ రాటుదేలి నిరాశా తరంగాల్లో తల మున్కలుగా కొట్టుకుపోయినా ఏనాటికయినా మంచి రోజులనే వడ్డుకు కొట్టుకు రాగలమేమోననే ఆశాకిరణం ఆ కరుడు కట్టిన మనస్సులో లీలగానైనా పొడసూపక మానదు. అలాంటి ఆశతోనే జీవిస్తున్నాను. మరో మూడేళ్ళు వారు చక్కగా, కుదురుగా ఉద్యోగం చేసుకుంటే డిప్యూటీ తహసీల్దార్ ప్రమోషన్ వచ్చేది. కాని ఆ ఉద్యోగ వృక్షం మొదట్లోనే నరికి వేయబడింది.

ఆ మెషినరీ షాపులో వారు మూడు మాసాలు పనిచేశారు. ఒక రోజున ఆఫీసుకు పిడుగులాంటి వార్త వచ్చింది. ఆ షాపులో అమ్మకం తాలూకు డబ్బు రెండు వేలకు పైగా వీరు కాజేశారని, షాపువాళ్ళు పోలీస్ రిపోర్టు ఇవ్వగా అరెస్టుచేసి తీసుకువెళ్ళారని కబురొచ్చింది. టైప్ మిషన్లో ఉన్న కాగితాన్ని అలాగే ఉంచి రామారావుగార్ని పిలిచి ఆయనతో చెప్పాను. ఆయనా బాధపడి కాగితాలు సర్దుకుని వచ్చారు. నేను రిక్షాలో, ఆయన సైకిల్ మీదా ఆ మెషినరీ షాపుకు చేరాం.

షాపు యజమాని సంగతంతా చెప్పాడు; అది చాలా పెద్ద షాపు కావటంతో రోజూ పెద్ద మొత్తంలో అమ్మకాలుండేవి. క్యాషియర్ చేసే

ఉన్నాడు. అతను పెళ్ళికని వారం రోజులు సెలవు పెట్టడంతో ఆ పని వీరిని చూడమన్నారుట. ఒక రోజు వెయ్యి రూపాయలూ, ఒక రోజు ఆరు వందలూ, ఒక రోజు నాలుగు వందల ఎనభై ఇట్లా కాజేసి బ్యాంక్ ఖాతాలో మిగతా డబ్బు జమకట్టేవారుట. ఇదంతా మూడో రోజు సాయంత్రం బయటపడింది. వెంటనే లెక్కలు చూసుకుంటే మొత్తం రెండు వేల ఎనభై రూపాయలు తేలిందట. వెంటనే పోలీసు రిపోర్టు ఇచ్చారు, కస్టడీలోకి తీసుకున్నారు, ఆ షాపు యజమాని, ఇతర గుమస్తాలూ నన్నూ, నా పరిస్థితిని చూసి ఎంతో సానుభూతి కనబర్చారు,

"మీ భర్తయందు మీకు గౌరవం వుంటం సహజమేనమ్మా. గవర్నమెంటులో డిస్మిస్ అయినారని మాకూ తెల్సు. కాని మాకు తెల్సిన వారిచేత వారిని ఎట్లా ఎరుక చేసుకున్నారో తెలీదు. సిఫార్సు చేయించారు. మనిషి చాలా తెలివికలవాడు. ఇంకో గుమాస్తా రెండు రోజుల్లో చేసే లెక్కలవి ఆయన ఒక్కరోజులోనే పూర్తి చేసేవారు. సంవత్సరం కాగానే జీతం నూట యాభై చేద్దామనుకున్నాం. ఎంత తెలివికలవాడయినా ఆ బుద్ధి అటువంటిది, నోటిదగ్గర కూడు రెండుసార్లు బోర్లదోసుకున్నారు. పోలీసు కస్టడీలో వున్నారు, వెళ్ళి చూసిరండి. మా డబ్బు మాకు కడితే కేసు లేకుండా చేస్తాం". అన్నారాయన.

నేనూ, రామారావుగారు పోలీసు స్టేషన్‌కు వెళ్ళాం. లాకప్‌లో వున్నారు. తల వంచుకుని కూర్చున్నారు. రామారావుగారు సబిన్‌స్పెక్టర్‌తో మాట్లాడారు. వారితో మాట్లాడానికి పర్మిషన్ ఇచ్చారు. ఆ రోజున వారు డిస్మిస్ అయిన వార్త తెలిసినపుడు కూడా నేనింత అవమానంతో బాధపడలేదు. వారి జీవితం లంచగొండితనంనుంచి దొంగతనంలోకి వచ్చింది. కటకటాల వెనకవున్న వారి ముఖం చూడలేకపోయాను. మనస్సూ, శరీరమూ అణువణువూ అవమానంతో కృంగిపోవడంతో మనస్సులో చీకట్లు వ్యాపించినా కన్నీరు రాలేదు.

"ఏమిటండీ ఇదంతా" అన్నాను.

"నీలో మార్పు వచ్చిందనుకున్నానురా కుమార్, కాని ఆ మార్పు ఇల్లా పరిణమిస్తుందనుకోలేదు. నీకు వచ్చిన కళంకం ఎటాగూపోదు. మధ్య సుభాషిణి తలెత్తుకు తిరగలేకుండా వున్నది" అన్నారు రామారావు గారు వారు వంచిన తల ఎత్తలేదు.

"పుష్కలంగా డబ్బు సంపాదించి విచ్చలవిడిగా ఖర్చుపెట్టటం నేర్చుకున్న ఈ చేతులకు అంత డబ్బు ఒక్కసారి చూసేసరికి మనస్సు పాత భావాలూ, అలవాట్లవైపు పరుగెత్తింది. అంతేకాదు కాకినాడలో దాదాపు రెండు వేలవరకూ అప్పులు చేశాను ఉత్తరాలూ, కబుర్లూ వచ్చాయి. షాపులో డబ్బు చేతికి చిక్కింది. మనస్సు కట్టు తప్పింది అంతే డబ్బు చేజిక్కించుకున్నాను" అన్నారు.

"ఆ డబ్బంతా ఏం చేశారు" అడిగాను.

"పదిహేను వందలు కాకినాడ పంపించాను. నాలుగు వందలు ఈ ఊళ్ళో చేసిన అప్పులు తీర్చాను. వంద రూపాయలు పైగా నేను ఖర్చు పెట్టుకున్నాను."

"నీ అప్పులు తీర్చుకోటానికి ఇదిరా మార్గం కుమార్. ఉన్న అవకాశాలూ, వచ్చిన అవకాశాలూ అన్నీ ఇల్లా సర్వనాశనం చేసుకుంటుంటే ఇంక నిన్ను ఎవ్వరూ ఏ పరిస్థితిలోనూ నమ్మరు. సరే ఆ డబ్బు కట్టే మార్గం" అన్నారు రామారావుగారు.

"డబ్బా, ఆ అవకాశం లేదు. జైల్లోనే వుంటాను. నాకిప్రాయశ్చిత్తం కావాల్సిందే" అన్నారు.

ఆ పరిస్థితిలో ఇంక తర్కించి లాభంలేదని వకీలుని సంప్రదించి షాపు యజమానిని సంప్రదించి ఇల్లు తాకట్టుపెట్టి ఆ డబ్బు కట్టేటే ఏర్పాటుకి వచ్చాము. నా హామీ మీదా, రామారావుగారి హామీమీదా వార్ని వదిలిపెట్టారు. తరువాత ఇల్లు తాకట్టుమీద రెండువేల అయిదు వందలు తెచ్చారు. వడ్డీ రెండు రూపాయలు. రెండువేల ఎనభై రూపాయలు కట్టేసి కేసు రద్దు చేయించాము. కాకినాడలో ఇంకొకరికి నాలుగు

వందలు బాకీ తీర్చారు. ఇంక బావగారయిన ఆనందరావుగారి బాకీ ఒక్కటే తీర్చాలి.

ఈ పరిస్థితిలో ఆ ఉద్యోగమూ పోయింది ఇల్లు తాకట్టులోనూ వున్నది వారం రోజులు ఎక్కడికీ వెళ్ళకుండా ఇంట్లోనే వున్నారు.

ఈ సంఘటనతో వారిమీద నా మనస్సు సగమైపోయింది, ఈ మనిషికి జీవితంలో జ్ఞానోదయం కలుగుతుందా భగవాన్ అని వాపోయే దాన్ని. వారితో మనస్ఫూర్తిగా మాట్లాడాలని అనిపించేది కాదు. తాళి కట్టిన భర్తగా ఆ పవిత్ర బంధాన్ని గురించే వారిమీద ఆదరాభిమానాలు చూపటం జరుగుతున్నది. కాని వ్యక్తిగతంగా శ్రావణకుమార్‌గా వారి మీద సగం గౌరవం పోయింది, భార్యా పిల్లల్ని పోషించే ఇంటి యజమానిగా, ప్రేమానురాగాల్ని చూపే భర్తగా వారు గౌరవ ప్రదంగా మనగలుగుతారనే నమ్మకం లేకపోయినా, ఇల్లు తాకట్టుపెట్టి మమ్మల్ని వీధిలోకి ఈడ్చే వాతావరణం కల్పిస్తారని కల్లోనైనా అనుకోలేదు. ఎక్కడికక్కడ పరువుపోతుంటే మరీ ఇంత దారుణంగా ప్రవర్తిస్తారేమా అని బాధపడేదాన్ని.

అత్తయ్య సహించలేక పోయింది, ఎన్నో మాటలన్నది. బాగా తప్పుచేసినప్పుడు తలవంచి ఏం సమాధానం చెప్పకపోవటం ఇటీవల వారు బాగా నేర్చుకొన్నారు.

ఇదంతా చూస్తున్న రాధ ఒకసారి నన్ను వాళ్ళింటికి పిల్చి మాట్లాడింది. ఆడపిల్లయినా ఏ చెడు పేరూ తెచ్చుకోకుండా ఎంతో గౌరవ ప్రదంగా ఉద్యోగం చేస్తున్నది రాధ.

"సుభా, అస్తవ్యస్తమైన బావ జీవితాన్ని గురించి నీ ఉద్దేశ్యం" అన్నది రాధ.

"వారి జీవితానికికాదు, మా జీవితాలకు గ్రహణం పట్టింది. వారు బాగుపడతారనే నమ్మకం పూర్తిగా పోయింది రాధా, తెలిసి ఎవరూ ఉద్యోగం ఇవ్వరు, ఒకవేళ ఉద్యోగం దొరికినా వారు నిలబెట్టుకోలేరు."

"రెండువేల అయిదు వందలకు వడ్డీ సంవత్సరానికి ఆరొందలవుతుంది. అంటే నాలుగేళ్ళల్లో మొత్తం దాదాపు అసలూ వడ్డీకలిసి అయిదు వేలవుతాయి. నువ్వు తీర్చగలవనే నమ్మకం నీకున్నదా ?"

"లేదు. ఈ సంసారమనే విషవలయంలో చిక్కుకున్న ఈ జీవితాలకు మనశ్శాంతే లేదు. అప్పు తీరదు."

రాధ నా వైపు నిశితంగా చూసింది.

"సుభా, దూరదృష్టితో మీ కుటుంబ క్షేమంకోరి చెప్తున్నాను. నా ప్రశ్నలకు సరయిన సమాధానం చెప్పు. నీకన్న వయస్సులో అనుభవాల్లో చిన్నదాన్ని, పెళ్ళికూడా కాలేదు, కాని అడుగుతున్నాను."

కొంచెం బాధగా అన్నది. అడగమన్నట్టు చూశాను.

"ఈ స్థితిలో నీకు కావలసింది సంసార సుఖమా, ముత్తయిదువతనమా, లేక రెండూ కావాలా ?"

"రెండూ కావాలనే ప్రతి వివాహిత స్త్రీ కోరుకుంటుంది."

"ప్రతి వివాహిత స్త్రీ సంగతికాదు. నీ సంగతే నే నడుగుతున్నది."

"సంసార సుఖమందు ఇచ్ఛతగ్గింది. ఈ ఇద్దరు పిల్లలూ పెరిగి పెద్దవారై మంచిపేరు తెచ్చుకుంటే చాలు !"

"బావయందు ప్రేమానురాగాలు"

"ఇల్లాలుగా భర్తను ప్రేమించకుండా ఉండలేను. వ్యక్తిగతంగా వారియందు గౌరవం నశించినా భర్తగా వార్ని దూరం చేసుకోలేను."

"అంటే నీ భావాలు సంఘర్షణలోపడి కొట్టుమిట్టాడుతున్నాయి. ఏదో ఒక నిర్ణయానికి రాక తప్పదు."

"నీ అభిప్రాయం అర్థమైంది రాధా. అక్కయ్యను భర్త వదిలిపెట్టాడు. నేను భర్తను వదిలించుకోవాలి అంతేకదా !"

''అవును సుభాషిణీ, ఏదో ఒక నిర్ణయానికి నువ్వు రాకపోతే మరో విధంగా కొన్ని కొత్త అప్పులు నీ మెడకు చుడతాడు. క్రమేపీ ఇల్లూ, వాకిలీపోయి అద్దె ఇంట్లో ఉంటున్నావు. వాడుచేసే అప్పులు నీ జీతం లోనుంచి తీర్చక తప్పదు. ముందు ముందు ఇంకా బాధపడతావు సుభాషిణీ''

దూరదృష్టో దివ్యదృష్టో ఉన్నట్లుగా మాటాడిందిరాధ. ఆ మాటనిజమే అయినా భర్తను నా ఇంట్లోనుంచి వెళ్ళిపొమ్మని ఏ భార్యా ఎటువంటి దారుణమైన పరిస్థితిలోనూ అనలేదు. అనదు. భర్త ఎటువంటి వాడయినా ఆడదానికి భర్త సాన్నిధ్యం కావాలి. మర్రిచెట్టువల్ల ఏ ఉపయోగమూ లేకపోయినా ఆ చెట్టునీడన అందరూ సేద తీర్చుకుంటారు, ఆ చల్లదనాన్ని అందరూ కాంక్షిస్తారు. గులాబి మొక్కా, గులాబీ పూలూ సర్వ జనాదరణ పొందినా ఆ మొక్కనీడన కూర్చుని ఎవ్వరూ సేదతీర్చుకోరు. మన సాంఘిక వ్యవస్థలో భర్త వదిలిపెట్టిన ఆడదాన్ని సానుభూతితో చూస్తారు కాని నీచంగా చూడరు. మొగుణ్ణి వదిలేసి రంకు మొగుడితో ఉన్నాదని తెలిసీ తెలియని పరిస్థితిలో కూడా ఎన్నో అభాండాలు వేస్తారు.

రాధ అభిప్రాయాలతో ఏకీభవించలేకపోయాను.

"వార్ని వెళ్ళిపొమ్మని చెప్పమంటావా రాధా" అన్నాను. నిర్లిప్తంగా నా వైపు చూసింది రాధ.

"మాటలతో చెప్పనక్కర్లేదు, చేతలతో ఆ భావం వ్యక్తం చెయ్యి. తన కి ఇంట్లో స్థానం లేదనే వాతావరణాన్ని సృష్టించు. ఆ యధార్థాన్ని వాడు గుర్తించేటట్లు చేస్తే ప్రయోజనం ఉందేమో" అన్నది రాధ.

రాధ అభిప్రాయంతో ఏకీభవించలేకపోయాను. నావల్ల కాదని చెప్పేను.

"నీ కర్మ" అన్నది రాధ.

# 14

మళ్ళీ ఎక్కడైనా ఉద్యోగం సంపాదించాలని వారు నాలుగు మాసాలు ప్రయత్నం చేశారు. ఎక్కడా ఉద్యోగం దొరకలేదు. నా జీతంతో సంసారం గడవటమే కష్టంగా ఉన్నది. అన్నయ్య వందరూపాయలు ఇస్తూనే ఉన్నాడు. బావకు మరో ఉత్తరం రాసింది అక్కయ్య. ఆయన సమాధానం రాయలేదు. అక్కయ్య సెకండ్ ఫారం పుస్తకాలు పాసయితేనే కాని బావకు కనువిప్పు కలగదేమో!

ఈ నాలుగు నెలల్లో వారు నన్నొక్క రూపాయి అడగలేదు. పది రోజుల కొకసారి ఇంటికి వచ్చేవారుకాదు. ఎక్కడికి వెళ్ళారంటే ఉద్యోగ ప్రయత్నంకోసం ఎవరితోనో మాట్లాట్టానికి ఫలాని ఊరు వెళ్ళేనని చెప్పే వారు. కాని అదికాదు. వారి వ్యసనాలు మునుపటికన్న తగాయి కాని పూర్తిగా మానలేదు. ఎన్నో చెప్పే దాన్ని "అట్లాగే మానేస్తాను సుభా. ఇక తాగను. పేకాడను" అనేవారు కాని, నమ్మకం లేదు. నమ్మించలేక పోయారు.

సైకిలు అమ్మేశారు. రిస్టు వాచీ, ఉంగరంకూడా అమ్ముకు తిన్నారు. ఇంక అమ్మటానికి వారివద్ద ఏం లేదు. ఒక కళ్ళజోడు మినహా.

"ఇన్ని విధాలా భ్రష్టులై పోయారు. అసలు మీకు నీతి, నిజాయితీ, బాధ్యతా పరువు మర్యాదలూ ఏమీలేవా" కట్టుబాట్లు [illegible]గుతున్నావని తెలిసే అడిగాను.

"లేవు అన్నీ వదిలేశాను. ఈ పరిస్థితిలో నీతిగా బ్రతుకుదామను కున్నా ఎవ్వరూ నన్ను నమ్మరు. నమ్మి ఎవరయినా ఉద్యోగం ఇచ్చినా గౌరవం దక్కించుకుంటాననే నమ్మకం నాకూ లేదు. ఈ మానసిక సంఘర్షణలో నుంచి బయటపడి అవతలి వడ్డుకే వెళ్ళాను" అన్నారు.

"మీరు అన్నీ వదులుకున్నా నేను వేటినీ వదులుకోలేదు. నా పరువు మర్యాదల్నీ, పిల్లల భవిష్యత్తునీ కాపాడవలసిన బాధ్యత గల భర్తగా, కన్నతండ్రిగా మీకు లేవా."

" బాధ్యతనుంచీ తప్పుకోవలసిన పరిసితి రావచ్చు. నామీదే నాకు గౌరవమూ, బాధ్యతా లేనప్పుడు భార్యాపిల్లల భవిష్యత్తును గురించి నేను ఆలోచించినా ప్రయోజనం శూన్యం "

''ఇంత మొండిగా, అజ్ఞానంగా మాట్లాడుతారని అనుకోలేదు ఆడదాన్ని గౌరవంగా ఉద్యోగం చేసి ఇంత సంసారాన్నీ పోషిస్తున్నాను. చెప్పుకోతగిన ఒక్క మంచి చీరెలేదు. అన్ని కోరికలనూ చంపుకుని అన్ని అవమానాల్నీ భరించి కెరటాలకు తలవంచినట్లుగా ఈ సంసారాన్ని ఈదుకువస్తున్నాను. నామీద మీకు ప్రేమానురాగాలు లేవు. ఆదరణా ఆప్యాయతా లేదు. గౌరవం లేదు. కోరిచేసుకున్న ఇల్లాలివనే మక్కువా, మమకారమూ లేదు. అడవి జంతువుల్లా కాపురం చేస్తున్నాం." నా కళ్ళల్లో ఆర్ద్రత లేదు. మనస్సు ఎండి హృదయం బండబారిపోయింది, ఆఫీసులో ఉన్న ఆ కాసేపూ మినహా రాత్రింబగళ్ళు ఇదే ఆలోచన. ఈ అప్పుఎట్లా తీరుతుంది. ఈ ఇల్లు ఎల్లా నిలబడుతుంది. ఇదే ఆలోచన.

"నన్ను గురించి ఏ ఆలోచనలూ పెట్టుకోవద్దు. ఇలాంటి అఘాయిత్యాలు నేను మళ్ళీ చేసినా నువ్వేమీ పట్టించుకోకు సుభా" అన్నారు. ఈ మనిషితో మాటాడి ప్రయోజనం లేదనుకున్నాను.

రోజులు గడుస్తున్నయ్యి. వారొక బ్రాకెట్ కంపెనీలో కమీషన్ ఏజంట్‌గా చేరారు. ఈ బ్రాకెట్ కంపెనీల సంగతీ, ఆడేవారి సంగతి వేరే చెప్పక్కర్లేదు. కూలి చేసుకునే వాడినుంచి ఉద్యోగస్థులవరకూ చాలామందికి ఈ కాటన్ మార్కెట్‌యందు మక్కువ ఎక్కువే. చదువుకున్న వాడిని ప్రోత్సహించి వాళ్ళచేత డబ్బుకట్టించే ఏర్పాటుతో ఆ కంపెనీ తరపున ఏజెంట్‌గా చేరారు. ఈ సంపాదనవద్దని ఎంతో చెప్పాను.

వారు వినలేదు, మూడు మాసాలు నిర్విరామంగా కృషిచేసి పనిచేశారు. నెలకు మూడు వందలకు పైగా కమిషన్ వచ్చేది. కాని ఎట్లా వచ్చింది అట్లాగే పోయేది. తెల్లవారు ఝామున మూడు గంటలు దాటాక ఇంటికి చేరేవారు. రెండు మూడు రోజులకొకమారైనా బ్రాందీ వాసన కొట్టేది ఉదయం పదిగంటలు దాటాక నిద్ర లేచేవారు. అన్ని విషయాల్లోనూ వారు మొండికెత్తారు. నేను గుండె రాయి చేసుకున్నాను. తాగివచ్చిన రోజున ఎదురు దెబ్బలు నమస్కరించే దాన్నే కాదు. పెళ్ళికాని ఆడదానికి ఒకటేదిగులు. నాబోటి దానికి లెక్కలేనన్ని దిగుళ్ళు.

ఒక్కోసారి ప్రాణం తీసుకుందా మనిపించేది. ధనవంతుడూ, ఆరోగ్యవంతుడూ ఒకటేసారే చస్తాడు. పిరికివాడు రోజూ చస్తూనే వుంటాడు. నాబోటి ఆడది చచ్చినా ఒకటే బ్రతికినా ఒకటే ఎవరు పట్టించుకుంటారు? తల్లో పూలు పెట్టుకొని మూడేళ్ళయింది. నా బ్రతుక్కి సార్థకత ఏమిటి? నే నెందుకు బ్రతుకుతున్నాను!

చావటానికి అనేక మార్గాలు. గోదావరి, రైలుపట్టాలు, విషం, ఎండ్రిన్, ఓహ్. చావటానికి బాధ పడక్కర్లేదు. కాని తెంపు కావాలి, చావుకి తగ్గా మనస్సు పరిపక్వం చెందాలి. కాని నేను చావాలనుకున్నా చావలేకపోయాను. కాన్వెంట్ డ్రస్‌లోవున్న పెద్దవాడూ, నా కొంగు పుచ్చుకుని తిరిగే చిన్నవాడూ నాకు ప్రతిబంధకాలు. ఈ పసివాళ్ళను విడిచి నేను పోలేను. నేను చావలేను వాళ్ళు తల్లిలేని పిల్లలు కాకూడదు. తండ్రి వుండికూడా లేనివాళ్ళలో జతే. ఉన్నతల్లి చావటం ఎందుకు? చచ్చి ఎవర్ని సాధించాలి? చచ్చి సాధిస్తారు కొంతమంది. వాళ్ళ పరిస్థితి ఏమిటో?

మరో నెల గడిచింది. ఒకసారి అన్నయ్యతో చెప్పాను. వారూ నవ్వి "ఆ ఉద్యోగం నేనే ఇప్పించాను మరి" అన్నారు. ఆశ్చర్యపోయాను.

"ఇంతవరకూ నా కెప్పుడూ చెప్పలేదేం?"

"నాకేం తెలుసు బావ చెప్పాడేమో అనుకున్నాను."

"వారు ఏ కూటమిలో చేరారా, జైలుకు వెళ్ళే పరిస్థితి వస్తుందా" ఆవేదనతో అడిగాను

"మేం చేసేవి ఉద్యోగాలు కావు సుభా. జీవితాంతో పందాలు కడతాం. ఆడుకుంటాం. అవసరం వస్తే జైలుకేకాదు, ఆ లోకానికే వెళ్ళాలి ఇంక అడక్కు. వెళ్ళొస్తాను" అన్నయ్య వెళ్ళిపోయాడు.

వారిమీద ఏవగింపు కలిగింది. అవసరం వస్తే ఆ లోకానికేవెళ్ళాలి. ఆ లోకం ఆ లోకం !

"భగవంతుడా వార్ని కాపాడు. నాకా సంసార సుఖం అక్కరలేదు. భర్త ఆదరణ అనురాగమూ అక్కరలేదు. పసుపు కుంకుమ కావాలి. అంతే. అంతే" మనస్సు విలవిల్లాడింది.

పది రోజులు గడిగాయి. వారు ఇంటికి రావటం మానేసి వారం రోజులైంది. ఎక్కడున్నదీ తెలీదు ఏ ఊరు వెళ్ళిందీ తెలీదు. అప్పటికి తారీఖు ఇరవై ఒకటో, ఇరవై రెండో. అన్నయ్యను అడుగుదామంటే వాడి అడ్రసూ తెలీదు. ఎన్నిసార్లడిగినా వారు చెప్పనేలేదు. ప్రతినెలా అయిదారు తారీఖులలో వచ్చి డబ్బిచ్చి వెళతాడు. అంతే, వాడు మళ్ళీ కనుపించాలంటే అయిదారు తారీఖులు రావాలి. ఈ లోగా వాడి ఆచూకీ తెలీదు.

మరొక మూడు రోజులు గడిచాయి. అత్తయ్య, వేమా, అమ్మ అందరం ఖంగారుపడుతున్నాం. అన్నయ్యకి ఆ రోజున అన్న మాటలు గుర్తొచ్చాయి: "అవసరం వస్తే జైలుకేకాదు. ఆ లోకానికి వెళ్ళాలి" వారు వారు....ఆ లోకానికి వెళ్ళారా ?

రాత్రి ఒంటిగంటకు తలుపు చప్పుడైంది. వారే నమకుని అదుర్దాగా తలుపు తీశాను. వారు కాదు. అన్నయ్య. లోపలికి వచ్చి తలుపువేశాడు, నెమ్మదిగా చెప్పాడు.

"సుఖా. బ్రాకెట్ కంపెనీ కలెక్షన్ల తాలూకు డబ్బు మూడు వేలు తీసుకుని బావ పరారీ అయినాడు కాకినాడ చేరి వారం రోజులైంది. పాత ఖాతాలన్నీ అనుభవిస్తూ కాకినాడలో మకాం వేశాడు. నిన్ననే పట్టుకున్నాం. మూడువేలూ ఖర్చు పెట్టేశాడు. ఇప్పుడు బావ మా రహస్య స్థావరంలో ఉన్నాడు. మరొకడైతే నేను చెప్పినట్టు ఆ లోకానికి పంపించే వారే. నా బావమరిది అని తెల్సుకనక అంత పనీ వాళ్ళు చెయ్యలేదు. ఆ మూడువేలూ ఇచ్చేస్తే బావను వదిలిపెడతారు. లేకపోతే అంతే. ఏమంటావు సుఖా."

ఇంత దారుణం జరిగినా మనిషి యందు కోపం ఉంటుంది. కాని చంపివెయ్యమని ఎవరు మాత్రం చెప్తారు, పది నిమిషాలు ఆలోచించాక అత్తయ్య అన్నది.

"ఇంటి అప్పు ఎట్లాగూ తీరేదికాదు. పాపం పెరిగినట్లు వడ్డీ పెరుగుతున్నది. ఇల్లు అమ్మేసి ఆ డబ్బు కట్టేసి ఈ సారికి వాడి పుచ్చె కాద్దాం. అంతకన్న మార్గంలేదు" ఏడుస్తూ చెప్పింది. నాకూ అంతకన్న గత్యంతరం కనబడలేదు.

"ఇల్లు అమ్మి డబ్బు కట్టేదాకయినా వారుండాలికదా! మనిషిని వదిలి పెడితే వారం పదిరోజుల్లో ఇల్లమ్మి డబ్బు కట్టేస్తాం. వార్ని వదిలి పెట్టమను." జీవచ్ఛవంలా కూర్చుని చెప్పాను.

"వాళ్ళకు నేనూ అదే హామీ ఇచ్చాను. విడుదలయ్యాక డబ్బు కట్టకపోతే ఎట్టా రాబట్టుకోవాలో వాళ్ళకూ తెల్సు. సరే రేపే వచ్చేస్తాడు. ఇల్లు అమ్మకం ఏర్పాటు చూడండి" అని చెప్పి అన్నయ్య వెళ్ళి పోయాడు.

అన్నయ్య వెళ్ళాక అత్తయ్య నెత్తిబాదుకుని ఏడ్చింది. "వాడు కాకినాడలోనే చచ్చిపోతే బాగుండేది. ఈ పసివాళ్ళకు తలదాచుకోటానికి ఇల్లయినా మిగిలేది. ఇంక ఈ ఇల్లుకూడా అమ్మేస్తే ఘువ సంగతి తెల్సి

ఎవరు మటుకు ఇల్లు అద్దెకిస్తారు. చివరకు దిక్కులేని వాళ్ళమాదిరి చెట్టు కింద కాపురం పెట్టాలేమో" అని వాపోయింది. నాకు ఏడుపు రాలేదు. నిండా మునిగిన వాళ్ళకు చలివుండదు.

ఉదయానే వారు వచ్చారు. ఇంట్లోకి రాగానే అత్తయ్య గోడు గోడున ఏడుస్తూ ఎన్నో మాటలని ఎన్నో చివాట్లువేశారు. బెల్లంకొట్టిన రాయిలా ఏ సమాధానంలేదు.

"ఇంతటితో ఈ ఇంటికీ మనకూ ఋణం తీరిపోయింది. ముందు ముందు మీరు చెయ్యబోయే ఘనకార్యాలకు ఎవరిల్లు అమ్ముతారు" అన్నాను. "ఆ రోజువస్తే ఏదో ఉపాయం తట్టకపోదు" అన్నారు. అంతే కాని తమ తప్పు ఒప్పుకోలేదు.

ఆ మర్నాడే మేం అప్పు తెచ్చుకున్న షావుకారువద్దకు వెళ్ళి అడిగాం. ఆరువేలకూ ఇల్లు తీసుకుంటానని చెప్పి వడ్డీతోసహా ఆ బాకీ మూడు వేలయిందని లెక్కకట్టి, మిగతా మూడువేలూ దస్తావేజు రాయించి రిజిష్టరు చేయించే రోజున ఇస్తానన్నాడు.

మరో వారం రోజుల్లో ఆ పనీ పూర్తయి ఆ బ్రాకెట్ కంపెనీ మూడువేలూ కట్టేశారు. ఇల్లు పోయింది. మేం మిగిలాం. నెల రోజుల్లో ఇల్లు కాళీ చెయ్యాలి. అత్తయ్య మూడు రోజులూ కటిక ఉపవాసం చేసి ఏడుస్తూ పడుకున్నారు. నా కళ్ళు ఏ మాత్రం చెమర్చలేదు.

వారం రోజులలో అద్దెకు ఇల్లు దొరికింది. కాళీచేసే రోజున అత్తయ్య మనిషి చచ్చిపోయినంతగా విచారపడ్డది. ఆ ఇంటిలో ఆవిడ పాతికేళ్ళకు పైగానే ఉంటున్నది. ఆ కాస్త చిన్న పెంకుటింటినీ ఆవిడ అభిరుచికి అనుగుణంగా తీర్చిదిద్దుకున్నది. దేవుడు మందిరాన్ని ఆవిడ స్వయంగా కట్టుకుని రంగులూ, ముగ్గులూ వేసి అలంకరించింది. వంట ఇంటికి దగ్గరగా నీళ్ళకు సిమెంటు తొట్టె కట్టించింది. పెరట్లో వంట ఇంటి గుమ్మానికి ఎదురుగా ఎంతో అందంగా తులసికోట కట్టించింది. వీధి గుమ్మంలో నుంచుని చూసినా పెరట్లో ఆ తులసికోట కన్నుల పండు

పుగా కనిపించేది. తులసిమొక్క కూడా గుబురుగా పెరిగి చూడముచ్చటగా ఉంది. అద్దె ఇళ్ళల్లో ఇట్లాంటి తులసికోట నా కోసం ఎవరు కట్టిస్తారని కన్నీరు నింపుకుని మూడుసార్లు ప్రదక్షిణ చేసి ఆ తులసికోటకేసి తల బాదుకున్నది. కొంకాయ నీళ్ళలా ఎంతో తేటగా తియ్యగా ఉండే ఆ బావినీళ్ళు పాతిక చేదలకు పైగా తోడి పోసుకున్నది. ప్రతి గుమ్మం దగ్గరా నిల్చొని చేతితో తాకిచూసి ఇంక ఈ గుమ్మాలకు పసుపు కుంకుమతో బొట్లు పెట్టి అలంకరించే యోగ్యత లేదుకదా అని వాపోయింది. ఇంటిచుట్టూ తిరిగివచ్చి వచ్చే వెక్కిళ్ళని ఆపుకోలేక బావురుమని ఏడ్చి కళ్ళు తుడ్చుకుని అద్దె ఇంటికి బయల్దేరింది.

ఇన్ని నెల్లనుంచి ఉండటంతో ఆ ఇంటిమీద మమత ఏర్పడ్డ అమ్మ అక్కయ్య కూడా ఎంతో బాధపడ్డారు. అద్దె ఇంటికి ఆఫీసు దగ్గర. రాధ వాళ్ళ ఇల్లు కాస్త దూరం.

జీవితాలు శాశ్వతం కావని తెల్సినా మనిషి పోతే బాధపడటం సహజం. స్వంత ఇల్లు అప్పులు తీర్చుకోటానికి అమ్ముకున్నా అలాంటి బాధే కలుగుతుంది.

ఈ అద్దె ఇల్లు వరుసగా మూడు గదులు. గదులు కాస్త పెద్దవే అయినా ఇల్లు చాలా పాతది. దుమ్ము జాస్తి. పంపు లేదు. బావి ఉన్నది. కరెంటు ఉన్నది, అద్దె ఏభై రూపాయలు. ప్రతి నెలా నాకు వచ్చే జీతంలో ఏభై రూపాయలు అద్దె చెల్లించాలంటే ఏ ఖర్చులు తగ్గించుకోవాలో అర్థంకాలేదు. ఇంటిలో వాళ్ళు మధ్యాహ్నంపూట కాఫీ కూడా మానేశారు. నేను టిఫిన్ మానేసి కాఫీ మాత్రం తాగేదాన్ని. లేకపోతే టైపుమిషన్ మీద వేళ్ళు త్వరగా జరిగేవికావు. నీరసంచేత చేతులు పీక్కుపోయేవి. పట్టుమని పాతిక రూపాయలు ఖరీదుకు మించిన చీరె కట్టుకోలేదు. సర్వ సాధారణంగా ఉద్యోగంచేసే ఆడవాళ్ళు ఎంతో దర్జాగా ముప్ఫైనలభై ఖరీదయిన అన్ని రకాల చీరెలూ కడుతూ ఉంటారు. వాళ్ళ అందరు నేత చీరెలకు మించి లేవు. చేతికి రిస్టువాచీ అయినా లేదు. ఒక

జత బంగారు గాజులు, మూడు కాసుల గొలుసు ఇవే నా ఆభరణాలు. వేసుకున్న మంగళ సూత్రాలతాడు నల్లపూసలు, ఇన్నేళ్ళనుంచీ ఉద్యోగం చేస్తున్నా బంగారపు పుస్తెలతాడు చేయించుకోలేకపోయాను. ఆలోచించి చూస్తే నాది దురదృష్ట జాతకం కావటంచేతనే వారి జీవితం ఇంత తారు మారయిందా అని అనుకుని బాధపడేదాన్ని.

అద్దె ఇంటిలో చేరిన వారం రోజులవరకూ వారి చరిత్ర ఇంటి వారికి తెలీలేదు. నా ఉద్యోగం సంగతే చెప్పాను. కాని వారికి ఉద్యోగం లేదనే చెప్పాను పరిస్థితులన్నీ విని ఇంటావిడ చాలా బాధపడ్డది. ఇంటి యజమాని ఒకసారి వార్ని పలకరించాడు. వారిమీద ఆయనకు సదభి ప్రాయం కలుగలేదు, ఇల్లు ఖాళీ చెయ్యమని అంటాడేమోనని భయ పడ్డాను కాని ఆ ముక్క అనలేదు ఆ ఇంటిలో రెండే భాగాలు ఒక భాగం మేం ఉండేది. రెండో భాగంలో ఇంటి వారుంటారు. పెరటిలో కాంపౌండ్ గోడ మీదినుంచీ వాలుగా బంగళా పెంకుతో రెండు గదులు చిన్నవి వేశారు. ఆ చిన్న భాగం అద్దె పాతిక రూపాయలు. అందులో భార్యాభర్తలూ ఒక పసివాడూ, చిన్న కుటుంబం. ఇంటాయనకు పొగాకు కంపెనీలో పని. ఆయన మంచి వ్యవహారం. మాటకారి. పెరటిలో ఇంట్లో అద్దెకున్నాయనకు ఒక రైస్ మిల్లులో ఉద్యోగం. ఇంటి వాతావరణం బావున్నా ఈ ఉద్యోగం లేని వీర్ని చూస్తే వాళ్ళకూ చిన్న చూపుగానే ఉన్నది. అన్నయ్య కూడా ఒకసారి వచ్చి ఇల్లు చూసి వెళ్ళాడు.

ఈ ఇంటిలో చేరిన వారం పది రోజులవరకూ ఎక్కడికీ వెళ్ళే వారుకారు. ఏదో ఆలోచిస్తూ ఇంటిలోనే కూర్చునేవారు అమ్మ, అక్క య్యతో మాటాట్టం ఎప్పుడూ లేదు. ఇప్పుడు అత్తయ్యతోనూ ఎక్కువగా మాటాడ్డం లేదు,

భార్యగా నా ధర్మాన్ని నెరవేర్చుకోవటమే కాక ఇంటి యజ మానిగా కూడా అందరూ నన్ను గుర్తించేవారు.

ఒకరోజున ఈ జరిగిపోయిన సంఘటనలన్నీ తల్చుకుంటుంటే జీవితం ఇంత తారుమారయిందా అని కడుపులో ఏమిటో దేవినట్లయింది. అక్కయ్య రెండు ఉత్తరాలు రాసినా బావ సమాధానం రాయలేదు, దాని మన స్తత్వం చాలా వరకూ మారినా బావకు మొట్టమొదటి అభిప్రాయం ఏ మాత్రం మారలేదు.

సిగరెట్ కాలుస్తూ కుడి అరిచేతిలోని రేఖల్ని చూసుకుంటున్నారు.

"చేతిలో మంచి రేఖలున్నా బుద్ధికీ రేఖలకూ సంబంధం లేదేమో" అన్నాను.

"లేదు సుభా, జీవిత రేఖ మంచిదే. కాని పెళ్ళయాక నా అదృష్టమే నన్ను తిప్పి కొట్టింది, ఈ జరిగేదంతా కేవలం నా తప్పేకాదు. నీ దురదృష్టపు క్రీనీడలు ప్రతి సంఘటనలోనూ నా మీద పడుతూనే వున్నాయి" అన్నారు.

"లేదు, మీలోని కాంక్షకూ, కుట్ర మన స్తత్వానికి కారణం నేనూ కాదు నా కర్మ కాదు. మీ స్వార్థం, దుడుకుతనం. ఎంతో తేలికగా ఎవరి తప్పయినా సరే కాజేసి వాడుకోవాలనే కుటిల మన స్తత్వం. మీ దురదృష్టాన్ని నేనూ, పిల్లలూ పంచుకోవటం నుంచే మీకు జైలుకూడా తప్పింది. మీలో చెలరేగిన ప్రతి సంఘర్షణకూ మీరే కారణం, వాటి పరిణామాలు మేము అనుభవిస్తున్నాం."

వారికి బాధ కలుగుతుందని తెల్సు కాని ఎంత కాలమని వారి కోసం నా మనస్సుని సరిపెట్టుకుని ప్రతీ దారుణమైన సంఘటనకీ తలవంచి కూర్చునేది? ఎదురు తిరగాలనే మన స్తత్వం కాకపోయినా వారేమయినా బాగుపడతారేమోననే లవలేశమైన ఆశతో వారి మనస్సుకు సూటిగా తగిలే టట్టుగా మాట్లాడుదామనే నా ఉద్దేశం. కాని తాత్కాలికంగా ఎప్పటికప్పుడు వారు తమ ఓటమిని ఒప్పుకున్నా తేలుకొండిలాంటి వారి మన స్తత్వం వంకర తిరిగి కుడుతూనే వుంటుంది.

"సుభా, నీ సంపాదనతో నన్ను పోషిస్తున్నాననే ధీమాతో ఇట్లా మాటాడుతున్నావా లేక నాకేదో హితబోధ చేద్దామనే ఉద్దేశంతో సంపాదనపరురాలివి కనుక వయస్సుకు మించిన పెద్దరికపు ధోరణిలో మాటాడుతున్నావా" అన్నారు.

పేలవంగా నవ్వి నిట్టూర్చాను. సుమతీ శతకంలో పద్యాలూ, వేమన శతకంలో పద్యాలూ ఎన్నో గుర్తుకొచ్చాయి. ఇంక జీవితంలో తెచ్చుకోవలసింది ఒక్కటే. కాని అంత దూరం పోదల్చుకోలేదు.

"ధీమాగా హితబోధ చేద్దామనే ఉద్దేశ్యం నాకులేదు. కాని ఒక్కటి మాత్రం సత్యం. మీకన్నా వయస్సులో అయిదేళ్ళు చిన్నదాన్ని. కాని అనుభవాలూ జీవితంలో కొన్ని సంఘటనలూ నన్ను పెద్దదాన్ని చేశాయి. మీ అనురాగ వాహినిలో తలమున్కలుగా స్నానంచేస్తూ ఆశల్నీ ఆశయాల్నీ చిగురింపచేసుకుందామని ఉవ్విళ్ళూరిన నేను, మీరు చేస్తున్న ఘాతుక కృత్యాలతో తలమునిగి తాటి ప్రమాణాన ఉండి అన్ని ఆశయాల్నీ సుడిగుండాలలో విడిచిపెట్టానేగాని ఒక్క కోరికనూ తీర్చుకోనేలేదు. ఇప్పుడు నేను అన్ని కష్టాల్నీ అనుభవించిన ముదివగ్గును" అన్నాను.

వారు మాట్లాడకుండా బైటికి వెళ్ళిపోయారు. ఆ రోజల్లా ఇంటికి రాలేదు. అందుకు నేనూ బాధపడలేదు. అక్కయ్య నన్ను కేకలేసింది.

"తను చేసిన ప్రతి తప్పునూ, నేరాన్నీ నువ్వు సమర్థనీయంగా సరిపెట్టడంతో ఆయన మనస్సు చిన్నబుచ్చుకుని లోలోపల కుమిలిపోతున్నారు. నీ మాటలు ఆయన్ని మరీ బాధపెట్టి మరో దుర్మార్గం చెయ్యటానికి దోహదం చేస్తున్నాయేమో, ఆ దృష్టితో ఆలోచించావా సుభా" అన్నది.

ఇన్నాళ్ళకుగాను, ఇన్నేళ్ళకుగాను అక్కయ్య నోరు మెదిపి వారి విషయంలో ఈ అభిప్రాయానికి వచ్చింది. కోరికలంటే ఏమిటో తెలియని అక్కయ్య అన్ని కోరికల్నీ అవగాహన చేసుకుని అన్ని ఊహల్నీ ఆ

కోరికలకు జతచేసి తన మనస్సులో దాచుకున్నది. దాని ఊహలకూ, కోరికలకూ సార్థకత ఎప్పుడైనా దాని జీవితంలో కొత్త అనుభవాలూ, కొత్త కష్టాలూ ఏమిలేవు. నా పరిస్థితి అందుకు పూర్తిగా విరుద్ధం. కావలసిన సుఖాలు కాసినీ ఎన్నో కష్టాలలో కార్పణ్యాలతో ఆర్థిక ఇబ్బందులలో, అప్పుల్లో-ఆస్తి అమ్మకాలలో కలగా పులగంగా కలిసిపోయాయి ఇన్నీ కలిసి ఏర్పడిన ఈ రాశిని జల్లెడపడుతూ కూర్చున్న నేను అక్కయ్య అభిప్రాయాలకు నవ్వుకున్నాను-లేకపోతే నే నుండే ఈ పరిస్థితికి నవ్వటానికిగానీ సంతోషపడ్డానికిగానీ ఆస్కారమేలేదు.

"మీ మరిది మరో కొత్త దుర్మార్గం చెయ్యటానికి పథకం వేస్తున్నారంటావా అక్కయ్యా"

"తెలిసీ తెలియని నా పిచ్చిమనస్సుకు అలాంటి అనుమానం కలిగింది సుభా. ఎందుకంటే శనగపప్పు బెల్లంలా డబ్బుల్ని తినేసిన ఆయన ఆకలి ఈ పరిస్థితుల్లో ఎట్లా తీరుతుందని నీ ఉద్దేశ్యం. ఈ డబ్బు కావాలనే ఆకలిచేత, కొట్లవెంటపడి అడుక్కు తినే అలగా జాతి బిచ్చగాళ్ళలా డబ్బు ఎటా ఎక్కడ దొరుకుతుందా అని వెయ్యికళ్ళతో వెతుకుతూ ఉంటాడేమో" అన్నది అక్కయ్య.

కాసేపు ఆలోచించాను. అక్కయ్య చెప్పింది నిజమే. కాని ఈసారి ఆ డబ్బు ఎట్లా సంపాదిస్తారు? ఏమో ఎవరి కెరుక? మళ్ళీ అట్లాంటి పనులే చేస్తే? "అక్కయ్యా. ఈసారి అమ్మేందుకు ఇల్లెక్కడిదీ. మనం ఉంటున్నది అద్దె ఇల్లు. స్వగృహంకాదు" అన్నాను. అక్కయ్య పకపక నవ్వింది. ఇదివరకు అక్కయ్య నవ్వితే దాని ముఖంలో చూపుల్లో వెకిలితనం ప్రస్ఫుటంగా కనిపించేది. కాని ఈ నవ్వులో ఎంతో హుందాతనం మనుష్యుల్నీ వాళ్ళ మన స్తత్వాల్నీ అంచనా వేయగల తెలివితేటలూ కనిపించాయి.

"స్వగృహాణివి నువ్వుండగా మరిదిగారికి లోటేం ఉన్నది సుభా. కార్యసాధన ఆయన వంతు. కర్తవ్యం నీ వంతు. ఇకనుంచీ ఆయన

చేసిన అప్పులు నీ జీతంలో తీర్చాలి. భర్త కావాలో, ఉద్యోగం కావాలో నిర్ణయించుకోవలసిన పరిస్థితి వచ్చింది. ఈసారి చేసే అప్పులు పెద్ద మొత్తంలో లేకపోయినా నీ జీతానికి సరిపోయేవిగానే ఉంటయ్యి" అన్నది అక్కయ్య. ఆలోచిస్తే దానికున్న దూరదృష్టి నిజంగానే నాకు లేక పోయింది

"ఇంత తెలివితేటల్ని సంపాదించుకున్న దానివి నీ కాపురమన్నా ఒక ఒడ్డునపడితే అమ్మ ఎంతో సంతోషిస్తుంది. ఆ ప్రయత్నం చెయ్య రాదా అక్కయ్యా" అన్నాను.

"ఇంకొక రెండేళ్ళు పోనివ్వు. నేను మెట్రిక్ తప్పక పాసవు తాను. వారు నన్ను అప్పుడయినా తప్పక ఆదరిస్తారనే నమ్మకం నాకు న్నది, ఆ కారుమబ్బులు విడిపోతయ్యి" అన్నది. నా మనస్సులో ఆనందం తొణికిసలాడింది.

# 15

వంద రూపాయలు ఇవ్వటానికి అన్నయ్య వచ్చినప్పుడు అమ్మ వెనుక అక్కయ్య నిల్చునేదే కాని అన్నయ్యతో మాట్లాడేదికాదు. ఈసారి అన్నయ్య వచ్చినప్పుడు అక్కయ్య పలకరించింది.

"తమ్ముడూ నీ డబ్బు ఎటువంటిదయినా, నువ్వు ఎట్లా సంపా దిస్తున్నా మనస్ఫూర్తిగా నువ్వు అభాగ్యురాలైన అమ్మకూ, భర్త ఆదరణకు నోచుకోని నాకూ సహాయం చేస్తున్నావు. అందుకు నేను సర్వదా నీకు కృతజ్ఞత తెలుపుకోవాలి మనసారా కృతజ్ఞత తెలుపు కుంటున్నాను కాలగమనం గత చరిత్రల్ని మార్చివేసినట్లే, కొందరి

జీవితాలనూ, అదృష్టాన్నీ మన స్తత్వాన్నీ గుణగణాల్నికూడా మార్చి వేస్తుంది. అందుకు ఉదాహరణ చెడుగా చెప్పాలంటే మన సుభాషిణి భర్త శ్రావణకుమార్, మంచిగా చెప్పాలంటే నేనూ నా వెకిలితనమూ. తెలివితక్కువతనమూ నీకు తెలియందికాదు. కాని నా జీవితం తిరగబడింది. నేనిప్పుడు ఇంట్లోనే థర్డుఫారం పుస్తకాలు చదువుతున్నాను. ఈ వేసవి గడిచాక ట్యుటోరియల్ కాలేజీలో చేరి మెట్రిక్ పరీక్షకు చదవాలని కోరిక. చదివి పాసవగలననే ధైర్యం, నమ్మకంవుంది. ఈ రెండు సంవత్సరాలూ ఈ బాధ్యతకూడా నువ్వే తీసుకుని తగిన ధన సహాయం చెయ్యాలి. మెట్రిక్ పాసయ్యాక నేనే నీ సహాయంతో వారి దగ్గరకు వెళ్ళిపోతాను. నా చదువుకు సహాయం చెయ్యి. నువ్వు తమ్ముడివైనా ముకుళిత హస్తాలతో ప్రార్థిస్తున్నాను" అన్నది అక్కయ్య. అందరం ఆశ్చర్యంతో విన్నాం. అన్నయ్యకూడా ఎంతో విభ్రాంతితో విన్నాడు. ఆనందంతో వాడి కళ్ళు చెమర్చాయి.

"నాది దుర్మార్గపు సంపాదనయినా రాణింపుకు వస్తున్నదంటే నా మనస్సు సంతోషంతో ఊగిపోతున్నది అక్కయ్యా. ఇలాంటి సంపాదన నిలవదంటారు. రాణింపుకు రాదంటారు. కాని నా విషయంలో ఆ సిద్ధాంతాలు తారుమారయ్యాయి. నీ కోసం మరొక రెండు గంటలు కష్టపడతాను. పై నెలనుంచీ నెలకు నూటయాభై ఇస్తాను. సరేనా" క్షణం ఆగకుండా వెళ్ళిపోయాడు అన్నయ్య. అక్కయ్య ముఖం ఆనందంతో విప్పారింది.

అక్కయ్య అడగంగానే అన్నయ్య నెలకు ఏభై రూపాయలూ ఇవ్వటానికి అంత తేలిగ్గా వప్పుకున్నాడంటే ఆ వ్యాపారమూ ఉద్యోగమూ ఏమిటో తెలియక వార్ని అడిగాను.

"ఈ ఊళ్ళో పేరు మోసిన పెద్దమనుష్యులు రెండు లాడ్జింగులూ, బ్రాకెట్ కంపెనీలూ, జూదగృహాలూ నడుపుతూ పీలువిబట్టి దొంగనోట్ల చెలామణీచేస్తూ ఉంటారు. అట్లాంటివి నడపాలంటే అర్థ బలమేకాక

అంగబలమూ, చాకులాంటి కుర్రాళ్లూ కావాలి. మన వాణీనాథం ఈ వ్యవహారాల్లో ఆరితేరినవాడు. వాటి మేనేజ్‌మెంట్ చూస్తూ ఉంటాడు. నెల జీతమేకాక కొంత కమీషనూ ఉంటుంది. ఏం ఎందుకడిగావ్. నువ్వూ అందులో చేరమంటావా?" నా సలహా ఏదో కావలసినట్లుగా చూస్తూ అన్నారు. వాడుచేసే దారుణ కృత్యాల్నీ, గడుపుతున్న పాపపంకిలమైన జీవితాన్నీ తల్చుకుని అసహ్యించుకున్నా అక్కయ్యనూ. అమ్మనూ మాట తప్పకుండా పోషిస్తున్నాడంటే వాడి నిజాయితీకి మెచ్చుకున్నారు. ఆ దృష్టితో చూస్తే వీరికన్న వాడే ఎంతో నయమనుకున్నాను. అన్నయ్య చర్యల్ని సమర్థించలేకపోయినా వాడు ఎవరికీ ద్రోహం చెయ్యలేదు. ఏదో ఆలోచిస్తే తల దిమ్మెత్తిపోతుంది. మీ ఉద్యోగం సంగతీ, వ్యాపారం సంగతీ, చెయ్యబోయే దారుణ కృత్యాల సంగతీ, నాకు చెప్పనక్కర్లేదు. మంచి మంచి అనుభవాల్ని పునశ్చరణ చేసుకున్నా మనస్సుకు ఆనందంగా ఉంటుంది. చరిత్రహీనుల జీవితాలు చెద పురుగుల్లాంటివి. ఇతరుల మనస్సునీ, హృదయాల్నీ కొట్టిపొయ్యటం తప్ప ఈ చెదపురుగులవల్ల ఉపయోగం ఏ మాత్రంలేదు" అన్నాను.

దుష్టుడికీ, దుర్మార్గుడికీకూడా మనస్సు. యుక్తా యుక్త విచక్షణా జ్ఞానమూ సామాన్యునికన్నా ఎక్కువే ఉంటయ్యి. కాని ఆ విశృంఖలమైన మనస్సు దుర్మార్గంవైపే కేంద్రీకరించబడి లీనమైపోతుంది. కాని మంచివైపు ఆ మనస్సు కన్నెత్తి చూడదు. మనిషి కళ్ళు ప్రపంచాన్ని చూస్తాయి కాని దుర్మార్గుడి మనస్సులోని కళ్ళు మంచివైపు చూడనే చూడవు. ఒకవేళ చూసినట్లు నటించినా అది మనస్సుకు వచ్చదు.

"నన్ను ఇంట్లోనుంచి వెళ్లిపొమ్మంటావా సుభా. ఇంట్లోనుంచే కాదు నీ జీవితంనుంచే తొలగిపొమ్మన్నా తొలగి పోతాను. కాని ఆ ప్రతిపాదన నీ ద్వారానే రావాలి" అన్నారు. నాకూ వళ్లు మండిపోయింది మంచి కయినా చెడుకయినా ఒక హద్దుండాలి. కోడెత్రాచయినా ఒక మనిషిని ఒకేసారి కాటు వేస్తుంది కాని ఆ మనిషి శరీరంమీద పదిచోట్ల కాటు వెయ్యదు. కాని వీరి నిజాయితీని శాశ్వతంగా వదులుకున్న వాళ్ళు ఒకే

వ్యక్తిని ఒకటికి పదిసార్లు ఇబ్బంది పెడుతూనే ఉంటారు. అట్లాంటి వాళ్లు ఎప్పుడు ఏం చేస్తారో తెలీదు.

"భార్యచేత అనరాని మాట అనిపించుకునేటంత పరిస్థితికి మీరెందుకు దిగజారి పోయారో నాకు అర్థంకాదు. చదువూ, సంస్కారమూ ఉండి ఒక ప్రభుత్వ కచ్చేరిలో ఎనిమిదేళ్ళకు పైగా ఉద్యోగంచేసి క్రమేణా అధః పతితుడుగా ఎందుకు అయారో ఆలోచిస్తే ఆలోచనకు అందని సమస్యగానే నిల్చిపోతుంది. నేను మిమ్మల్ని ఇంటికి రావద్దని ఎన్నడూ అనలేదే. ఈ కుటుంబం మీది. ఈ కుటుంబ యజమానులు మీరు. ఈ భార్యాబిడ్డల జీవితాలు మీ తోనే పెనవేసుకున్నాయి. సంపాదన ఉన్నా లేకపోయినా ఈ కుటుంబం యజమాని మీరే. కాదని ఎవరన్నారు" అన్నాను.

కాసేపు ఆగి సిగరెట్ వెలిగించారు. నేను మాట్లాడకుండా కూర్చున్నాను.

"కుటుంబ యజమాని నేనయినా గౌరవ మర్యాదలూ, వ్యక్తిత్వమూ నీకే ఉన్నాయి, కాని నా వ్యక్తిత్వానికి గౌరవంలేదు సుభా. కాదంటావా."

"కాదనను. ఈ సత్యాన్ని తెల్సుకున్నందుకు చాలా సంతోషం. మీ వ్యక్తిత్వాన్ని మీరు నిలబెట్టుకుంటే మిమ్మల్నిచూసి నా కన్నా ఎక్కువగా ఎవరూ సంతోషించరు" అన్నాను.

పదిరోజులు గడిచాయి. ఆ నెల ఒకటో తేదీ ఆదివారం అయింది. రెండవతేదీ సోమవారం జీతం వచ్చింది తాను విశాఖపట్నం వెళుతున్నాననీ పదిరోజులవరకూ రాననీ చెప్పి అన్నయ్య నూటయాభై రూపాయలూ సోమవారం సాయంత్రం ఏడుగంటలకల్లా తెచ్చి ఇచ్చి వెళ్లిపోయాడు, నా జీతంలో నూటయాభై రూపాయలూ అన్నయ్య ఇచ్చిన నూటయాభై మొత్తం మూడువందలూ నా పెట్టెలోపెట్టి తాళం వేశాను, తాళం చెవి నా మెళ్లో గొలుసులోనే ఉన్నది. ఆ రాత్రి వారు ఇంట్లోనే వున్నారు,

తెల్లవారి ఉదయం కాఫీ తాగాక వారు వెళ్ళిపోయారు, రోజూ ఉదయం ఎనిమిది గంటలలోపే ఒక్కొక్కప్పుడు వెళ్ళిపోతారు. అట్లాగే ఆ రోజూ వెళ్ళిపోయారు. ఉదయం తొమ్మిది గంటలకు ఇంటి యజమానికి అద్దె ఇవ్వాలని తాళం చెవితో నా పెట్టె తాళంతీసి డబ్బుకోసం చూశాను, మూడు వందలూ లేవు. అన్నీ పదిరూపాయల నోట్లు, ముప్పై కాగితాలు. నా గుండె ఝల్లుమన్నది. పెట్లో ఉన్న బట్టలన్నీ తీసి విదిలించాను డబ్బులేదు. అందరం కలిసి ఇల్లంతా వెతికాం, ఎక్కడా కనబడలేదు, తల బాదుకున్నాను.

"ఇంకెందుకూ వాడే ఏ మారు తాళం చెవితోనే పెట్టెతీసి ఆ డబ్బు తీసుకుని ఉంటాడు. అనుమానంలేదు" అన్నది అత్తయ్య.

మరొక కొత్త పరీక్ష, ఏభై రూపాయలు ఇంటద్దె. వెచ్చం కొట్టు షావుకారికి నూటపది. పాలూ, పెరుగు వాళ్ళకి నలభై రూపాయలు, పని మనిషికి అయిదు రూపాయలు, పెద్దవాడి స్కూల్ జీతం పది. అక్కయ్య ట్యుటోరియల్ కాలేజీలో చేర్తానన్నది. ఈ మూడువందలే చాలవే. ఎట్లాగురా భగవంతుడా అనుకుంటుంటే ఇప్పుడు మొదటికే మోసం వచ్చిందని తల బాదుకున్నాను, ఇప్పుడు ఏం చేసేటట్లు? ఎవర్ని అడగాలి? అయినా ఎవరిస్తారు? అమ్మేందుకు ఏమున్నది?

వారి మీద కోపమేకాదు, అసహ్యం కలిగింది. పది పదిహేనేళ్ళ ఏ బాధ్యతా లేని స్కూలు కుర్రాడిలా ఈ దొంగతనం ఏమిటి? పైగా భార్య సంపాదన విలాసాలకు ఖర్చు పెట్టటమా? ఈ మనిషి బ్రతికేం.... ఛీ ఛీ ఏం జన్మ. పరిపరి విధాల తల్చుకుని బాధపడ్డాను.

ఇప్పుడు ఇంటి యజమానితో ఏం చెప్పాలి? మెల్లిగావెళ్లి ఆయనతో చెప్పాను. "వారు ఏదో తొందరగా అవసరం ఉంది డబ్బంతా తీసుకుని వెళ్ళిపోయారు బాబుగారూ. రాగానే అడిగి తీసుకుని అద్దె ఇవాళో రేపో

ఇచ్చేస్తాను." ఆయన తల పంకించి "సరేనమ్మా" అన్నాడు. జీవితం దిన దిన గండంగా ఉన్నది.

మేం అనుకునేవన్నీ పెద్దవాడు విన్నాడు.

"నాన్న దొంగతనం చేశాడా అమ్మా. అసలు నాన్న ఇట్లా తయారయారెందుకూ? దొంగతనం చెయ్యటం ఎందుకూ? ఉండు రాగానే కనుక్కుంటాను" అన్నాడు. ఈ ఏడేళ్ళ వాడి దృష్టిలో వారు ఎంతో నీచంగా చూడబడుతున్నారు. పరువూ, మనిషియందు విలువాపోయాక జీవచ్ఛవంలా బ్రతకడమే అవుతుంది.

ఆ రోజు వారు ఎప్పుడు వస్తారోనని శలవుపెట్టి ఇంట్లోనే ఉన్నాను. పెదవాడు ఏదో శలవు కావడంతో స్కూలుకు పోకుండా ఇంట్లోనే ఉన్నాడు.

పన్నెండు గంటలకు వారొచ్చారు. ఏమీ ఎరగనివారిలా ఉన్నారు.

"పెట్లో మూడువందలూ తీశారా" అన్నాను.

"అవును తీశాను."

"ఎందుకు తీశారు. మీకా డబ్బుమీద ఏం అధికారం ఉన్నది. మీరేం సంపాదించి భార్యా పిల్లల్ని పోషిస్తున్నారా? పైగా మారు తాళం చెవితో పెట్టెతీసి దొంగతనంగా రాత్రిపూట డబ్బు తీశారే. సిగ్గూ అభిమానమూ ఎప్పుడో వదులుకున్నారు. భార్య సంపాదనమీద ఆధారపడి ఉంటూ, నికృష్టజీవితం గడుపుతూ, పైగా రెక్కలు ముక్కలు చేసుకుని నెలల్లా కష్టపడి సంపాదించిన నెల జీతాన్ని ఒక్క క్షణంలో మీ విలాసాల కోసం ఖర్చు పెట్టుకోటానికి దొంగతనంగా ఎత్తుకుపోయారే. ఛీ! మీదీ ఒక బ్రతుకేనా. ఈ నెలల్లా ఎట్లా బ్రతకాలి, ఉన్న అప్పులు ఎట్లా తీరుతాయి. ఈ ఇంట్లో మీకు స్థానంలేదు. ప్లీజ్ గెటవుట్".

రౌద్ర మూర్తినే అయ్యాను. నా కళ్ళు చింత నిప్పుల్నిరాల్చాయి. కోపం అసహ్యం వారియందు పూర్తిగా కలిగింది. "వెళ్ళిపోరేం" అన్నట్లు

అయిష్టతగా చూశాము. "నాన్నగారూ, దొంగతనం పాపం. తప్పు నాన్న గారూ. ఆ డబ్బు ఎక్కడ దాచారో ఇచ్చేయండి. నేను బడికి జీతం కట్టాలి, పుస్తకాలు కొనుక్కోవాలి. రండి రండి ఆ డబ్బు ఎక్కడ దాచారూ. ఆ డబ్బిచ్చేసి పది గుంజీలు తీస్తే ఈ సారికి అమ్మ ఊరు కుంటుంది" అన్నాడు పెద్దవాడు.

"వాడికున్న పాటి జ్ఞానంకూడా నీకు లేకపోయిందిరా. దౌర్భా గ్యుడా. ఇందర్నీ ఏడిపించి మా ఉసురు పోసుకుని ఆ గడ్డి తినకపోతే ఏం? నీదీ ఒక బ్రతుకేనా, పో బైటికి" అన్నది అత్తయ్య. అనిదకూ ప్రాణం విసిగిపోయింది. ఏడుస్తూ కూర్చుంది.

"సుభాషిణీ" పెద్దగా అరిచారు. పిడికిలి బిగించి వేళ్ల నలుపు కుంటూ నిల్చున్నారు.

"ఎందుకట్లా అరుస్తారు."

"అరవటం కాదు. నాలో చెలరేగే సంఘర్షణ, కత్తిమీద సాము లాంటి అప్పులు తీర్చుకోడానికి ఆ డబ్బు వాడాను సుభా, దొంగతనంచేసి ఆ డబ్బుతో నా బాకీలు తీర్చుకున్నాను. ఇంత చదువుకుని ఎందుకూ పనికి రాకుండా అయిపోయాను. నా పరిస్థితిచూసి ఎవరూ నన్ను నమ్మి ఉద్యో గం ఇవ్వరు. ఇంకెప్పుడూ ఇట్లాంటి పని చెయ్యను సుభా – ఇట్లాంటి దొంగతనం చెయ్యను. నన్ను క్షమించు" కళ్ళ నీళ్ళు పెట్టుకుని నాచేతులు పట్టుకున్నారు. అత్తయ్య కాళ్ళు పుచ్చుకుని ఏడ్చారు.

పది నిమిషాలు ఎవ్వరం మాట్లాడలేదు. ఇంత దిగజారిపోయిన ఈ మనిషిని ఏమనాలో అర్థంకాలేదు. అన్నీ వదులుకున్న వీరికి మతి భ్రమించిందేమో అనుకున్నాము.

"చూడండి, ఇంత చదువుకున్నారు. ఉద్యోగం చేశారు. ఇంత అజ్ఞానంగా ఎందుకు బ్రతుకుతున్నారు. మళ్లా ఏదయినా ఉద్యోగం చేసు కొని గౌరవంగా ఎందుకు బ్రతకకూడదు. కుదురుగా ఉద్యోగం చేసు కుని పోయిన గౌరవాన్ని ఎందుకు నిలబెట్టుకోరు? అసలు మీ ఉద్దేశ్యం

ఏమిటి. సర్వం పోగొట్టుకున్నాం. ఇంకా మేం మిగిలాం. మేం ఈ మాత్రంగానైనా బ్రతకడానికి మీకు ఇష్టం లేకపోతే అందరం చచ్చిపోదాం. ఈ వంశానికి ఇదొక శాపమేమో" అన్నాను.

"మీ మీద నా మనస్సులో ఏ కల్మషమూ లేదు సుభా. మానసికంగా ఎంతో బాధపడుతున్నాను. ఎప్పుడు ఏం చేస్తానో నాకే తెలియటం లేదు. సర్వ విధాలా భ్రష్టుడినయ్యాను. ఈ మానసిక సంఘర్షణ నా చేత అనేక దుర్మార్గాలను చేయిస్తున్నది, ఇంక కుదురుగా ఉద్యోగం చేయలేను ఆయాసపడుతూ ఉద్రేకంగా అన్నారు.

ఆ సాయంత్రం రాధ వచ్చింది. జరిగిందంతా చెప్పాను. రాధ నిట్టూర్చి అన్నది,

"మన సంఘంలో స్త్రీకి వైధవ్యం అనేది భర్త చచ్చిపోతేనే కలుగుతుంది. భర్తతో తెగతెంపులు చేసుకున్న స్త్రీని భర్త పరిత్యక్త అంటారు. కాని నువ్వు అందుకు భిన్నంగా ఇకనుంచీ జీవించాలి. నువ్వు శారీరకంగా మానసికంగా మాంగల్యం ఉన్న వితంతువుగా జీవించాలి. బావతో అన్ని సంబంధాలూ తెగ తెంపులు చేసుకుని పూర్తిగా అతన్ని మర్చిపోయి ఇద్దరు పిల్లల్నీ వృద్ధిలోకి తెచ్చుకో. మీ జీవితాలనుంచి పూర్తిగా తొలగిపోమని బావతో నిష్కర్షగా చెప్పెయ్యి. మీకు కనబడకుండా ఈ విశాల ప్రపంచంలో బావ ఎక్కడవున్నా బ్రతికి ఉన్నంతవరకూ నువ్వు పునిస్త్రీవి. అతను చనిపోయాడని ఎప్పటికయినా తెలిస్తే ఆ మాంగల్యాన్ని అప్పుడే తీసెయ్యి. నిత్యమూ నిన్ను చంపుతూ ఏదో ఒక దుర్మార్గాన్ని సృష్టించే ఆ భర్తతో నువ్వు కాపురంచేసి జీవితాంతం మనశ్శాంతి లేకుండా బాధపడేకన్నా నువ్వు వితంతువు కావటమే శ్రేయస్కరం, ఎంత దుర్మార్గుడైనా భర్తను ఏ స్త్రీ చంపి తనకు తానుగా వైధవ్యాన్ని సృష్టించుకోలేదు కనుక ఆ పరిస్థితి వచ్చేవరకూ బావకి అన్నివిధాలా దూరంగా ఉంటమే మంచిది."

రాధ చెప్పిన మాటలు మోడుబారిన నా మనస్సుని ఎంతో కలచి వేశాయి. ఆ ప్రాణ త్యాగమేదో నేనే చేసుకుంటే బాగుండుననిపించింది. కాని పిల్లలు, వాళ్ళని ఎవరు పెంచుతారు?

ఇద్దరం కలిసి రామారావుగారింటికి వెళ్ళాము, వారి భార్య ఉన్నది. అతనింకా ఇంటికి రాలేదు. నేను ఉద్యోగంలో చేరినప్పట్నుంచీ మా పెళ్ళయినప్పట్నుంచీ మా కుటుంబంలో జరిగే ప్రతి విషయమూ రామారావుగారికి తెల్సు. ఆయనా బాధపడి ఎప్పటికప్పుడు తగిన సలహా సహాయాన్ని అందించేవారు. అందుచేతనే వారింటికి వెళ్ళాను, ఆయన భార్యతో అన్ని విషయాలు చెప్పాను. ఆవిడ ఎంతో విచారపడింది.

రాత్రి ఎనిమిది గంటలకు రామారావుగారు మా ఇంటికి వచ్చారు. జరిగిన విషయాలు చెప్పి ఎక్కడన్నా మూడొందల రూపాయలు అప్పుగా ఇప్పిస్తే నెలకు పాతిక చొప్పున తీరుస్తానని చెప్పాను. లేకపోతే సంసారం గడిచే అవకాశంలేదు. ఆయనా ఎంతో బాధపడి ఎట్లాగయినా వారిని వదిలించుకోమనే సలహా చెప్పారు. "కాని ఇంటికివచ్చే భర్తను విరోధిగా భావించి ఎట్లా వెళ్ళమనాలి? కోపంలో ఇంటికి రావద్దని గట్టిగా చెప్పినా ఇంట్లోకి వస్తుంటే ఎట్లా వెళ్ళగొట్టాలి? ఈ రోజుల్లో ముష్టివాణ్ణికూడా రోడ్డుమీదికి నెట్టివేసి తలుపు వేసుకోలేమే? మాటలకు పశుబలం అక్కర్లేదు. చేతితో పనిలేదు. పరిస్థితినిబట్టి ఎన్నో అంటాం. కటువుగా మాట్లాడుతాం. కాని మెడబట్టి బైటికి గెంటివెయ్యగలమా? అందులోనూ భర్త మీద చెయ్యిచేసుకుని గెంటివేస్తే, వారిలో కరుడుగట్టిన ఇన్ని సంవత్సరాల దుర్మార్గమూ నూరుగున పడిపోయి నా మనస్తత్వం బయటపడి అందరి దృష్టిలో అనేక రకాలుగా ఆలోచించటానికి ఎంతయినా అవకాశం కలుగుతుంది. ఏ పాపనలేని భర్తను ఈసడించి వెళ్ళగొట్టి నేనెవరితోనో కులుకుతున్నాననే నిర్ణయానికి వస్తారు. అందరి దృష్టిలో నేను కులటగా, జారిణిగా మారిపోతాను. సంఘంలో నాకు గౌరవం ఉండదు. భర్తను వెళ్ళగొట్టిన వన్నెలాడి అంటారు. నాలో వన్నె చిన్నెలు లేకపోయినా అందరి మనస్సులో నేను పరమ వ్యభిచారిణిగా నిల్చిపోతాను.

"సంఘం నన్నట్లా అర్థం చేసుకుంటుందని చెప్పాను నా అ౦ ప్రాయాలు ఆ భార్యా భర్తలకు నచ్చాయి. ఎంతో ఆలోచించి రామారావు అన్నారు. "నువ్వన్నది నిజమే సుభాషిణీ, వాణ్ణి మార్చినా, చంపినా ఆ పని భగవంతుడే చెయ్యాలిగాని మనవల్లకాదు. సరే ఆ మూడువందల రూపాయలూ వడ్డీ లేకుండా నేనే అప్పుగా ఇస్తాను. నెలకు పాతిక చొప్పున ఒక సంవత్సరంలో తీర్చెయ్యి. నీ పరిస్థితి నిజాయితీ నాకు తెలుసు కను కనే ఈ కష్టదశలో ఈ సహాయం చేస్తున్నాను రేపు ఉదయం ఎనిమిది గంటల తరువాత నేనే బ్యాంకునుంచి మీ ఇంటికివచ్చి డబ్బిస్తాను, ఆ నికృష్టుడు ఉంటే తల వాచేట్లు చివాట్లూ వేస్తాను" అన్నారు.

కృతజ్ఞత చెప్పి నేనూ రాధా వచ్చేశాం.

ఆ మర్నాడు తొమ్మిదిగంటలకు రామారావుగారు వచ్చారు. వారూ ఇంట్లోనే ఉన్నారు. "ఏరోయ్ కుమార్. కులాసా. మళ్ళీ ఏదో ఘనకార్యం చేశావుట. నీకు మతిలేదురా. నువ్వు బాగుపడవు సరే ఆ ఇల్లాలినికూడా నానా అవస్థలూ పెడతావెందుకురా. సర్వ భ్రష్టుడివవటంకాక భార్య జీతం కూడా కైంకర్యం చెయ్యటం ప్రారంభించావన్న మాట. సిగ్గులేదు ఆ ఇల్లాలు కాబట్టి నువ్వుచేసే ఘాతుక కృత్యాల నన్నింటినీ ఇన్నేళ్ళనుంచీ సహిస్తున్నది. ఇంకొక ఆడదయితే చెప్పుతో దేహశుద్ధి చేసేది. అమ్మాయి జీతంకూడా నువ్వు తినేస్తే ఇంక సంసారం ఎట్లా గడుస్తుందిరా కుమార్" అన్నారు. జేబులోనుంచి డబ్బుతీసి మూడువందలూ నా చేతికిచ్చారు

"నెలకు పాతిక చొప్పున తీర్చే పద్ధతిమీద అప్పుగా మూడు వందలూ ఇచ్చాను, నువ్వు ఎట్లాగూ బాగుపడవు. అమ్మాయి మనస్సు ఉసురు పెట్టకు" అన్నారు రామారావుగారు,

వారు మా ఇద్దరివైపూ నిశితంగా చూశారు. ఒక్క విషపు నవ్వు నవ్వి.

"పాపం! సుభాషిణి అంటే ఎంత అపేక్ష ఆ ఇల్లాలియందు ఎంత సానుభూతి మూడువందలూ వడ్డీలేకుండా నెలకు పాతికచొప్పున తీర్చే

పద్ధతిమీద అప్పుగా ఇచ్చావేం. అందుకనే కామాలు రాత్రి తొమ్మిది దాటాక మీ ఇంటినుంచి వచ్చింది. మీ సంబంధం ఈ రోజున తెల్సింది. అప్పుకాదు. ప్రియురాలికి సహాయం అంతేకదూ" అన్నారు.

"రాస్కెల్ ఏం కూశావురా" అని మితిమీరిన కోపంలో వారి దవడలు వాయగొట్టారు. నాకు స్పృహ తప్పింది. పడిపోయాను.

అమ్మా, అత్తయ్యా ముఖాన నీళ్ళు చల్లారు. పది నిమిషాలకు స్పృహవచ్చింది కళ్ళుతెరిచి చూశాను వారు లేరు. అప్పుడే వెళ్ళిపోయారు. రామారావుగారు చాలా బాధపడ్డారు.

"వాడు మనిషి కాదమ్మా పశువు. రాక్షసుడు. ఇటువంటి కిరాత కుణ్ణి ఎక్కడా చూళ్ళేదు" అన్నారు.

కాసేపు కూర్చుని వెళ్లిపోయారు. వారం రోజులవరకూ వారు రాలేదు. రాలేదని మేమూ అనుకోలేదు. పాడయిన వస్తువు బాగు చేయించు కోవచ్చు. అనారోగ్యంగా ఉంటే వైద్యం చేయించుకోవచ్చు. వినే మనిషికి హితబోధ చెయ్యవచ్చు. కాని కుళ్ళిపోయిన పండు తినే తిరుగా పక్వానికి రాదు. చివరకొద్దీ ఇంకా కుళ్ళిపోతుంటి. వాసన, పురుగులు వారి జీవితం మన సత్వం కుళ్ళిపోయిన పండులాంటిది.

పిల్లలిద్దరూ దడుచుకున్నారు. నేను పుట్టి బుద్ధెరిగిన తరువాత స్పృహతప్పి పడిపోవటం ఇదే మొదలు.

"అమ్మా. నాన్న పిచ్చి, నువ్వు మంచినాన్నకి జిలాయిలు, నాన్నకి అన్నం పెట్టొద్దు, బూచాడికి పట్టించు" అన్నాడు చిన్నవాడు.

"అమ్మా మా బళ్ళో అబ్బాయి నాన్న ఇట్లా చెయ్యడే, ఆయన దొంగకాదు, ఉద్యోగం చేస్తాడు. అబ్బాయిని ఎత్తుకుని ముద్దు పెట్టు కుంటాడు. నాన్న నన్నెప్పుడూ ముద్దు పెట్టుకోడు. దొంగలు పిల్లల్ని ముద్దు పెట్టుకోరా అమ్మా" అన్నాడు పెద్దవాడు.

నా కడుపు తరుక్కుపోయింది. బాధపడినా చేసేదేముంది ?

పదిరోజులు గడిచాక వారొచ్చారు. కొత్త పాంటు, షర్టు. కొత్త బూట్లు ఎంతో దర్జాగా, ఠీవిగా ఉన్నారు. పిల్లలకు బిస్కట్లూ, చాక్‌లెట్లూ తెచ్చారు. రెండు బుట్టలనిండా రకరకాల పళ్ళూ, పూలూ తెచ్చారు. నాకు సిల్కు చీరె. సిల్కు జాకెట్ పీస్ తెచ్చారు. మంచి ట్రిమ్‌గా ఉన్నారు.

ఆశ్చర్యపోయాం. రెండో వాణ్ణి ఎత్తుకుని నవ్వుతూ కబుర్లు చెప్పారు. పెద్దవాడికి చక్కటి స్కూల్ బ్యాగ్ తెచ్చారు. నవ్వుతూ అందర్నీ పలకరించారు. పాత శ్రావణకుమార్ కాదు. కొత్త మనిషి కొత్త భావాలు.

"ఏమిటండీ ఇదంతా? పీటికి దబ్బెక్కడిది. ఇంతగా మారిపోయారు. ఏమిటి విశేషం."

భయపడుతూనే అడిగాను.

"సుభా, జరిగిందంతా ఒక పీడకల. ఒక పెద్ద కార్ల కంపెనీలో ఉద్యోగం దొరికింది, రెండువందల యాభై జీతం. క్వార్టర్సు కూడా ఉంటాయి. రెండు మాసాల జీతం అడ్వాన్సుగా ఇచ్చారు. జరిగిందంతా మర్చిపో. అంతా ఒక పీడకల" అన్నారు.

వారు ఎంతకయినా సమర్థులు. నేను నమ్మలేదు. మళ్ళీ ఏదో కొత్త ఎత్తు వేసేందుకు ఈ పన్నాగం అనుకున్నాను.

"నన్ను నమ్మలేదుకదూ."

"ఇన్ని నెలలు ఏడిపించిన వారు ఒక్క పదిరోజుల్లో మారిపోతా రని ఎట్లా నమ్మమంటారు."

"నిజమే సుభా. ఆ పరిస్థితిలో నేను ఉన్నా అంతే. కాని ఇది యదార్థం. మన జీవితంలో చెడు రోజులు తొలగిపొయ్యాయి. కోరికలు కొత్త శక్తులతో విరబూస్తయి. బంగారు కలలుకంటాము. పాతభావాలూ,

ఉద్దేశ్యాలూ ఏమీలేవు. నా బుద్ధికి గ్రహణం పట్టింది. ఇప్పుడు గ్రహణం విడిచింది. కొత్త భావాలతో, కొత్త కోరికలతో నూతన దంపతుల్లా ఏకం కావాలి" అని కొంటెగా నా వైపు చూశారు.

వారు కోరినట్లుగా ఆ సిల్కు చీరె కట్టుకున్నాను. ఇన్ని పూలు తల్లో తురుముకున్నాను. పిల్లలు అమితానందంతో చాక్లెట్లూ, బిస్కెట్లూ తిన్నారు

ఆ రాత్రి మొదటి రాత్రిలా గడిపాము.

# 16

వచ్చిపోయిన నా మనస్సుకు నూతనోత్తేజం కలిగింది. అనుభవాలు దూరమైతే కోరికలు తలెత్తవు. దగ్గరైతే అనుభవం కొత్త కోరికల్ని సంతరించుకుంటుంది.

రోజూ ఉదయం తొమ్మిది గంటలల్లా భోజనంచేసి టాయిలెట్ అయి డ్రస్ చేసుకుని ఆఫీసుకు వెళ్ళేవారు. రాత్రి ఎనిమిది గంటలకు ఇంటికి వచ్చేవారు. ప్రతిరోజూ పిల్లలకు బిస్కెట్లు, నాకు రకరకాల పూలు. వారితో పిల్లలతో రెండు సినిమాలకూ వెళ్ళాను. మాకు తెల్సిన వాళ్ళు కొంతమంది కనిపించారు, అందరితోనూ ఎంతో ఆప్యాయంగా మాట్లాడారు. కొత్తగా ఉద్యోగం దొరికిందని చెప్పారు. జీవితంలో. జీవిత గమనంలో, అనుభవాల్లో మార్పు వచ్చినందుకు సంతోషించారు.

ఒక రోజున అడిగాను :

"ఇదంతా కలా నిజమా, మమ్మల్ని మురిపిస్తున్నారా. లేక పెద్ద నక్షత్రం మాసిపోయిందా"

"అన్నీ అద్దంకులూ తొలగిపోయాయి సుఖా. అందని ఆనందాల్ని కూడా అందుకని అనుభవించుదాం కొత్త జీవితానికి ఇది నాంది అన్నారు.

మరొక వారం గడిచింది, ఉదయం నిద్ర లేచేసరికి వారులేరు. నా మెళ్ళో గొలుసులేదు. చేతులకున్న బంగారు గాజులు లేవు. కళ్ళు నులుముకుని ఒక్క అంగలో మంచం దిగాను.

"అమ్మా, నా మెళ్ళో చంద్రహారం, పుస్తెలతాడూ, చేతిగాజులూ లేవే" అని అక్కయ్య పెద్దగా ఏడుస్తూ అన్నది. అందరం ఒకచోట చేరాం. అక్కయ్య మెళ్ళో పది నవర్సుల చంద్రహారం, చేతులకు నాలుగు నవర్సుల గాజులూ లేవు. మూడు కాసుల కొబ్బరితాడు లేదు. నా మెళ్ళో బంగారు గొలుసూ, చేతుల గాజులూ లేవు. వారి పనేనని ఊహించాము. అయితే మాకు తెలీకుండా ఎట్లా ఇవన్నీ తీశారు? అక్కయ్య గోడు గోడున ఏడ్చింది.

"సుఖా. అనలే నాది చచ్చీచావని జీవితంగా ఉన్నది. మంచి రోజులు వచ్చి ఆ మెట్రిక్ పాసయితే నేనే ధైర్యంచేసి వారివద్దకు వెళదామనుకన్నాను. నా మెళ్ళో తీస్న చంద్రహారమూ, కొబ్బరి తాడూ, చేతుల గాజులూ అన్నీ వారు పెళ్ళిలో చేయించి ఇచ్చినవే. ఇన్నాళ్ళూ వాటిని కాపాడుకుని ఈ ఆఖరు రోజుల్లో ఈ నగల్ని పోగొట్టుకున్నాను. వారు నన్ను స్వీకరించటానికి ఒప్పుకున్నా వంటిమీద చిన్నం బంగారం లేకుండా వెళితే వారేమనుకుంటారో ఆలోచించు. ఇన్నాళ్ళూ నీకు తిండి పెటినందుకు ఈ నగలన్నీ మీ చెల్లెలికి, మరిదికే ఇచ్చి వచ్చానా. అని నానా మాటలూ అంటారు: అన్నింటికన్నా విపరీతం! అతుతంగా నా మెడ తయారయింది, నా మెళ్ళో మంగళ సూత్రాలు కూడా లేవు, నా భర్త నన్ను వదిలిపెట్టారుగాని మరణించలేదు" అని వెక్కి

వెక్కి ఏడువసాగింది అక్కయ్య. అమ్మా. అక్కయ్యా వెత్తి నోరూ బాదుకుని ఏడువసాగారు.

దుఃఖమయ జీవితానికి స్వస్తి చెప్పినట్లుగా నటించి నన్నెంతో మురిపించి అరిచేతిలో వైకుంఠం చూపి, అందలం ఎక్కించి ఒక్కసారి సముద్రంలో విసిరివేసినట్లయింది. వారిమీద ఎంతో అసహ్యం కలిగింది. జీవితంలో చరమాంకం ఆఖరు కావచ్చింది. ఆరిపోయే లైటు ప్రకాశ వంతంగా వెలిగినట్లుగా నా భర్త నన్ను ఆదరణగానే చూస్తున్నారనిఎంతో మురిసిపోయాను. కాని ఎంతో చక్కగా నటించారు. అందరి కళ్ళల్లో కారం కొట్టారు.

"అక్కయ్యా, మెళ్ళోవీ, చేతులవీ తీస్తుంటే నీకు మెలకువ రాలేదా?"

''లేదు నాకు బాగా నిద్రపట్టింది."

"నా కేదో అనుమానం కలిగింది. రోజూకన్న బాగా నిద్రపట్టిందా' రోజూ మాదిరి ఒకరాత్రివేళ పెరట్లోకి వెళ్ళటానికి లేవలేదూ?"

"లేను, వళ్ళు తెలియకుండా నిద్రపటింది. మరి నీకూ నిద్ర పట్టిందా?"

"ఆ, నాకూ మొద్దునిద్ర పట్టింది: నా అనుమానం నిజమేకావచ్చు' మనిదరి ముక్కుదగ్గరా ఏదోకా స మత్తుమందు వాసన చూపించి ఉంటారు. అంచే నే మనకు ఎన్నడూ లేనంతగా నిద్రపట్టింది."

"నిజమే కావచ్చు. మరి ఇప్పుడు ఏం చెయ్యాలి?" కళ్ళు తుడుచుకుని అడిగింది అక్కయ్య.

"పోలీసు రిపోర్టు ఇస్తే"

''పిచ్చిదానా మనగొయ్యి మనమే తవ్వుకున్నటు అవుతుంది. బైట పడి ప్రయోజనంలేదు. వారే మనకు చక్కగా వ్యతిరేకంగాచెప్పి చక్కగా మనల్ని ఇరికిస్తారు. మా వదినెగార్ని భర్త వదిలిపెట్టారు. ఇన్ని సంవత్స

రాంనుంచీ నా అధీనంలోనే ఉన్నది. ఆవిడే నన్ను అమ్మకురమ్మని ఇచ్చింది. మళ్ళీ మనసు మార్చుకుని నా మీద అబాండం వేసిందంటారు. వస్తువులు పోవడమే కాకుండా మనం అల్లరిపడతాం" అన్నాను.

అక్కయ్య సందిగ్ధావస్థలో పడ్డది. "నేను చెప్తున్నాను వారు ఈ నగల కోసమే ఈ ఎత్తు ఎత్తటానికి ఇట్లా నటించారు. వారి అభిలాష సిద్ధించింది, ఇంక వారు మన ఇంట్లో ఎత్తుకుపోయేది ఏమీలేదు, సర్వం వారు చేజిక్కించుకున్నారు ఇంక వారు ఇక్కడికి రారు. వారితో ఆఖరి అనుభవమూ, ఆఖరి కోరికా అన్నీ తీరాయి. ఇక సొమ్మురాదు-వారు రారు."

నా నిర్ణయాన్ని ఉద్దేశాన్ని చెప్పేశాను. ఇంక వారు ఈ ఇంటి గుమ్మం తొక్కుతారనే నమ్మకమూ లేదు.

"అన్నయ్యతో చెబితే" అన్నాను,

"నిజమే. అసలు వాడి ఆ మాకే మనకు తెలియదుకదా" అన్నది అక్కయ్య.

రామారావుగారింటికి వెళ్ళి చెప్పాను. వారి విషయంలో ఆయనా విసుగెత్తే ఉన్నారు.

"ఆఖరు అస్త్రం ప్రయోగించాడు. ఇక వాడురాడు. పోనివ్వండి. మీ జీవితానికి శనివదిలిపోయినట్లే. పోతూ పోతూ ఇంకా కసితీరా అవమానపరిచి వెళ్ళాడు. పీడ వదిలిపోయింది" అన్నారు.

ఆయన కూడా పోలీసు రిపోర్టు ఇవ్వవద్దనే చెప్పారు. ఇంటికి వచ్చేశాను, ఆ రోజు సాయంత్రం అత్తయ్య వేలికిఉన్న అరకాసు ఉంగరం అమ్మి అక్కయ్యకు రెండు మంగళసూత్రాలు కొనితెచ్చాను. కాళ్ళు పిసుక్కుని ఎంతో బాధపడుతూ కన్నీటితో ఆ సూత్రాలు మెళ్ళో కట్టుకున్నది అక్కయ్య.

జీవితంలో అన్ని విధాలా ఓడిపోయిన నేను అక్కయ్య విషయంలో అంతకన్నా ఏం చెయ్యాలో తోచలేదు. నా కళ్ళల్లో నీళ్ళు ఎప్పుడో ఇంకిపోయాయి. ఇంక ఈ కళ్ళల్లో నీళ్ళు రావు.

రెండు రోజులు గడిచాక సాయంత్రంపూట ఆఫీసునుంచి వస్తున్నాను. బ్రాకెట్ కంపెనీలతో సంబంధం వున్న రెండు బడ్డీకొట్లు కనిపించాయి. ఆ కొట్లముందు పలకమీద ఆ రోజు ఓపెనింగ్, క్లోజింగ్ అంకెలు వేసి వుంటయ్యి. ఒక కొట్టుముందు ఎవ్వరూలేరు. కొట్లో ఒక నడివయస్కుడు కూర్చుని ఉన్నాడు. అతన్ని అడిగాను.

"మీకు వాణీనాథం కాని, శ్రావణకుమార్ గాని తెలుసా" అతనేం కూస్తాడోనని గుండెలు దడదడ లాడినయ్యి అతనూ నావైపు ఎగాదిగా చూసి.

"తెలుసమ్మగారూ వాళ్ళతో మీకేం పని."

"కాస్త మాట్లాడాలి."

"వాళ్ళతోనా. వాళ్ళు అన్నింటికి తెగించిన వాళ్ళమ్మా. మీరక్కడికి వెళ్ళకూడదు. వెళ్ళారో మళ్ళీ మనిషిలా రారు" నవ్వుతూ చూశాడు.

"తెలుసు. కాని వాళ్ళతో మాట్లాడాలి. నేను మాత్రం అలాంటిదాన్ని కాను."

"సరేనమ్మ మీ ఇష్టం. వాళ్ళు బహుశా ఇప్పుడు కళ్యాణి లాడ్జింగులో ఉంటారు."

"ఎక్కడది."

గుర్తు చెప్పాడు. ఎందుకో మొండి ధైర్యం కలిగింది రిక్షా ఎక్కి కళ్యాణి లాడ్జింగుకు తీసుకువెళ్ళమన్నాను. పది నిమిషాల్లో అక్కడికి చేరుకున్నాను. రిక్షాలో కూర్చునే రిక్షా అతన్ని వెళ్ళి వాణీనాథాన్ని కాని, శ్రావణకుమార్నికాని ఉంటే పిల్చుకు రమ్మన్నాను.' వాడు మేడ మీదికి వెళ్ళాడు. అ వ్యక్తి మేడ దిగి వచ్చాడు. రిక్షాలో కూర్చున్న నన్ను చూసి ఆశ్చర్యపోయాడు. బ్రతుకు జీవుడా అనుకున్నాను.

"సుభా. నువ్వా, ఇక్కడి కొచ్చావెందుకూ. డబ్బు కావాలా" అన్నాడు వాడూ కంగారుపడిపోతున్నాడు.

"ఒక్కసారి ఇప్పుడే ఇంటికి రావాలి" అన్నాను.

"పద, ఓ గంటలో వస్తాను" అని వెంటనే వెళ్ళిపోయాడు. నేనూ రిక్షాలో ఇంటికి చేరాను,

రాత్రి పదింటికి అన్నయ్య వచ్చాడు. జరిగిందంతా చెప్పాను.

అట్లాగా. బావ మా కూటమిలో లేడు. నాకిదంతా తెలీను అయినా కనుక్కొని పట్టేస్తాను. ఎక్కడెక్కడ వెతకాలో నాకు తె ను. సరే వెళ తాను" ఏం చెప్పకుండా అన్నయ్య వెళ్ళిపోయాడు. ఇంట్లో నగలుపోయి వస్తు ఇంటివారికీ వారి ద్వారా చుట్టుపక్కల వాళ్ళకీ అందరికీ తెల్సింది ఆ మర్నాడు నదయమే ఇంటాయనా, ఇంటావిడావచ్చి "మా ఇంట్లో ఇటువంటి దొంగతనాలు జరిగినయ్యంటే మాకెంతే చిన్నతనంగా ఉంది. మీరు వారం రోజుల్లో ఇల్లు ఖాళీచేసి వెళ్ళండి, మా ఇంట్లో ఉంటానికి వీల్లేదు" అని నిష్కర్షగా చెప్పేశారు.

ఆ పరిస్థితిలో ఏడవాలో, నవ్వాలో కూడా తెలీక నవ్వేశాను.

"అట్లాగేనండీ ఇల్లు కుదరంగానే వెళ్ళిపోతాను" అని చెప్పాను.

మరో రెండురోజులు గడిచాయి, రాత్రి పన్నెండు దాటింది. తలుపు చప్పుడైంది. అన్నయ్య వచ్చాడేమోనని తలుపుతీశాను.

వాళ్ళొచ్చారు. ఒక్క ఊపులో ఇంట్లోకొచ్చి తలుపు గడియ పెట్టి నా నోరు మూశారు. "ఎవరే" అంటూ అమ్మ. అత్తయ్య వచ్చారు. బొడ్లోనుంచి కత్తి చూపించి అందర్నీ నోరు మూసుకోమన్నారు. అందరికీ చెమటలు పట్టినయ్యి. గుక్కపట్టించి కొయ్యబారిపోయారు. మెల్లిగా అన్నారు.

"సుభా, లాభంలేదు. పోలీసులు తరుముకొస్తున్నారు. పారిపోవాలి. ఈ రక్తపు గుడ్డలు ఇక్కడ విడిచేసి మంచి బట్టలు కట్టుకుని పారిపోతాను. నా బట్టల పెట్టె పట్రా" అన్నారు.

బట్టల పెట్టి తెచ్చాను. రక్తం చిమ్మిన ఆ గుడ్డలు విడిచేశారు. తుండు గుడ్డతో ఒళ్లంతా తుచ్చుకున్నారు. ఆ రక్తపు గుడ్డలూ, కత్తీ కింద పడేశారు. ఇస్త్రీ గుడ్డలు వేసుకున్నారు.

"ఎవర్ని చంపారు" అన్నారు. నన్ను దగ్గరకు పిల్చి వాళ్ళు ముగ్గురూ వినకుండా చెవిలో రహస్యంగా చెప్పారు.

మీ అన్నయ్యతో పేచీ వచ్చింది. పొడిచేశాను. లాడ్జిలో చచ్చిపడి ఉన్నాడు" దిమ్మరపోయాను. నేనేం మాట్లాడలేదు. మనస్సు కాళీ అయింది. కింద పడేసిన కత్తిమీద నాదృష్టి పడింది. వారు వెళ్లిపోవటానికి లేచారు. వార్ని వెనక్కు తిరగనిచ్చి క్షణంలో కత్తి తీసుకున్నాను. కుడి చేతితో ఆ కత్తిని గట్టిగా పుచ్చుకున్నాను. వెనక్కు తిరిగి నిల్చున్న వారి చెయ్యి ఎడమ చేత్తో పుచ్చుకున్నాను. వారు ముందుకు తిరిగారు. శక్తి నంతా కూడ గట్టుకుని ఆ కత్తితో గట్టిగా వారి గుండెల్లో పొడిచాను ఆ కత్తి పిడివరకూ వారి గుండెల్లో దిగిపోయింది.

"సుభా" అంటూ గావుకేక పెట్టి పడిపోయారు. అయిదు నిమిషాలో వారి ప్రాణం పోయింది. నా చీరెమీద రక్తం పడింది. కుడిచేతి నిండా రక్తం చిమ్మింది. వారి గావుకేకకు అందరూ వచ్చారు. కొయ్యబారి పోయి చూస్తూ కూర్చున్నాను. నా కళ్లలో నీళ్లు రాలేదు. నావి నీళ్లురాని కళ్ళు.

"ఆ విధంగా వారిని నేనే చంపేశాను" అని తన కథ ముగించింది సుభాషిణి.

# 17

కేసు వాయిదా పడింది.

ఆ రోజున సుభాషిణితో మాట్లాడి వెళ్లిన వాణీనాధం నేరుగా తన లాడ్జింగుకు వెళ్లాడు. శ్రావణకుమార్ ఎక్కడున్నాడని తన అనుచరులను

అడిగాడు, ఫలాని లాడ్జింగులో ఉన్నాడనీ, కాకినాడనుంచి రామకుమారిని తీసుకువచ్చాడనీ చెప్పారు. రామకుమారి ఏవరో వాణీనాదానికి బాగా తెల్సు. అందరికన్నా సామర్థ్యంతో పది రూపాయలు ఎక్కువ రాబట్టుకోగల దిట్ట.

వాణీనాధానికి ఈ లాడ్జింగులూ, అందులోని వ్యక్తులూ తెల్సు కనుక వెంటనే అక్కడికి వెళ్లి వాకబు చేశాడు. రామకుమారితో ఫలాని గదిలో ఉన్నాడని చెప్పారు.

గది తలుపు తట్టాడు. రెండు నిమిషాలు గడిచాక తలుపు తీశాడు శ్రావణకుమార్, లోపలికి వెళ్లి గడియ పెట్టాడు వాణీనాథం. ఆ ఇద్దరూ తాగిన నిషాలో ఉన్నారు. వంటిమీద బట్టల్లేని రామకుమారి దుప్పటిముసుగు పెట్టింది. వాణీనాధం కుర్చీలో కూర్చుని సిగరెట్టు వెలిగించాడు. ఇట్లా రావడంతో శ్రావణకుమార్‌కి వళ్లు మండిపోయింది.

"సభ్యత తెలుసుకోకుండా వచ్చావ్" ఉడికిపోతూ అన్నాడు శ్రావణకుమార్.

"లాడ్జింగ్ సభ్యతలు నాకన్నా నీకెక్కువ తెలీవు. సరేకాని, నీ దగ్గర చంద్రహారం, పుస్తెలతాడు, గొలుసు, గాజులూ ఉండాలి. వాటిని ఎక్కడ దాచావ్."

"నాకు తెలీదు. అసలవి ఎవరి నగలో నాకేం తెల్సు. నీకు తెలుసా బ్రదర్ ఇన్‌లా" కైపులో అన్నాడు శ్రావణకుమార్.

"ఓహో ఎవరి నగలో కూడా తెలీదేం. మత్తుమందు వాసన చూపించి నీ భార్య మెళ్లో కాజేసిన నగలు, మా అక్కయ్య మెళ్లోకాజేసిన నగలు. ఏం ఇప్పటికయినా తెల్సిందా" కుర్చీలోంచి లేచి అన్నాడు వాణీ నాధం.

"అట్లాగా. వాళ్లవా తెచ్చాను. నీకేం వాళ్లు నా భార్య, నా వదినె, ఆ నగలమీద నాకు బోలెడంత హక్కుంది. నీ కెందుకూ. గెటవుట్" తూలుతూ అన్నాడు శ్రావణకుమార్.

వాణీనాథం మాట్లాడకుండా వెళ్లి రామకుమారి కప్పుకున్న దుప్పటి లాగేశాడు. అమ్మాయి మెళ్లో గొలుసుంది. చేతులకు గాజులున్నాయి. రామకుమారి వణికిపోతూ చీరె కట్టుకుంది.

"ఏయ్. ఆ నగల్ని ఇచ్చెయ్" గద్దించాడు. వాణీనాథం సంగతి రామకుమారికి తెల్సు. అయినా మొరాయించింది.

"ఇవ్వవూ" ఇవ్వనని తలూపింది.

"నేనే తీసుకుంటాను" ఒక్క నిమిషంలో మెళ్లో గొలుసూ, చేతులకున్న గాజులూ తీసుకున్నాడు.

"ఏయ్ ఎవర్రా నువ్వు ముండదాని మెళ్లో సొమ్ములు కాజేసావ్. బుద్ధి లేదూ" అని వాణీనాథం రెక్క పుచ్చుకున్నాడు శ్రావణకుమార్. అతను విదిలించుకుని "ఇవాళకి ఇవి దక్కాయి. రేపు మర్యాదగా చంద్ర హారం. పుస్తెలతాడూ పట్రా" అని ఆ నగల్ని తీసుకుని వెళ్లిపోయాడు వాణీనాథం.

"రాస్కెల్, వీడి అంతు చూస్తాను" అని పళ్లు కొరికాడు శ్రావణ కుమార్.

రెండు రోజులు గడిచాయి. రాత్రి పదకొండు దాటింది. లాడ్జిలో ఒకగదిలో లెక్కలు రాస్తున్నాడు వాణీనాథం. ఓరవాకిలిగా వేసి వున్న తలుపునెట్టి లోపలికివెళ్లి గడియ పెట్టాడు శ్రావణకుమార్.

"ఆ నగలు ఇస్తావా లేదా" అన్నాడు.

"ఏ నగలు" లెక్కల పుస్తకం మూసేసి లేచి నిల్చున్నాడు వాణీనాథం.

"ఏ నగలో నీకు తెలియదూ ?"

"ఇద్దరికీ తెల్సు. కాని బావా నువ్వు చేసింది చాలా తెలివి తక్కువ పని. ఆఖరికి నీకు దొరికింది నీ భార్య మెళ్లో నగలూ, నీ వదినెగా మెళ్లో నగలూనా ? వాళ్ళు గోడు గోడున ఏడుస్తున్నారు బావా. వాళ్ళ నగలు వాళ్ళకి ఇచ్చేయ్. బావా, నామాట విను" ప్రాధేయపడుతూ అడిగాడు వాణీనాథం.

"బావ, ఈ వ్యవహారాల్లో బంధుత్వాలకు తావులేదు. మర్యాదగా ఇచ్చెయ్" జేబులోనుంచీ కత్తి తీశాడు శ్రావణకుమార్.

"ఆ నగలు ఇస్తావాలేదా" కత్తి గట్టిగా పట్టుకున్నాడు శ్రావణ కుమార్.

"ఇవ్వను. మర్యాదగా ఆ నగలూ ఇచ్చేస్తే వాటిని తీసుకువెళ్ళి సుభాషిణికీ సునందకూ ఇస్తాను. వాళ్ళెంతో సంతోషిస్తారు. నువ్వే పుస్తెలతాడూ, చంద్రహారం తెచ్చివ్వు బావా. ఇవి చేతులు కావు, కాళ్ళు పట్టుకుని బ్రతిమాలుతున్నాను" అని శ్రావణకుమార్ కాళ్ళు పట్టుకున్నాడు వాణీనాథం, అతన్ని అట్లాగే వెలకిలా పడేసి బలంగా రెండు చోట్ల గుండెల్లో పొడిచాడు శ్రావణకుమార్.

లాడ్జిలో ఈ గది మేడమీద మెట్లపక్కన ఉన్నది. ఆ కత్తి జేబులో ఉంచుకుని గబగబా మెట్లు దిగి వడి వడిగా నడుస్తూ ఇంటికి చేరాడు శ్రావణకుమార్. అతనికి ఏం తోచలేదు. ఆ రక్తపు గుడ్డలూ కత్తి ఇంట్లో ఉంచేసి మంచి బట్టలు వేసుకుని ఎక్కడికో పారిపోదామని శ్రావణకుమార్ ఉద్దేశ్యం.

కాని హంతకుడైన తన భర్తను ఆ కత్తితోనే పొడిచి చంపి తను హంతకురాలుగా నిల్చిపోయింది సుభాషిణి.

ఆ రాత్రే సుభాషిణి తన భర్తను కత్తితో పొడిచి చంపిందని చుట్టుపక్కల వాళ్ళందరికూ తెల్సిపోయింది. శ్రావణకుమార్‌ని అరెస్టు చెయ్యటానికి వచ్చిన పోలీసులు అతని శవాన్నిచూసి ఆ పరిస్థితిలో వున్న సుభాషిణిని అరెస్టు చేశారు.

తెల్లవారేసరికి ఈ వార్త ఊరంతా తెల్సిపోయింది. అందరూ విభ్రాంతితో శవాన్ని చూశారు.

"ఎంత మర్మారుడైనా కత్తితో భర్తను పొడిచి చంపిందా – ఆ ఇల్లాలు" అని ఎంతో ఆశ్చర్య పోయారు, సుభాషిణి సంగతి తెల్సిన

వారంతా, తెలియనివాళ్ళు మరోలా అనుకున్నారు. ఆ సమయంలో ఎవరి భావాలు వాళ్ళవి, ఎవరి విమర్శలు వాళ్ళవి.

ఆ దృశ్యం చూడలేక సుభాషిణి తల్లి. శ్రావణకుమార్ పినతల్లి పడిపోయారు, ఆ చుట్టుపక్కల వాళ్ళంతా పిచ్చి భ్రాంతితో చూసి గుండె పగిలి కొందరు ఏడ్చారు రాధ వచ్చింది. రాధ తల్లీ పిల్లలూ వచ్చారు. రామారావు ఆయనభార్యా వచ్చారు, ఆ వార్త తెలిసిని ఆఫీసు వాళ్ళంతా ఆ అర్ధరాత్రే వచ్చారు. అందరి గుండెలూ ఆందోళనతో కొట్టుకోసాగాయి, సునంద ఏడుస్తూ ఇద్దరి పిల్లల్నీ వళ్ళో పెట్టుకుని కూర్చున్నది. పిల్లలిద్దరూ ఆ దృశ్యాన్ని చూసి భయపడి ఏడుస్తూ కళ్ళు మూసుకుని పడుకున్నారు.

ఒక సబిన్‌స్పెక్టరూ, నలుగురు కానిస్టేబుల్స్ వచ్చారు.

సుభాషిణి స్తబ్ధురాలై గుండె రాయిచేసుకుని భర్త గుండెల్లో దిగబడివున్న ఆ కత్తివైపు చూస్తూ నిల్చున్నది, ఆ కళ్ళలో నీళ్ళులేవు. కన్నీరు ఎప్పుడో ఇంకిపోయింది, అవి నీళ్లురాని కళ్ళు.

సబిన్‌స్పెక్టరు పోలీసు స్టేషన్‌కు నడవమన్నాడు. సుభాషిణి శ్రావణకుమార్ శవం చుట్టూ మూడుసార్లు ప్రదక్షిణంచేసి నమస్కరించింది. సునందతో అన్నది.

“మీ కాపురం బాగుపడుతుంది అక్కయ్యా. ఈ ఇద్దరు పిల్లలూ మా పిల్లలు. కాని ఇకనుంచీ వాళ్ళను పెంచవలసింది మీ భార్యాభర్తలు.”

అని పోలీసుల మధ్య నిల్చుని వీధిలోకి నడిచి పోలీసు వేన్‌లో ఎక్కి కూర్చున్నది

రాధ కాకినాడవెళ్ళి ఈ సంగతి అంతా చెప్పి ఆనందరావును తీసుకువచ్చింది

* * *

రెండురోజులు కోర్టులో తన కథను చెప్పింది సుభాషిణి అన్ని జతల కళ్ళూ చమర్చాయి.

మూడవ వాయిదా రోజునకూడా కోర్టు హాల్లో అందరూ చేరారు. బోనులో నిల్చున్న సుభాషిణి మళ్ళీ చెప్పసాగింది :

"సుభాషిణిగా, ముద్దాయిగా నేను చెప్పిన యదార్థ విషయాలన్నీ విన్నారు. నేను దోషిననీ, హంతకురాలిననీ నేనే ఒప్పుకున్నాను. నాకు శిక్ష విధించమని సవినయంగా ప్రార్థిస్తున్నాను. నా కేసులో తీర్పు యివ్వటంకూడా న్యాయమూర్తికి తేలిక, కాని అది ప్రధానంకాదు.

"ఈ సంఘంలో నా లాంటి హంతకులు లేకపోలేదు అన్నారు. కాని వారంతా పురుషులు. ఈ పవిత్ర భారత దేశంలో హైందవ కుటుంబంలో ఎంతో మర్యాదలు గల గౌరవ కుటుంబంలో పుట్టి. ఇల్లాలుగా కాపురంచేసి ఇద్దరు బిడ్డల తల్లినై ఉండి పెళ్ళాడిన భర్తను దారుణంగా హత్యచేశానంటే అందుకు బాధ్యులెవరు? నా బోటి ఇల్లాండ్ర జీవితం ఎంత దుర్భరంగా ఉన్నదో ఆలోచించండి. ఈ దుర్భర పరిస్థితిసహించి ఎంతో మంది స్త్రీలు బయటపడలేక సతమతమై తమ ప్రాణాల్ని తీసుకుంటున్నారే కాని ఈ నగ్న సత్యాన్ని వేలెత్తి చూపరేం? అందుకు కారణం ఈ మగవారి మనస్తత్వం.

"నాకు శిక్ష పడుతుందని నేను విచారించటంలేదు. నా పరిస్థితిని అర్థం చేసుకున్న ఈ కోర్టు హాల్లోని జనమంతా తమ సంసార జీవితాల్లో నా భర్తలా ప్రవర్తించకుండా తమ కాపురాల్ని తీర్చిదిద్దుకుంటే, నా జీవితాన్ని సవ్యంగా అర్థం చేసుకుని ఈ హంతకురాలిపైద మీరు జాలి పర్చినట్లే, నా ఆత్మ శాంతికి కావలసింది నా లాంటి అభాగినులు ఈ సంఘంలో క్రమేపీ తగ్గిపోవటమే. అందుకు తగిన వాతావరణం ఆ భర్తలూ కలిగించాలి.

"అదే జీవితంలో ఈ ఆఖరు క్షణంలో నాకు కలిగే ఆత్మశాంతి" అన్నది ముద్దాయి సుభాషిణి.

అందరితోబాటుగా న్యాయమూర్తికూడా కళ్ళు తుడుచుకున్నాడు.

తీర్పుని మర్నాటికి వాయిదా వేశాడు న్యాయమూర్తి.

(సమాప్తం.)